# ఎంత ఘాటు ప్రేమయో

## మాదిరెడ్డి సులోచన



లక్స్ పబ్లికేషన్స్
రురోడ్ - విజయవాడ-2



# ఎం[illegible] ప్రేమయో!


రచన :
మాదిరెడ్డి సులోచన

ప్రథమ ముద్రణ :
నవంబరు 1981

ద్వితీయ ముద్రణ :
15 నవంబరు 1981

ముద్రణ :
విజయశ్రీ ప్రింటర్స్
విజయవాడ - 3

ప్రచురణ :
[illegible]స్ పబ్లికేషన్స్
విజయవాడ - 2

వెల : రు. 12-50



# ఎంత ఘాటు ప్రేమయో!

రేస్ రోడ్ అపార్టుమెంట్స్‌లో అంద… భాగంలో కూర్చుని టేప్ రికార్డర్‌లో తెలుగు …లు వింటుంది మాధవి. ఆమె కూర్చున్న చోటునుండి చూస్తే, ఇంటి ముందున్న వివిధ రకాల పువ్వుల మొక్కలు కనిపిస్తున్నాయి. ప్రకృతి అందాలు చూస్తుంటే ఆమెకు ఆ…లో ఆకు…ఖు, పువ్వులో పువ్వు అయిపోవాలనిపిస్తుంది.

పడమట సంధ్యారాగం, కుడి వైపుమల కుసుమ పరాగం…" ఘంటసాలగారి కంఠములో తేనె లూరుతున్నాయి.

"హాయ్! ఏం చేస్తున్నారు మేడమ్?" వసంతరావ్ వచ్చాడు.

"హాయ్ వసంత్! ఈ సమయాన బ్యాంక్ వదిలి ఇక్కడికి రావటం ఆశ్చర్యంగా ఉందే." అన్నది మాధవి.

…నగువను మధువుతో పోల్చారు. నీ నవ్వులో పడి కరిగిపోదామని." అన్నాడు, తనే చనువుగా ఆమె కుర్చీలో కూర్చుంటూ.

"ఏ మత్తు అయినా మత్తే కదా. మామూలుగా ఉండరాదూ ?" అన్నది నవ్వుతూ.

అతను తనెంత గాఢంగా ఆమెను ప్రేమించాడో చెప్పబోయాడు.

"హల్లో మేడమ్!" మధుకర్ వచ్చాడు.

"హల్లో...హల్లో...! ఏం మధుకర్ నల్లపూస వయ్యావ్ !"

"నల్లపూసనయి మా ఆవిడ మెడలో దాక్కుందామంటే, పెళ్ళి కాలేదు." అన్నాడు మధుకర్.

"అబ్బ! ఆ పేద్దూ, ఆ పాటలు యెలా తోస్తుంది ఆ పాటలు వింటుంటే..." వసంతరావ్ ముఖం చిట్లించాడు.

"టేస్టులు వేరు వేరుగా ఉంటాయి వసంత్ !" అన్నది టేప్ ఆపి.

"మరి ఆ విషయం మరిచిపోయి నా త్రాగుడును ఆక్షేపిస్తావేం ?"

"నేను ఆక్షేపించానా! నువ్వే రవంత కూడా నిజం మాట్లాడటం లేదు వసంత్ ..."

"హరిశ్చంద్రుడన్న బోర్డు మెడలో వేసుకుని తిరలేదు."

"బాస్‌ను వదిలి యిక్కడికి వచ్చా అన్నాను !" అన్నది అంతేకదా అన్నట్టు కాళ్ళ

మధుకర్ చూస్తూ ఉన్న మాగజైను బల్లమీద పడేసి వచ్చి ఆమె ప్రక్కన కూర్చున్నాడు.

"బోర్ కొడుతుంది మేడమ్, కార్డ్సు ఆడదామా?"

"కార్డ్సు ఆడటం నాకు రాదు. కావాలంటే ఛెస్ ఆడదాం." అన్నాడు వసంతరావు.

"మీ క్లబ్బులో కార్డ్సు ఆడరా."

"అమ్మా! మాధవీలతా దేవిగారూ! క్లబ్బంటే తమరికి సదభిప్రాయం ఉన్నట్టు లేదు. క్లబ్బుల్లో పేకాట, తాగుడు తప్ప మరేం ఉండవా?" అన్నాడు ఉడుక్కున్నట్టు వసంతరావు.

"గుమ్మడికాయల దొంగలంటే భుజాలు తడుముకున్నారట." నవ్వింది మాధవి.

"యెవరు? మీ ఆడవారు" అన్నాడు రావ్.

"ఎలీసా...ఎలీ..." మధుకర్ కేకలు వేశాడు.

"ఎస్ సార్..." ఏప్రిన్ సవరించుకుంటూ వచ్చింది ఎలి.

"త్రీ కప్స్ టీ..." ఆర్డర్ చేశాడు.

అక్కడ అంటే కెన్యా ముఖ్యపట్టణం అయిన నైరోబియాలో ఫర్టిలైజర్ ఫ్యాక్టరీ ఉంది. ఆ ఫ్యాక్టరీలో ఉద్యోగం చెయ్యటానికి చాలామంది భారతీయులు వచ్చారు.

వాళ్ళల్లో నల్గురు తెలుగు వారున్నారు. మాధవి స్టెనోగా పనిచేస్తుంది. రావ్ బి. టెక్ చేశాడు. మధుకర్

ఎమ్మెస్సీ చేసి కెమిస్ట్‌గా వచ్చాడు. రమణయ్య అని మరొకతను అసిస్టెంట్ అడ్మినిస్ట్రేటర్‌గా వచ్చాడు గాని అతను తెలుగులో మాట్లాడడు, తెలుగువాడినని చెప్పుకోడు. ఒకరు తనింటికి వస్తే కాఫీ, టీల ఖర్చు అంటాడు. ఒకరింటికి మనము వెళితే కారులో పెట్రోలు ఖర్చు దండగ అంటాడు. వీళ్ళు ముగ్గురు తరుచుగా కలుసుకుంటుంటారు.

వసంతరావ్ త్రాగుతూ బార్‌లోనూ, క్లబ్బుల్లోనూ ఉంటాడు.

మధుకర్, మాధవి మాత్రం రెగ్యులర్‌గా కలుసుకుంటారు.

మాధవి ఒంటరిగా స్వదేశం వదిలి వచ్చిననాడే, మగవాళ్ళలో మగవారుగా ఉండే ధైర్యం తెచ్చుకున్నది. ఒకోక్కసారి మధుకర్ స్నేహితులు కెన్నియన్స్, యూరోపియన్స్ వస్తారు. అర్ధరాత్రి వరకు ఆడుకుంటూ గడుపుతారు.

"అది పచ్చి... భోగం..." అంటూ అసభ్యంగా మాట్లాడే రమణయ్యలాంటి వారు లేకపోలేదు.

"మన మనసు స్వచ్ఛంగా ఉన్నప్పుడు యెవరు ఏదో అన్నారని బాధపడటం మూర్ఖత్వం" అంటుంది. ఆమె వ్యక్తిత్వం చూచి అప్పుడప్పుడు మధుకర్ అదిరిపోతుంటాడు.

ఎలీషా టీ తెచ్చింది. ముగ్గురూ త్రాగారు.

"సరదాకయినా ఒక బీరు బాటిల్ ఇవ్వు మేడమ్!" అన్నాడు వసంతరావ్.

"వసంత్ ! అదంత రుచిగా ఉంటుందా !"

"అదిచ్చే కిక్ నీకేం తెలుసు!" అన్నాడు.

"నీకు తెలుస్తుందిలే మహానుభావా! అన్నట్టు మేడమ్, అపార్టుమెంట్ అలాట్ చేసే జూడి కలిశాడు, మీ ప్రక్క పోర్షన్‌లోకి యెవరో యిండియన్స్ వస్తున్నారట." అన్నాడు.

"భారతీయులు లేరని నేను బాధపడ్డానా?"

"ఐ మీన్ తెగ్గువారట... తెగ్గువారు."

"తెగ్గువారా!" ఆమె ఆశ్చర్యంగా చూచింది.

"మాధవిగారూ! మీరు కొన్నిసార్లు చాలా అమాయకంగా అడుగుతారు. తెగ్గువారంటే తెలుగువారని అర్థం." వసంతరావు అన్నాడు.

వసంతరావుకు కార్డ్సు ఆటలో నేర్పారు. ముగ్గురూ కాసేపు ఆడగానే విసుగేసింది. ముగ్గురూ చాలెంజింగ్‌గా ఆడితే ఫరవాలేదు. కాని ఒకరు సమర్థవంతంగా ఆడకపోతే అది నీరసంగా ఉంటుంది.

"అంబూభాయ్ పటేల్ ఇంట్లో బ్యాట్‌మింటన్ ఆడ తారు వెళ్దామా?" అన్నాడు మధుకర్.

"ఇప్పుడు ఎక్కడికి వద్దు. హాయిగా కబుర్లు చెప్పుకుందాం" అన్నది.

"షోసీ హిందీ పిక్చర్ వచ్చిందట, చూద్దామా?" అన్నాడు వసంతరావు.

ఇంతలో ఫోన్ మోగింది. మధుకర్ యెత్తాడు ఒక నిముషం తరువాత మౌత్ పీసుపై చేయి పెట్టాడు.

"మాధవిగారూ! మన యముఁడు..." అన్నాడు మధుకర్!

"మనబాస్‌ను యముడంటే కళ్ళు పోతాయి." మాధవి ఫోన్ తీసుకుని మూడు నిమిషాలు మాట్లాడింది.

"ఓ యస్...పది నిమిషాల్లో అక్కడుంటాను." అన్నది ఫోన్ పెట్టేసి.

"ఏమిటిట!"

"నిన్న వదిలేసిన పని పూర్తికావాలట. ఆయన రేపు ఉదయం ఫ్లైట్‌లో లండన్ వెళ్తున్నారట" అన్నది లేచి, తల దువ్వుకుని లైటుగా పఫ్‌తో పౌడరు అద్దుకుని.

"సాయంత్రాలు ఒంటరిగా జంబూ వేతో ఒంటరిగా ఆఫీసులో ఉంటావా?" వసంతరావు అడిగాడు.

"ఏం నువ్వు తోడు వస్తావా?" అన్నది వెనుతిరిగి.

అతను మాటలు రానట్టు నిలబడిపోయాడు.

"వసంత్! నా గురించి నువ్వేం విచారించకు. స్థానికులలో లైంగిక స్వేచ్ఛ ఒక భాగం ఎక్కువే అయినా, అవతలి వారెలాంటి వారో అంచనా వెయ్యటంలో పొరపాటు పడరు" అన్నది బ్యాగు తీసుకుంటూ, అందులో తాళం బయటకు తీసి.

"అది కాదు...ఏకాంతం..."

"మీ రిద్దరు పురుషులు స్నేహంగా ఉన్నట్టు, ఒక స్త్రీ పురుషుడంటే నష్టం ఏమిటి?" అన్నది.

"నష్టం...అది కాదు."

"ఇందాక మనము ముగ్గురం లేమూ?" అన్నది ధైర్యంగా.

మధుకర్ ఆమె చేతిలోని కారు తాళాలు అందుకుని బయటికి వెళ్ళిపోయాడు. గారేజిలో నుండి కారు బయట పెడతానని.

"మన సంగతి వేరు..."

"వసంత్! వాళ్ళెంత స్వేచ్ఛా ప్రియులైనా, మనం తటి హిపోక్రైట్స్ కారు. నువ్వేం దిగులు పెట్టుకోకు." అని బయటికి వచ్చింది. వసంతరావు ఇంటికి తాళం పెట్టాడు. ఆమె మధుకర్ దగ్గర కీస్ తీసుకుంది.

"థాంక్యూ బోత్ ఆఫ్ యు! బైదవే, రేపు ఆదివారమేగా. వేరే ప్రోగ్రాం లేకపోతే భోజనానికి రండి." అన్నది తన కార్లో కూర్చుంటూ.

"వేరే ప్రోగ్రామ్ ఏముంటుంది?" అన్నాడు మధుకర్.

"అబ్బ! ఎంత అమాయకత! నీకు అమ్మాయిల కంపెనీ, వసంత్ కు శాటిల్ కంపెనీ" అన్నది.

"అది కాదండి మాధవిగారూ..."

"మధూ! అంతగా మర్యాద చెయ్యనక్కరలేదు. 'మాధవీ' అను చాలు."

"అదికాదు మాధవీ! నేనెప్పుడో చెప్పాను బయట తిరిగే మగాడు తిరుగక తప్పదని. తిరుగుబోతును కాను నేను పత్నీ వ్రతుడని యెవరన్నా అంటే ఆత్మవంచనే..."

మాధవి నవ్వి కారు స్టార్టు చేసింది. ఆమె మగాళ్ల మనస్తత్వంపై ఒక పరిశోధన చెయ్యాలనిపించింది. ప్రతి స్త్రీని వారు గమ్మత్తుగా అంచనా వేసుకుంటారు.

సంవత్సరం నుండి పరిశీలిస్తుంది. వసంత్ రావు, మధుకర్ తనతో చాలా క్లోజ్‌గా ఉంటారు. మినిస్ట్రీ ఆఫ్ ఎడ్యుకేషన్‌లో, మెడికల్ డిపార్టుమెంటులో తెలుగువారున్నా, రెడ్ రోడ్ అపార్టుమెంట్సులో వీళ్ళు ముగ్గురే ఉన్నారు. మిగతా వారితో హల్లోహల్లో పరిచయమే.

వసంత్ రావు ఒక రకంగా ఆరాధిస్తాడు. అతను స్నేహపాత్రుడు. మాధవి అంటే గౌరవము, అభిమానం, ఆరాధనా ఉన్నవాడు. అతను మంచి పనిమంతుడని, సంస్కారవంతుడని అతని సెక్షన్లో. అతనికి మంచిపేరుంది. ఒకే ఒక బలహీనత ఉంది. సెలవులిచ్చారంటే చాలు విపరీతంగా త్రాగుతాడు. అదెలా అలవాటయిందో అర్థం కాలేదు మాధవికి. అప్పుడప్పుడు వచ్చి తన కిష్టమయినవి అడిగి చేయించుకుంటుంటాడు.

"త్రాగుడు మానెయ్యరాదా, వసంత్!" అంటుంది మాధవి.

"నువ్వు నాతో వచ్చెయ్యి." అంటాడు.

"చాల్లే దేవదాసు డైలాగులు." అంటుందామె.

"మధువు, మగువ యెవరో కావాలి మరి." అంటుంటాడు. 'అతను తాగుడు మానితే బావుండును' అనుకుంటుంది. 'అతను మామూలు మనిషయితే బావుండును' అనుకుంటుందామె. 'ఆమె తనదయితే తాగుడు మానేద్దును' అనుకుంటాడాయన.

అలాగే మధుకిరె మరో స్నేహితుడు, ఆత్మీయుడు. అతను యెక్కడకు వెళ్ళినా, అపురూపమైన వస్తువు ఏది కనిపించినా తీసుకుని వచ్చి, మాధవికి ప్రజంట్ చేస్తాడు. మాధవి కాలులో ముల్లు గుచ్చుకున్నా సహించలేడు. గంటలు, గంటలు ఆమెతో మాట్లాడుతూ కాలం గడుపుతాడు.

"అతను కొంగుతాకితే పొంగిపోయే రకం మాధవీ, జాగ్రత్త" అని చాలామంది హెచ్చరించారు. కాని అతను ఒక్కనాడయినా మాధవితో హద్దుమీరి ప్రవర్తించలేదు.

"వ్యభిచరించని పురుషుడు లేడు. బయట తిరిగే పురుషుడికి తప్పదు మేడమ్!" అంటాడు.

"కామెర్ల రోగికి ప్రపంచమంతా పచ్చగానే కనిపిస్తుంది." అంటుంది మాధవి.

"యెవరయినా నేను పవిత్రంగా ఉన్నాను అంటే అది ఆత్మవంచన మేడమ్!" అంటాడు.

"అలాగా..." అంటుంది. ఆమె జీవితంలో ఇంతవరకు ఏ పురుషుడు ప్రవేశించలేదు. రాగానే అంబాసిడర్

హోటల్లో దిగారు. అక్కడ తటస్థపడిన స్త్రీ మాటలు గుర్తుకు వచ్చాయి.

"పదహారు దాటాక, ఏ స్త్రీ అయినా పవిత్రంగా ఉన్నాను అంటే ఆమె అబద్ధాలు పుట్ట అనుకోండి." అనటం సెక్స్‌పట్ల తనకుగల అవగాహన చెబుతుంటే- కాదంటే ఇంకా పచ్చిగా మాట్లాడుతుందని ఊరుకునేది.

యెవరి అనుభవాలు వారివి. ఆ స్త్రీ బలహీనత లేక పోతే అతను చార్మింగ్ పర్సన్. మిగతా అన్నీ యెన్నతగిన గుణాలే. అతని సెక్షన్లో అతనంటే గడగడలాడి పోతారు జనం. తను సంపాదించినది యెలా ఖర్చుపెట్టాలో తెలిసిన వాడు. తల్లి, తండ్రి అంటే అభిమానం వుంది.

"మీరు శాసించండి, అమ్మాయిల జోలికిపోతే అడగండి." అంటాడు మాధవితో.

"బలవంత పెట్టి పనులు చేయించటం అసాధ్యం మధూ! నేను ఈ స్నేహాలు మానమంటే నా కోసం మానుతావు. మళ్ళీ మామూలే." నవ్వుతుంది.

"ఓ గాడ్! మిమ్మల్ని ఎలా నమ్మించాలో అర్థంకాదు."

"నేనో ప్రశ్న అడిగేదా మధూ ?"

"అడగండి, అభ్యంతరం ఏముంది ?"

"నీ స్వేచ్ఛా ప్రవృత్తే నీ భార్యకు అలవడితే..."

"ఓ...నో! మేడమ్ మీరు చాలా అడ్వాన్స్‌గా ఆలోచిస్తారు. స్త్రీ పురుషులు మనుష్యులేకాని వ్యత్యాసం ప్రకృతే కల్పించింది." అంటాడు. నవ్వి ఊరుకుంటుంది. ఇద్దరు వ్యక్తులు తన జీవితంలో ప్రాముఖ్యత వహిస్తారని ఏనాడు అనుకోలేదు.

"గుడ్ ఈవినింగ్ మేడమ్..." కారు యాంత్రికంగా ఆఫీసు ముందు ఆగగానే, "సరేరే" వచ్చి తలుపు తీశాడు. తన ఆలోచనలు కట్టిపెట్టి, కారుదిగి, లిఫ్ట్ వైపు వెళ్ళిందామె.

## 2

"నీకు చావురాదు కదే తల్లీ నన్ను చంపుతున్నావు." కర్ణకఠోరమైన మాటలతో పాటు ఓ పసిదాని ఏడ్పు వినిపించింది మాధవికి. కెనాళ్లలో, రెడ్ రోజ్ అపార్ట్ మెంటులో తెలుగులో స్త్రీ కంఠం విని ఒక్క నిముషం నిలబడిపోయింది.

"అమ్మా! తమ్ముడిని నేనేం అనలేదమ్మా." మృదువుగా, భయంగా వినిపించింది పసి కంఠము.

"రాక్షసీ, నీకు నిజం చెప్పటం వచ్చునటే !"

"అక్క గిల్లింది మమ్మీ."

"బేబీ...నేను గిల్లానా..." చిన్నారి గొంతులో బాధ స్పష్టంగా వినిపించింది మాధవికి.

అకస్మాత్తుగా "తెగువారు" వస్తారట అన్న విషయము గుర్తుకు వచ్చింది. తన ఫ్లాట్ తలుపు తీసింది.

ఎదురు ఇంట్లో నుండి పాప ఏడ్పు వినిపించింది. పిల్లలు విసిగిస్తున్నారేమో అనుకుని వచ్చి, తలుపు వేసుకుంది. అప్పుడు వంటచేసుకోవాలంటే బద్ధకం వేసింది. రెండు స్లైసుల బ్రెడ్ తిని పాలు త్రాగుతుండగా ఫోన్ వచ్చింది. ఆమె ఎత్తింది. వసంత్ రావు గొంతు స్పష్టంగా విని

పించింది. త్రాగాడని ఆగి, ఆగి మాట్లాడటంతో అర్థం అయింది.

"హాయ్ ... నువ్వు...వంటచెయ్యలేదు...నాకు... తెలుసు... వంటరితనం...యెంత భయంకరమైనదో... ప్లీజ్ ...మాట్లాడు మధూ!" అతను మందు కొడితే మర్యాద మరిచిపోయి, ఏకవచనముతో పిలుస్తాడు.

"వసంత్! ప్లీజ్ నిదురపో...గుడ్ నైట్." ఫోన్ పెట్టేసింది.

ఆమెకు అలసటగా ఉంటే నిదురపడుతుంది. తొందరగా నిదురపోయింది. మధ్యరాత్రి యెక్కడో చిన్న శబ్దం తప్పితే అంతా నిశ్శబ్దం, చిమ్మ చీకటి కనిపించింది.

ఇటు దొర్లింది. చీకటిని, నిశ్శబ్దాన్ని చీల్చుకుని వెక్కిళ్ళు వినిపించాయి. ఆమె లేచింది. కిటికీనుండి బయటికి దృష్టిసారించింది. జీరోబల్బ వెలుతురు పడుతుంది. ఆ వెలుతురులో వెక్కుతూ, ముడుచుకు కూర్చుందో చిన్నారి పాప.

మాధవి మెల్లగా తలుపు తీసుకుని వచ్చింది.

"కొట్టొద్దు ప్లీజ్...కొట్టొద్దు. అక్కడ చీకట్లో భయంమన్నిమ్మా...ప్లీజ్..." మాధవి దగ్గరగా వెళ్ళింది. ఆ అమ్మాయి లేడికూనలా వణుకుతుంది. ఒకరిని ఒకరు చూచుకున్నారు.

"నిన్నెవరు కొట్టారు. అట్లా ఒంటరిగా యెందుకు కూర్చున్నావ్?"

"ఆంటీ...మీాకు తెలుగువచ్చా!" ఆ పిల్ల కళ్ళు పత్తికాయలు అయ్యాయి.

"ఇందాక నువ్వు తెలుగులోనే మాట్లాడావు." అన్నది మాధవి.

"మా మమ్మీ అనుకున్నాను. మమ్మీ పనిష్మెంటు ఇస్తే ఇక్కడే కూర్చోమంటుంది." తలుపు దగ్గర వేలుతో చూపింది.

'పసిపిల్లలను పనిష్మెంటు పేరుతో చీకట్లో ఒదిలే తల్లులుంటారా? ఉంటే ఆవిడ తల్లికాదు, కఠినశిల.'

"లోపలికి రామ్మా!"

"అమ్మో, మమ్మీ చూచిందంటే చంపేస్తుంది ఆంటీ!" అన్నది. ఆ చిన్నారి కళ్ళలో భయం స్పష్టంగా కనిపించింది.

"మీ మమ్మీ లేచేసరికి మీ మమ్మీ చెప్పిన చోటే కూర్చుందువుగాని రా పాపా!" అన్నాను.

చుట్టూ కలయజూచింది. కొత్త ప్రదేశం, కొత్త చోటు భయం కలిగించేదేమో, మాధవి వెంట లేచివచ్చిందా పాప. లోపలికి వచ్చాక పాపను పరీక్షగా చూచింది. ఆమె వీపుపై వేళ్ళు తేలాయి. పచ్చని పసిమిఛాయ. మెడమీద, చెవుల వెనుక, పాదాలమీద మైల పేరుకుపోయింది. చిరుగు పట్టిన గౌనుకు హుక్కులు లేవు. అండర్‌వేర్ మాసిపోయి ఉంది. డొక్క లోతుకుపోయింది.

"అన్నం తిన్నావా పాపా?"

తల అడ్డంగా ఆడించింది. ఆ పిల్ల లక్కపిడతలాంటి నోరు, చేపపిల్లలాంటి కళ్ళు, నల్లని విగ్గు పెట్టినట్టున్న జుట్టు చూడగానే మాధవి హృదయం పొంగిపోయింది. ఒక్కసారి ఆ పిల్లను హృదయానికి హత్తుకున్నది.

"పాపా! స్నానం చేస్తావా?" అన్నది. మైలంటే, మాసినబట్టలంటే మాధవికి చాలా కంపరం.

"అలాగే ఆంటీ..." అన్నది.

పాలు స్టౌ మీద పెట్టి, ఆ అమ్మాయికి స్నానం చేయించింది. తుండులో దూరి కూర్చుంటే, బేసిన్‌లో కాస్త సర్ఫ్ పడేసి, ఆమె బట్టలు పెట్టి ఉతికివేసింది.

"నేను ఉతుక్కుంటాను ఆంటీ! కాసింత టీ ఇవ్వు. నిన్నరాత్రి తిన్నాను..." అన్నది, అక్కడ బల్లమీద పెట్టిన బిస్కట్లవంక చూస్తూ.

"నీకు బట్టలు ఉతకటం వచ్చా?"

"రోజూ! మా ఇంట్లో నేనే ఉతుకుతాగా. నా పేరు పాపకాదు ఆంటీ, హంస." అన్నది ముద్దుగా.

మాధవి జామ్ రాసిన బ్రెడ్ స్లైసులు, ఆమ్లెట్, పాలు ఇచ్చింది.

"ఇవన్నీ వద్దు ఆంటీ! నువ్వు ఉద్యోగం చేస్తావుగా, నువ్వు తిను. ఆ చుట్టూకోసిన ముక్కలు పెట్టు." అన్నది.

"హంసా!" మాధవి నోట మాటరాలేదు. ఆమె నీకు మారుటితల్లా అని అడుగబోయి మాట మింగేసింది.

"ఫరవాలేదు తినెయ్యి." అన్నది.

తిని, పాలు త్రాగింది. పౌడర్ వేసి, బట్టలు వేద్దామనే లోపలే తుండులో ముడుచుకొని సోఫాలో నిదుర బోయింది.

మాధవి సమయము చూచింది. ఒంటిగంటంబావు. పాపనెత్తి తన ప్రక్కన పడుకోబెట్టి, తనూ పడుకుంది.

ఉదయం త్వరగా లేచే అలవాటులేదు మాధవికి. అందుకే "ఆంటీ" "ఆంటీ" అని పిలిచినట్టు అయినా లేవలేదు. ఆ రోజు ఆదివారం ఎలీషాకూడా ఎనిమిది దాటాక వస్తుంది.

"ఆంటీ...ఆంటీ...లే..." రగ్గు లాగింది.

"అబ్బ! ఏమిటీ న్యూసెన్స్..." కళ్ళు విప్పింది. చక్కగాపొనిటైల్ కట్టుకుని, టీ కప్పుతో నిల్చుంది హంస.

"గుడ్ మార్నింగ్ ఆంటీ!"

"గుడ్ మార్నింగ్ హంసా! అప్పుడే లేచావా?" అన్నది టీ కప్పు అందుకొని.

"ఎప్పుడో లేచాను ఆంటీ, మీ తలుపు ఎలా తీశానో చెప్పుకోండి." అన్నది.

మాధవి ఒక్క నిముషం ఆలోచించింది. "కుర్చీ వేసుకున్నావు."

"ఎగ్జాక్ట్‌లీ ఆంటీ! నేను మీ తలుపు వేసి, మా తలుపుముందు పడుకున్నాను. అప్పుడే మమ్మీ బయటికి వచ్చింది. థాంక్ గాడ్ నేను, నా బట్టలు శుభ్రంగా ఉన్నాయని చూడలేదు." అన్నది పెద్దగండం గడిచినట్టు.

"మీ మమ్మీతో నేను మాట్లాడాలి హంసా!" లేచింది మాధవి.

"మా మమ్మీ, డాడీ, చెల్లి, తమ్ముడు బయటికి వెళ్ళారుగా?" అన్నది.

"నిన్ను తీసుకెళ్ళలేదా?"

"ఊహూ! మేము ఉంటున్న ఇంటిదగ్గర ఆంటి మంచిది కాదు. వాళ్ళనే రమ్మన్నదట." అన్నది.

"ఐసీ! నా దగ్గర ఉండు."

"అమ్మో! బట్టలు ఉతుకుతాను ఆంటీ! బయటి పంపువద్దగర వుతికి గడ్డిమీద ఆరేయమన్నది మమ్మీ, మిమ్మల్ని లేపొద్దనుకున్నాను, టీ చల్లారి పోతుందిగా, అందుకు లేపాను." అన్నది.

"టీ యెక్కడిది హంసా?"

"మమ్మీ నాకని ఇచ్చింది. అది మీకిచ్చాను."

మాధవి చటుక్కున ఆ పిల్ల రెండు బుగ్గలు ముద్దు పెట్టుకుంది.

మారుటు తల్లేమో!

"మరి నీకు టీ వద్దా హంసా?"

"రాత్రి మీరు కడుపునిండా తిండి పెట్టారు. ఆకలి లేదు. అయినా మమ్మీ తినటానికి పెట్టింది." అన్నది సంతోషంగా.

ఆ పిల్ల అభిమానానికి మాధవి చలించిపోయింది.

"నేను బ్రష్ చేసుకుని వచ్చేస్తాను. నువ్వు బట్టలు వుతికెయ్యి. ఇద్దరం కలిసి టీ తాగుదాం." అన్నది మాధవి, బాత్‌రూమ్‌వైపు వెళ్తూ.

ఆమె, స్నానంకూడా ముగించి వచ్చేసరికి ఎలీషా వచ్చింది. టీ పెట్టింది. తన మగ్గు తీసుకుని తాగుతుంది.

"మేడమ్ టీ తీసుకురానా?"

"ఉండు ఎలీ! నాకో చిన్న స్నేహితురాలుంది...

మాధవి బయటికి వచ్చి కాళ్ళకు బ్రేకులు పడ్డట్టు ఆగి పోయింది. బకెట్టునిండా చిన్నపిల్లల బట్టలున్నాయి. అండర్ వేర్లు, బనియన్లు, తుంపుగుడ్డలు కూడా కనిపించాయి.

పసిపిల్ల అన్ని బట్టలు ఉతకటమా? ఆమె హృదయంలో యెవరో చెయ్యి పెట్టి దేవినట్లయింది.

"హంసా! ఈ బట్టలు అన్నీ నువ్వు ఉతకగలవా?"

"ఇవే ఏమిటి ఆంటీ! ఇంకా ఇన్ని వున్నా ఉతుకుతాను." అన్నది ధీమాగా, చిన్న ఫ్రాకుకు మైల ఉన్న చోట బ్రష్‌తో రాస్తూ.

"బ్రేక్‌ఫాస్ట్ చేసి ఉతుకుదువుగాని రా." అన్నది.

"నా బ్రేక్‌ఫాస్ట్ ఉంది ఆంటీ!" అన్నది, ఆరిందానిలా ఆ బట్టలు జాడించి వేస్తూ.

మాధవి వెనుతిరిగింది. అవతలి గుమ్మము ముందు, మూత వేసిన ప్లాస్టిక్ డబ్బా కనిపిస్తే కుతూహలంగా మూత తీసింది. బ్రెడ్డు చిట్లూ మాడిన భాగాలు, సాండ్‌విచ్ చేసేటప్పుడు తీసివేస్తారు. మాధవి చేతిలోనుండి అప్రయత్నంగా డబ్బా జారిపోయింది.

"మేడమ్ ఫోన్..." ఎలీషా పిలిచింది.

ఆమె వెళ్ళి యాంత్రికంగా ఫోన్ అందుకుంది.

"హల్లో మేడమ్! మధూ' సుప్రభాతం పలుకుతున్నాడు."

"సుప్రభాతం మధూ!" అన్నది హుషారుగా.

"బ్రేక్‌ఫాస్ట్‌కు రావాలా?"

"ఉహు! నాకిక్కడ ఒక ఫ్రెండ్ దొరికారు. నీ కంపెనీకోసం నేనేం పాకులాడటంలేదు." అన్నది ఉడికిస్తూ.

"మై గాడ్! ఆ తెగువా రేనా?"

"ఊహు! చెప్పను." అన్నది అల్లరిగా.

"ఆల్ రైట్. అరగంటలో వచ్చి చూస్తాను." అని ఫోన్ పెట్టేశాడు.

"ఎంతమందికి చెయ్యమంటారు బ్రేక్ ఫాస్టు?" స్వాహిలి భాషలో అడిగింది ఎలీసా.

"ముగ్గురికి చెయ్యి." అన్నది మాధవి.

"ఎస్ మేడమ్! అంత చిన్నపిల్లకు బట్టలు అంటగట్టడం అమానుషం మేడమ్! మీకేం అనుకోనంటే నేను ఉతికి వెయ్యనా?"

"థాంక్యూ ఎలీ...థాంక్యూ! నేనే అడిగితే నువ్వేం అనుకుంటావో అని జంకాను." అన్నది మాధవి.

ఎలీసా వెళ్ళి అయిదు నిమిషాల తరువాత హంసను తీసుకుని వచ్చింది.

"చూడండి ఆంటీ! ఈ అమ్మాయి ఏదో అంటుంది." హంస వచ్చింది, నుదుట పట్టిన చమట తుడుచుకుంది.

"హంసా! ఎలీసా అంటుంది, నువ్వు చిన్నపిల్లవుట, అన్ని బట్టలు ఉతుకలేవుట. తను సహాయం చేస్తానంటుంది." అన్నది మాధవి.

"ఓ...థాంక్యూ." అన్నది. ఎలీసా బ్రేక్ ఫాస్టు చెయ్యటానికి వెళ్ళిపోయింది.

మాధవి తను ముస్తాబయి, తుండుతో హంస ముఖం

తుడిచి పౌడరేసి బొట్టు పెట్టింది. గౌను హుక్కు కుట్టిచ్చింది. వాళ్లు డైనింగ్ టేబుల్ దగ్గరకు వచ్చేసరికి మధుకర్ వచ్చాడు.

"ఓ... ఈవిడగారా మీ ఫ్రెండ్..." అని పక, పక నవ్వాడు.

"గుడ్ మార్నింగ్ అంకుల్!" అన్నది హంస.

"గుడ్ మార్నింగ్! అవునూ నేనుఅంకుల్‌నని యెవరు చెప్పారు బేబీ!" మధుకర్ అడిగాడు.

"మా డాడీ చెప్పారు, డాడీ వయసువాళ్ళు యెవరు కనిపించినా 'అంకుల్' అనాలని, మమ్మీ వయసు వాళ్ళైంతే 'ఆంటీ' అనాలని..." అన్నది.

"మరి ముసలాళ్ళయితే..." నవ్వుతూ అడిగాడు.

"గ్రానీ అనాలి. అంకుల్, నాపేరు బేబీకాదు హంస."

"వాట్ ప్రెట్టీనేమ్ చిలుక అంటే ఇంకా బావుంటుంది." హంసను యెత్తుకుని ముద్దు పెట్టుకున్నాడు మధుకర్.

క్లుప్తంగా హంస తనకు పరిచయం అయిన వైనం చెప్పింది మాధవి.

"తప్పక మారుటి తల్లో, పెంపుడు తల్లో అయి ఉంటుంది. అర్ధరాత్రి అలా బయట వదిలి వేస్తుందా?" ముగ్గురూ ఉపహారం ముగించారు.

మధుకర్ సిగరెట్టు వెలిగించాడు.

"బేబీ...సారీ హంసా! మీ మమ్మీ నీకు నిజమైన మమ్మీయేనా?" మధుకర్ ప్రశ్నకు హంస పక, పక నవ్వింది.

"ఆంటీ! అంకుల్‌కు ఏం తెలియదు. నిజం, అబద్ధం మమ్మీలుంటారా?"

"అవునమ్మా! అంకుల్ ట్యూబ్‌లైటు." అన్నది మాధవి.

"థాంక్స్ ఫర్ ది కాంప్లిమెంటు." అన్నాడు మధుకర్.

"వసంత్‌ను తీసుకు రావాల్సింది మధూ!"

"అతనికి లంచ్ టైమ్‌లో తెల్లవారుతుంది. వెళ్ళి తీసుకువస్తాను."

"అంకుల్! ఎవరు లేవరో, మా మమ్మీ దగ్గరుంచండి. అయిదు గంటలకు లేపుతుంది." అన్నది హంస.

"ఇంపాజిబుల్ హంసా! అతను ఈడ్చి తంతే ఆమడ దూరం వెళ్ళాలి." అన్నాడు మధుకర్.

"ఈజిట్! అంకుల్ అయితే కాస్త గట్టిగా తన్నమనండి. నాకు ఇండియా చూడాలని ఉంది." అన్నది. కిల, కిల నవ్వింది హంస.

తొస్సి పన్నుతో గమ్మత్తుగా కనిపించింది.

"యూ నాటీ." మధుకర్ మరోసారి ముద్దుపెట్టుకున్నాడు.

"నీకు భారతదేశం చూడాలని ఉందా హంసా?" మాధవి అడిగింది.

"అవును ఆంటీ...నాకు భారతదేశం చూడాలని ఉంది. అక్కడుండగా అమ్మ నన్నెంతో ఇష్టపడేది" అన్నది

యెటో చూస్తూ. ఆ చిన్నారి కళ్ళలో ఎన్నో నీలినీడలు కనిపించాయి.

ఎలీషా బట్టలు ఉతుకుతుంటే, కర్రతో తాడుపై చక్కగా ఆరేసింది హంస. మాధవి ఆశ్చర్యంగా చూచింది. తనూ అంత నీటుగా ఆరవేయలేదు.

"మీ మమ్మీ ఎప్పుడు వస్తుంది?"

"తెలియదు ఆంటీ! చీకటయితే ఇంటిముందు పడు కొమ్మంది. నా కేఁవాళే." అన్నది, ఎగిరి, తాడుపై బట్టలు సరిచేసి.

"నా...ఏదయినా ఆడుకుందాం." మధుకర్ పిలిచాడు. ముగ్గురూ బిజినెస్ ఆడారు. కాసేపు కార్డ్స ఆడారు. వాళ్ళిద్దరు కార్డ్స ఆడుతుంటే హంస చిలకలా కబుర్లు చెబుతుంది.

"ఏ క్లాసు చదువుతున్నావు హంసా?"

"ఫస్ట్‌క్లాస్". పూర్తిచేశాను. ఈపాటికి సెకెండ్ కూడా పూర్తి అయ్యేది. నాకు చెల్లెలు, తమ్ముడు పుట్టారుగా, మా డాడీకి ఖర్చు పెరిగింది. పనిపిల్లలుండరు, అందుకు మానేశాను. అయినా ఆంటీ, యెంత చదివినా వంట చేయాలికదా?" అన్నది హంస.

మాధవి కార్డ్స పడేసి ఆశ్చర్యంగా చూసింది. 'పెరిగే పిల్లలు, తల్లిదండ్రులను అనుకరిస్తారు. వారి మాటలు యథా తథంగా అప్పజెబుతారు. వారిముందు జాగ్రత్తగా ఉండాలి.' అనుకుంది.

"హాయ్! మీ పారాయణం ప్రారంభం అయిందా?" నవ్వుతూ వచ్చాడు వసంత్.

"గుడ్ మార్నింగ్ అంకుల్!"

"గుడ్ మార్నింగ్! హు ఈజ్ దిస్ అంకుల్స్ డేమ్?"

"హంసా!"

"లవ్లీ..." అన్నాడు.

"అంకుల్ మీ కళ్ళు అలా ఉన్నాయేం!"

"అంకుల్ విషం త్రాగుతారమ్మా!" అన్నది మాధవి.

"దేవతలు అమృతం అందించకపోతే త్రాగేది విషమే కదా!" అన్నాడు.

"రా వసంత్ రా, నిన్ను పిలుచుకురాలేవని మాధవి నిష్ఠూరం వేస్తుంది." అన్నాడు మధుకర్.

వసంత్‌రావ్ కళ్ళలో ఓ వెలుగు వెలిగింది. అతని కళ్ళు రెపరెప లాడాయి.

హంస కళ్ళతోనే ఆశ్చర్యంగా చూస్తుంది. విషం త్రాగిన వారు బ్రతుకుతారా అన్నట్టున్నాయా చూపులు. అందరూ కూర్చున్నారు ఆడటానికి. ఆదివారం జాలీగా గడపాలన్నదే వారి పాలసీ.

## 3

పొలం నుండి వచ్చి, చేదబావిదగ్గర కాళ్లు కడుక్కుని వచ్చి మంచంపై కూర్చున్నాడు విష్ణు.

"అమ్మా! కాఫీలాంటి పదార్థం దొరుకుతుందా?"

"అమ్మ, అమ్మంటూ, ఆమెను కష్టపెట్టకపోతే హాయిగా పెళ్ళిచేసుకుని పెళ్ళాం చేత పనులు చేయించుకోరాదు." అన్నది అప్పుడే అక్కడికి వచ్చిన కాంతం.

కాంతం విష్ణువర్ధన్ పెత్తండ్రి కోడలు.

"ఇంత నుంచి సలహా యెవ్వరూ ఇవ్వలేదని బాధ పడుతున్నాను వదినా! సలహాతో పాటు కాఫీ ఇస్తే ధన్యులం అవుతాం." అన్నాడు.

కాంతం వెళ్ళి కాఫీ కలిపి తెచ్చి ఇచ్చింది. అతను కాఫీ తాగాక, రొంటినదోపిన వెయ్యిరూపాయలు ఇచ్చింది.

"ఎక్కడవయ్యా బాబూ?"

"మీవారు చెప్ప లేదా!"

"విష్ణు కివ్వు అన్నారు. ఆయనను వివరం అడిగి బ్రతుకగలమా?"

"అబ్బ ఎంత భయం."

"ఏమిట్రా పెద్ద చిన్న అన్న భయంలేదు బొత్తిగా." అని దగ్గుతూ వచ్చింది రంగనాయకమ్మ.

"వదినా! నువ్వు పెద్దదానవు కదూ! క్షమించు." అన్నాడు.

"చాల్లే కబుర్లు! మీ అమ్మ నీ వివాహానికి ఆంక్షలు పెట్టి ఆజ్ఞాపించలేదుకదా. పూర్తిగా స్వేచ్ఛ నిచ్చారాయె." అన్నది.

"అబ్బ! పెళ్ళి, పెళ్ళి, పెళ్ళి. నువ్వు చేసుకుని సుఖపడిందేం ఉంది చెప్పు." అన్నాడు నిసుగ్గా.

"ఇదమ్మా వరస! ఈ దగ్గు దమ్ము నన్ను చావ

నీయదు, బ్రతకనీయదు." అంటూ, ఆమె గోడకానుకుని కూర్చుంది.

"ఇప్పుడు వగుదమ్ము బాధ. కోడలు వస్తే మరో బాధ. పెళ్ళి అని అంటే పంచాయితీ ఆఫీసులో పేకాడుతాను."

"చదివేస్తే ఉన్నమతి పోయిందట. అమ్మకు ఎన్నాళ్ళీ నిర్బంధం అన్న జ్ఞానం లేకపోతే ఎలా?" రంగమ్మ విసుక్కుంది.

"రంగమ్మక్కా!" ఎవరో పిలువటంతో ఆమె వెళ్ళిపోయింది.

కాంతం, విష్ణు మాత్రమే మిగిలారు.

"మీ అమ్మనలా బాధపెట్టటం భావ్యం కాదయ్యా."

"మనసు లేని వివాహము చేసుకుని ఆ వచ్చే అమ్మాయిని బాధపెట్టడం భావ్యమా!" అన్నాడు చురుకుగా.

"ఏం మనసో, ఏం మనుషులో! మాకు చిన్నప్పుడే పెళ్ళిళ్ళయి సంతోషంగా లేము! ఆయన కోపగాండ్లే కాదనను, కాని చెడ్డవారు కాదు."

"ఇప్పుడు నేనా చెడ్డవాడిని..." అన్నాడు నవ్వుతూ.

కాంతం జవాబు చెప్పేలోగా రంగనాయకమ్మ తన ఈడు వస్తికితో ఇంట్లోకి వచ్చింది.

"వీడే అన్నయ్యా, మా వంశోద్ధారకుడు." అన్నదామె.

విష్ణువర్ధన్ తడబడ్డాడు. అతనెవరో, ఏమో, అయినా పెద్దవాడు అనుకుని నమస్కరించాడు.

"శీఘ్రమేవ కల్యాణ ప్రాప్తిరస్తు. ఏం చేస్తున్నావు నాయనా?" అన్నారాయన.

"అగ్రికల్చర్ బియస్సీ చేసి, ప్రస్తుతం చదివింది. కార్యరూపంలో పెట్టాలని చూస్తున్నాను." అన్నాడు విష్ణు.

"ఇదీ వరస అన్నయ్యా! ఆయనకు యెన్ని ఆశ లుండేవో...అమ్మా! వీడిని చదివించి అమెరికా పంపా లని..." ఆయాసపడింది.

"అగ్రికల్చర్ బి. ఎస్సీవారు వెళ్ళి అమెరికాలో అంట్లు తోముతున్నారు." అన్నాడు విష్ణువర్ధన్.

"డాక్టర్లకు, ఇంజనీర్లకు పన్లు త్వరగా దొరుకుతా యని తెలుసుగాని, అంట్లు యెవరూ తోమరు బాబూ!" అన్నారాయన.

"అంతా నా ఖర్మ అన్నయ్యా! ఆడపిల్ల పుట్టగానే అయ్యో అంటాము. కూతురి విషయం వింటుంటే కండ్ల పండుగ్గా ఉన్నది."

"వినటం వీనుల విందుగా ఉంటుందమ్మా!"

"ఆఁ...ఇప్పుడు నేను తెలుగు నేర్చుకుని ఉద్ధరించేది ఏం లేదులే. అమ్మాయి గురించి వింటుంటే యెంత ముచ్చ టగా ఉందో, మా వాడి అదృష్టం వెనుకా, ముందు ఎవరూ లేరు ఉంటే ఎత్తుకు తినేవారు."

"అమ్మా!"

"అప్పునా! ఇంత ఖర్చుపెట్టి చదివిస్తే వ్యవసాయం చేసే నిర్వాకం ఏమిటి! అన్నయ్య కూతురు చూడు మగపిల్ల

...లా విదేశాలలో ఉద్యోగం చేసి కుటుంబాన్ని ఆదుకుంది. ఇద్దరి చెల్లెండ్లు పెళ్ళిళ్ళు చేసింది. తమ్ముడిని చదివించింది. రేపో, మాపో అక్కడికి పిలిపించుకుంటుంది. అందుకే అన్నారు. పూజకొద్ది పురుషుడు, దానంకొద్ది బిడ్డలు..." నిట్టూర్చిందామె.

"నిజమేనమ్మా! దానం చెయ్యటానికి నీవు పిసినారితనం చూపించి వుంటావు. అందుకే పనికిమాలిన కొడుకు పుట్టాడు." అన్నాడు.

అతను పక, పక నవ్వి, అందరికి మళ్ళీ వస్తానని చెప్పి లేచాడు.

"కాఫీ తీసుకుని వెళ్ళన్నయ్యా!"

"నువ్వేం అనుకోకు రంగనాయకీ! ఇంకా నా చాదస్తం వదలలేదు. కులాలు, మతాలు వద్దంటారుగాని, లేకుండా యెలా వుంటాయి? పెద్దలు అన్నీ ఆలోచించే పెట్టారు." అన్నాడు.

విష్ణు ముఖం మాడిపోయింది. అయినా నవ్వేశాడు.

"మీ అమ్మాయి అమెరికా వెళ్ళిందాండి?"

"లేదు నాయనా! ఆఫ్రికాలో కెన్యా పేరు వినే వుంటావు."

"అక్కడంతా బ్రాహ్మలే వుంటారా?" అన్నాడు అమాయకంగా. కాంతం కిసుక్కున నవ్వింది.

రంగమ్మ కోపంగా చూచింది.

"భలేవాడివయ్యా! మా అమ్మాయికి సెపరేట్‌గా

క్వార్టర్ వుంది. తనే వంట చేసుకుని తింటుంది. ఎక్కడికి వెళ్ళినా మన పద్ధతులు మనవే. ఏ దేశమేగినా ఎందు కాలిడినా అన్నారు శ్రీశ్రీ..."

"శ్రీశ్రీ కాదనుకుంటాను రాయప్రోలు సుబ్బారావు గారు..."

"ఎవరో ఒకరు. వస్తాను." అతను వెళ్ళిపోయాడు.

"అమ్మాయివస్తే తీసుకురా అన్నయ్యా..." రంగనాయకమ్మ వెనుకనుండి హెచ్చరించింది.

అతను గేటు దాటగానే తల్లిపై ఒంటి కాలిమీద లేచాడు విష్ణు.

"మనింట్లో మంచినీళ్ళు త్రాగని వాడు నీకు అన్నయ్యెలా అయ్యాడు! ఇంకా ఈ కాలంలో ఇలాంటి దరిద్రులున్నారంటే..."

"చాల్లే. నోటికి ఎంతవస్తే అంతమాట అంటావు." ఆమె విసుక్కుని ఆయాసం రావటంతో వెళ్ళిపోయింది లోపలికి.

"విష్ణూ! వంటచేసి పెట్టాను, వస్తాను. మీ అన్నయ్య ఒంటికాలిమీద లేస్తాడు." అని ఆమె వెళ్ళిపోయింది.

విష్ణువర్ధన్ పడక కుర్చీలో కూర్చుని ఆలోచిస్తున్నాడు.

భారత్ హెవీ ఎలక్ట్రికల్ ఫ్యాక్టరీ పడకపూర్వము అక్కడే దగ్గరో చుట్టూ పొలాలుండేవి. గంగారాం దగ్గర మాత్రము పొలాలు, ఇల్లు వున్నాయి. చుట్టూ పొలాలు పోయాయి. అక్కడే దగ్గర్లో ఓ పల్లెలో రంగనాయకమ్మ పుట్టిల్లు వుండేది. ఆమె కాపురానికి వచ్చాక చాలా రోజులు

పిల్లలు కలుగలేదు. చుట్టూ వున్న పొలాలు ఫ్యాక్టరీకి తీసుకుని, డబ్బిచ్చారు. విష్ణుతండ్రి నారాయణమూర్తి పిల్లలు లేరని అన్నకొడుకు చంద్రశేఖర్‌ను పెంచుకుందామని తెచ్చాడు. కాని సంవత్సరం తిరగకుండానే విష్ణు పుట్టాడు. అప్పుడే చంద్రశేఖర్ తండ్రి తన మొత్తం పొలాలకు వచ్చిన డబ్బు పెట్టి, దూరం వెళ్ళి పొలాలు కొన్నాడు.

చంద్రశేఖర్ మాత్రం తనచిన్నాన్నతోనే స్థిరపడ్డాడు. అడవిలా వున్న ఆ ప్రదేశం అంతా రామచంద్రాపురం టౌన్‌షిప్‌గా మారింది. నారాయణమూర్తే కొంతాన్ని చూచి అన్నకొడుక్కు వివాహం చేశాడు. అతను చాలా కచ్చితమైన మనిషి. అందరూ చంద్రం అంటూ పిలుస్తారు. ఒక్క విష్ణుతప్ప అతనితో ఎవరూ స్వతంత్రంగా మాట్లాడలేరు. అతన్నిచూచి, తనకున్న కొద్దిపాటి పొలం సాగు చేయిస్తున్నాడు విష్ణువర్ధన్. అది తల్లికి బొత్తిగా నచ్చలేదు. ఆ మెకూడా మూర్ఖంగా కొడుకు ఫారిన్ వెళ్ళాలని కలలు కనటంలేదు. ప్రతివాడు ఫ్యాక్టరీలో పనిచేస్తామని వెళ్తారు. పనికి ఎవరూ దొరకరు. చంద్రం చదువుకోలేదు, కాబట్టి వ్యావసాయం పనులు చేసినా ఫరవాలేదు. విష్ణువర్ధన్ చదువుకున్నాడు, పనులు చేస్తుంటే ఆమె హృదయం గిల, గిలలాడుతుంది.

విష్ణు జీవితంలో యెవరికీ చెప్పుకోలేని దెబ్బతిన్నాడు. అది తల్లికి చెప్పి బాధపెట్టలేదు. అతనికి ఏ విషయంలో ఆసక్తిలేదు. తల్లికోసం బ్రతుకుతున్నాడు.

ఆస్తికోసం పిల్లలను తమ పరిధిలో బిగించేవారొకరు.

ఆస్తి సంపాదించాలని పిల్లలను పరాయిదేశం పంపాలనుకునే వారొకరు. ఈ లోకరీతి అర్థంకాదు విష్ణుకు.

"ఏమిట్రా కోపం వచ్చిందా?" రంగమ్మ వచ్చి, అతని ప్రక్కన కూర్చుంది.

"కోపం దేనికమ్మా! నీ కోరికలు నీకుంటాయి. ఇంతకీ అతనెవరు ?"

"పాపారావు అన్నయ్యగురించా! మా ఊరి కర్ణంగారి కొడుకురా. వాళ్ళకున్న కొద్దిపాటి పొలాలు పోతే హైదరాబాద్ వెళ్ళాడు. ఆడపిల్లని ఓ అయ్యచేతిలో పెట్టుమంటే చదివించాడు. ఆ పిల్ల చదువయ్యేనాటికి ఒక్కపైసా లేదురా. బంగారుతల్లి బయటి దేశాలకువెళ్ళి సంపాదించి పంపుతుంటే పాపారావన్నయ్య చక్రం తిప్పుతున్నాడు." అన్నది.

"అలా వరసపెట్టి పిలవకు, నాకుచాలా కోపం వస్తుంది. నీవు చెల్లెలు అన్న భావం ఉంటే కాఫీ త్రాగేవాడు."

"యెవరి నమ్మకం వారిదిరా. వాళ్ళబ్బాయి ఓ కంపెనీలో ఉద్యోగమట. ఇక్కడే యెక్కడో ఉంటున్నాడు!" అన్నది.

అతను లేచి కాళ్లు చేతులు కడుక్కొని భోజనం చేశాడు. రంగమ్మకూడా భోజనం చేసింది.

అతను తన మంచంపై వాలిపోయాడు. అతని కళ్ళ ముందు స్నేహలత నాట్యమాడింది. యెంత చక్కని పేరు. అంతకు మించిన రూపం. తను హాస్టల్లో ఉండి చదువుకునే రోజులలో పరిచయం అయింది.

ప్రతిరోజు అతను గడ్డం గీసుకుంటుంటే, రూమ్‌మేట్స్ గొడవచేసేవారు. "ఒరేయ్ అందాలబొమ్మ పోతుందిరా." అది కామన్‌గా వాడే పదం కాని, "హసీనా" "హేమమాలిని" అంటూ పిలిచేవారు. కుతూహలంగా ఓరోజు కిటికీలోనుండి చూచాడు. వాళ్ళన్న దానికి పదిరెట్ల అందంతో దర్శనం ఇచ్చింది. నలుపు, పసుపు కలిసిన బెంగాల్ కాటన్ చీరలో అందంగా ఉంది. బాపు బొమ్మలా, అజంతా శిల్పంలా, అందానికి నిర్వచనములా ఉంది.

ఆ మర్నాడే టిములిలో ఇంగ్లీష్ పిక్చర్ చూచి వస్తుంటే అతని ప్రక్కనో కారు ఆగింది.

"రండి డ్రాప్ చేస్తాం." అన్నదో అందాలబొమ్మ. ఆమెను రోజూ తన హాస్టల్ ముందు చూచేవాడు.

"రండి..." అన్నది. బెట్టుచేయక ఎక్కేశాడు విష్ణు.

"అక్కయ్యా! ఆ హాస్టల్లో ఉన్న అబ్బాయిలలో నాకు పేరు పెట్టనిది వీరు ఒక్కరే." అన్నది నవ్వుతూ.

"మా మరదలు మీకు సర్టిఫికెటు ఇచ్చేసిందోయ్." అన్నాడు డ్రైవింగ్ సీట్లో కూర్చున్న యువకుడు.

"మా స్నేహ మెచ్చుకుందంటే నిజంగా బుద్ధిమంతుడే అయివుంటాడు." అన్నది ముందు సీట్లో కూర్చున్న యువతి.

వెనుక స్నేహలత ప్రక్కనే కూర్చుంటే స్వర్గంలో కూర్చున్నట్టుంది. ఆమె మాట పూర్తికాకముందే కారు హాస్టల్ ముందాగింది.

"మిస్టర్! ఆ బోర్డు కనిపించే క్లినిక్ నాది. ఈవిడ

నా అర్ధాంగి ప్రేమలత, ఈమె మరదలు స్నేహలత, మీ పేరు?"

"నా పేరు విష్ణువర్ధన్! అగ్రికల్చర్ బియస్సీ చదువుతున్నాను." అన్నాడు.

"మా మరదలు ఉమెన్స్ కాలేజీలో బి. ఏ చదువుతుంది. మీకు వీలు ఉన్నప్పుడు రండి." అని ఆహ్వానించాడు.

ఆ రోజు హాస్టల్లో రూమ్మేట్స్, స్నేహితులు చేసిన గొడవ ఇంతా, అంతా కాదు. పార్టీ తీసుకున్నారు.

"ఆవిడతో కారెక్కే స్నేహం ఉంటే మాతో చెప్పలేదేంరా?" అని గోలచేశారు.

అలా పరిచయం అయిన స్నేహం, ప్రణయంగా మారింది.

"విష్ణూ! యెక్కడికయినా వెళ్ళి వివాహం చేసుకుందాం."

"ఛ...ఛ...స్నేహ! నువ్వు రుక్మిణివి అయినా నేను కృష్ణుడిని కాను." అన్నాడు.

"నువ్వేదయినా, మా నాన్న దక్షుడికంటే ఘనుడు."

"నేను పరమశివుడిని కాను."

"నా మాట విను విష్ణూ! కులాంతర వివాహము మనది. మా అక్కకు సంబంధాలు వెతికేటప్పుడు చూచాను. రుషులు, గిషులు అంటూ ఆమెను నానా తిప్పలు పెట్టారు." అన్నది.

"ఆమె ధైర్యంచేసి చెప్పలేదు. నువ్వు చెప్పు." అన్నాడు.

తండ్రికి రాయటానికి అంగీకరించింది స్నేహ. ఆ తరువాత వారం పదిరోజులు కనిపించలేదు. ఏమయిందో తెలియక శ్రీనివాస క్లినిక్‌కు వెళ్ళాడు. శ్రీనివాసరావు ముఖం చిట్లించాడు.

"స్నేహ ఆరోగ్యంగా ఉందా?" చివరకు అడిగాడు.

"ఆమె వాళ్ళ ఊరు వెళ్ళింది" ముక్తసరిగా చెప్పి, లోపలికి వెళ్ళిపోయాడు.

విష్ణుకేం చేయాలో తోచలేదు. అయిదారు రోజుల తరువాత ఒకనాడు పరుగు, పరుగున వచ్చింది స్నేహ.

"విష్ణూ! నన్నెక్కడకయినా తీసుకువెళ్ళు. ఓ ఫారిన్ రాళ్ళే పెళ్ళికొడుకును చూచారు." అన్నది వగరుస్తూ.

విష్ణు ఆలోచిస్తుంటే రూమ్‌మేట్స్ తిట్టారు. నిమిషాలపై గుడిలో పెళ్ళికి ఏర్పాటు చేశారు. అలాగే ఫైనలియర్ అగ్రికల్చర్ చదువుతున్న ఒక కుర్రాడిగది నూతన దంపతులకిచ్చి, అతన్ని హాస్టల్‌కు షిఫ్ట్ చేశారు.

స్నేహతో పంచుకున్న జీవితం తను మరిచిపోగలడా?

అలా, ఊహిస్తూ నిదురలోకి జారిపోయాడు విష్ణు. మర్నాడు చాలా ఆలస్యంగా లేచాడు విష్ణు.

"విష్ణు! సత్యప్రకాష్ మామయ్యను హైద్రాబాద్ నర్సింగ్ హోమ్‌లో చేర్పించారట! మొదట నువ్వు చూచిరా; రేపు నేను వస్తాను." అన్నది.

"అలాగేనమ్మా." అన్నాడు. తల్లికి మిగిలిన ఒక్కగానొక్క తమ్ముడు. అతనంటే విష్ణుకు చాలా గౌరవము.

"కంగ్రాచ్యులేషన్స్ స్నేహా!" అన్నాడు బొంగురు గొంతుకతో.

"థాంక్స్. రా..." అన్నదీ దారి వదిలి. ఈసారి కాస్త తడబడుతూనే ఉన్నది. ఆమె సుఖం కోరినా, తనకు అనుభూతులు పంచి ఇచ్చిన స్త్రీ మరొకరి భార్య కావటం అతనికి నిప్పుల్లో దూకినట్లుంది.

"స్నేహా..." ఓ మగగొంతు పిలిచింది.

"వస్తున్నాను. కూర్చో, విష్ణూ! అయిదు నిమిషాల్లో వస్తాను. వారికి ఆరోగ్యం బాగాలేదు...." అంటూ వెళ్ళిపోయింది.

'ఛీ...ఛీ...ఏం ఆడపిల్లలు! మొక్కలాంటి వారు. ఒక దగ్గరనుండి పీకి మరో చోట నాటినా, నాటుకుపోతారు' అనుకుని బయటికి వచ్చి గేటు బయట ఉన్న మోటర్‌బైక్ స్టార్ట్ చేశాడు కసిగా.

## 4

ఆ వారమంతా మాధవికి బిజీగా గడిచిపోయింది. ఉదయం ఆరింటికి వెళ్ళి, రాత్రి పదింటికి వస్తుంది. రెండు మూడుసార్లు ఉదయమే, ప్రక్కనున్న కారు తుడుస్తూ హంస కనిపించింది. "గుడ్ మార్నింగ్" తప్ప మరేం మాట్లాడలేదు.

ఆదివారం ఉదయం పక్కమీద దొర్లుతుండగా

ప్రక్కింటినుండి ఓ స్త్రీ గొంతు, పసిపిల్ల ఆర్తనాదం, మగ గొంతు వినిపించి, లేచింది. తలుపుతీసి నిలబడింది.

"మమ్మీ! ...ప్లీజ్ నేను బిస్కట్లు తినలేదు. నిన్నటి నుండి మంచినీళ్ళు త్రాగాను..." అంటుంది.

"వేలెడు లేదు, యెంత నెరజాణో చూడండి, నిన్నటి నుండి ఉపవాసముందట, నమ్మమన్నారా?"

"అబ్బ! చిన్నపిల్లకు పనిష్మెంట్లు, పట్టుదలలు ఏమిటి?" మగగొంతు విసుక్కుంది.

"ప్రామిస్ డాడీ! నేను తినలేదు." హంస వెక్కిళ్ళు వినిపించాయి. పిలిస్తే మేనక్కే కావు, అనుకుంటుండగానే తలుపులు తెరుచుకున్నాయి. లుంగ చుట్టుకుపోయి మాధవి కాళ్ళదగ్గర పడిపోయింది.

"చావ్వే! నువ్వు చస్తే పీడా పోతుంది." అన్న స్త్రీ గొంతు కర్కశంగా వినిపించింది.

ఏమో అనబోయిన మాధవి నోట్లోమాట నోట్లో ఉండిపోయింది. తలుపు వేయబోయిన స్త్రీ అలాగే ఆగి పోయింది.

"నువ్వు...నువ్వు మాధవివా?"

"నువ్వు...నువ్వు కమలవి కదూ!" అన్నది మాధవి.

"నువ్విక్కడున్నావా!" కమల చప్పున వచ్చి మాధవిని కౌగిలించుకుంది.

"తెలుగువారెవరో వచ్చారని మీ పాపను చూచి

అనుకున్నాను కాని నువ్వని తెలియదు." అన్నది మాధవి ఉద్వేగంగా.

వీళ్ళిద్దరూ మాట్లాడటం చూచిన హంస మెల్లగా లేచి గీరుకుపోయిన మోచేతిని చూసుకుంది.

"రా...రా..." అంటూ కమల పిలిచింది. మాధవి జుట్టు ముడివేసుకుని వెళ్ళింది. అసలు విషయము మరిచిపోయింది. ఇద్దరూ కాఫీ త్రాగుతూ ముచ్చట్లు చెప్పుకున్నారు.

"మీ వారి కిప్పుడు ఇథియోపియాలో ఉద్యోగం వచ్చిందన్నావు కదూ?" అన్నది మాధవి.

"అవునే. అక్కడ రాజకీయ పరిస్థితులు చాలా దారుణంగా మారాయి. దాంతో చుట్టూ ఉన్న దేశాలు కెన్యా, జాంబియా, ఘనా, నైజీరియాకు అప్లై చేశాము. ఇక్కడ టెక్నికల్ ఇన్‌స్టిట్యూట్‌లో వచ్చింది ఉద్యోగం." అన్నది సంబరంగా. ఓ మూడేళ్ళ పాపను, సంవత్సరం బాబును ఎత్తుకుని వచ్చి మాధవి వడిలో దింపింది.

"జెబి, ఆంటీకి గుడ్ మార్నింగ్ చెప్పమ్మా! ఇది మా పెద్దది, వీడు హాకిష్ మా వంశోద్ధారకుడు." అన్నది.

మాధవి బొమ్మల్ని చూడసాగింది. అదే క్షణంలో బయటనుండి, వెక్కిళ్ళు వినిపించాయి. ఆమె కళ్ళముందు ఎన్నో గతించిన విషయాలు సుళ్ళు తిరిగాయి.

"మమ్మీ! అక్కచూడు మమ్మీ!" అంటూ, హంస చొక్కాపట్టి లాగింది.

"ఏమన్నావే?" ఈసారి కమల గొంతులో మార్దవం ఎక్కడా లేదు.

"నేనేం అనలేదు మమ్మీ! కొడతానంటే దూరం జరిగాను." అన్నది హంస.

"కొడతానంటే, కొట్టించుకుంటే ఏమయిందే కడుపు మంట కాకపోతే." అన్నది కమల.

మాధవి ఆశ్చర్యంగా చూచింది. కమల కూతురిని ఎత్తుకుంది.

"దాని జట్టు వచ్చి. వెళ్ళి డాడీని పిలువమ్మా." అన్నది. ఆ పాప వెళ్ళిపోయింది.

"హిమబిందు, హరీష్, ఎలా వున్నాయి పేర్లు!"

"బావున్నాయి." అన్నది. మరో సందర్భంలో అయితే "హాట్సాఫ్ టు యువర్ శ్రేస్ట్" అనేవి.

"ఏమిటోనే బిందు పుట్టాక అసలు మా జీవితం మారి పోయిందనుకో." అంటూ బిందు పుట్టుకకు తాము అనుభ వించిన థ్రిల్ చెప్పింది.

అనాసక్తిగా విన్నది మాధవి.

'మారుటి తల్లో, పెంపుడు తల్లో కావాలి.' అన్న మధుకర్ మాటలు చెవుల్లో గింగురుమన్నాయి.

"వస్తాను కమలా!" వచ్చి, సోఫాలో వాలి పోయింది. ఆమెకు అర్థ సంవత్సరాల వెనక జరిగిన సంఘట

నలు కళ్ళముందు తిరిగాయి. కమల, తను ఒకే బడిలో పదవ తరగతి వరకు చదివారు. ఆ తరువాత తను హైద్రాబాద్ వచ్చేసి చదువుకుని, ఉద్యోగం చేస్తుంది. తల్లికి రోజూ తన పెళ్ళి గొడవే వుండేది. ఒకరోజు తను ఆఫీసునుండి వచ్చేసరికి కమల వున్నది ఇంట్లో.

"ఎప్పుడొచ్చావే కమలా?"

"వారం రోజుల క్రితమే ఈ ప్రక్కింట్లో చేరాం. మావారు ఇక్కడ సి. టి. ఐ. లో ఉద్యోగం చేస్తున్నారు."

"అలాగా చాలా సంతోషం" అన్నది. ఆ మాట ఈ మాట మాట్లాడి వెళ్ళిపోయింది. కమల ఆమె భర్త కుటుంబ స్నేహితులుగా మారి తరుచుగా వచ్చేవారు. వారిద్దరి మాటల్లో సంతానం లేదన్న ఆవేదన వ్యక్తం అయ్యేది.

"ఏమిటే ముసలమ్మలా! ఇరవై ఒకటి దాటనేలేదు" అన్నది మాధవి.

"సీ ఈడుదే దానికి పెళ్ళిఅన్న ధ్యాసలేదు. వాళ్ళ నాన్నకు చెవుల్లో దూరనే దూరదు. నీకు పిల్లలు లేరన్న చింత పట్టుకుందా?" అన్నది రుక్కమ్మ. ఆమె పూర్తిపేరు రుక్మిణీ అయినా అందరూ రుక్కమ్మ అంటారు.

"ఏమో ఆంటీ, నాకుమాత్రం పిల్లలు పుడతారని ఆశలేదు. మంచి అనాథబాలలోని పిల్ల కనిపిస్తే పెంచుకుందామని వుంది." అన్నది.

అన్నది. మాధవి, ఆమె స్నేహితురాలు, పాప భాగ్యవతి వహిస్తానని సంతకాలు పెట్టారు.

"ఆ డాక్టరమ్మ చావక్కంగాని పాపకేం కష్టం వస్తుంది!" అన్నది కమల నిధి, నిక్షేపం దొరికినంత సంబర పడుతూ.

కమలకు యెంత సమయము షాపింగ్‌కు సరిపోయేది కాదు. కనిపించిన బొమ్మల్లా కొనేది. అప్పుడే మాధవికి ఢిల్లీ సెక్రటేరియట్‌లో ఉద్యోగం దొరికింది. కమల కంట తడి పెట్టింది.

"నా పడి నింపావు, పాపకు పేరు పెట్టేవరకు ఉండవా మధూ!" అన్నది బాధగా.

"ఐక్కడేక ఎక్కడున్నా వస్తాను. పాప అదృష్ట వంతురాలవుతుంది. నవ్వితే ఆ బుగ్గల్లో చూడు సొట్టపడు తున్నాయి." అన్నది మాధవి.

"మా ఇంట పడినవాడే అదృష్టవంతురాలయింది. మధూ! లక్షల కధికారి." అన్నది అతిశయోక్తిగా.

ఆ తరువాత ఉత్తరాలు రాయలేదు. పేరు పెట్టిన సంగతి తెలియదు. ఒకరోజు తల్లి, తండ్రి ఢిల్లీ చూడటానికి వచ్చారు.

"అమ్మా! కమలా, పాప ఎలా ఉన్నారే, ఉత్తరం వ్రాయలేదు." అడిగింది మాధవి.

"ఆమెకు ఈ ప్రపంచం గుర్తుందంటే తల్లీ! ఇరవై నాలుగంటలు 'పాప, పాప' అంటుంది. కోతికి కొబ్బరికాయ దొరికినట్టుంది." అన్నారు.

పోన్లే ఒక అభాగ్యురాలికి అంతటి అమ్మప్రేమ దొరికితే అంతకంటే ఏం కావాలి? ఆ తరువాత, తను ఆఫీసులో వుండగా శ్రీపతిరావు ఫోన్ వచ్చింది.

"మాధవిగారూ! పాప వచ్చిన వేళావిశేషం, నాకు ఇథియోపియాలో ఉద్యోగం వచ్చింది మా ఫ్లైట్ రాత్రి రెండుగంటలకుంది." అన్నాడు.

"కంగ్రాచ్యులేషన్స్! మీరున్న హోటల్‌కు వచ్చి కలుసుకుంటాను." అన్నది.

"హోటల్ జనపథ్‌లో ఉంటాం" అని ఫోన్ పెట్టేశారు. మాధవి, అర్జంటు ఫైలు రావటంతో ఆ విషయమే మరిచిపోయింది.

సుధాకర్ గుర్తుకు వచ్చి తన మతిమరుపును తిట్టుకుంది. కనీసం ఉత్తరం వస్తుందేమోనని చాలా ఎదురు చూసింది కాని రాలేదు. వాళ్ళ విషయమసలు మరిచిపోయింది.

అప్పుడే అందరూ అప్లై చేస్తుంటే తనూ చేసింది కెనడాకు. ఉద్యోగం వస్తుందని ఆశించలేదు. ఫర్టిలైజర్ ఫ్యాక్టరీ, సైంటిస్టులకు, టెక్నీషియన్స్‌కి అవకాశం ఉంటుంది. అనుకోకుండా తనకే ఉద్యోగం వచ్చింది. తల్లి తండ్రి గోల చేస్తారేమో అనుకుంది.

"వెళ్ళమ్మా!...వెళ్ళు. చిన్నవారికయినా కొత్త మంచి సంబంధాలు చేద్దాం." అన్నాడు తండ్రి.

ఆమె కెన్యా వచ్చింది. అక్కడ వేరే అపార్ట్‌మెంటులో ఉండగా స్త్రీలతో పరిచయాలు అయ్యాయి.

స్నేహపాత్రులు కారు. అందరూ డబ్బు, హోదా అంటూ ప్రాకులాడుతారు. అవివాహిత కాబట్టి, ఎవరి మగడిని ఎత్తుకు పోతారోనని భయం.

"డాక్టరో, టీచరో అనుకున్నాము. సైనోనంట..." అనేవారు.

ఎవరు, ఎప్పుడు, ఎందుకు కల్గించారో కాని, సైనో అంటే ఆఫీసరు ఉంపుడుకత్తె అన్న అభిప్రాయంతో ఉన్నారు. అది చాలా అసహ్యమనిపించింది.

స్త్రీ జాతిని సానుభూతితో అర్థం చేసుకోవాలి, కోప గించుకోకూడదు అనుకుంది. మనశ్శాంతి భంగం కలిగే చోటు అంటే మాధవికి చాలా భయం. అందుకే కుటుంబాలతో సన్నిహితం తగ్గించుకున్నది. తనతోపాటు పనిచేసే మధుకర్, వసంత్ రావు దగ్గరయ్యారు.

"ఎవడినో ఒక్కడిని కట్టుకుంటే పోదూ! ఇద్దరితో తిరుగుతుంది." అంటుంటారు. నవ్వొస్తుంది.

తనూహించని విధంగా కమల ఇక్కడ దర్శనము ఇచ్చింది. తనకు పిల్లలు పుడితే అంత నిర్లక్ష్యం చేయాలా!

"మేడమ్ కాఫీ..." ఎలిషా వచ్చింది. కాఫీ తీసు కుంటుండగానే శ్రీపతిరావు వచ్చాడు. 'అప్పటికంటే లావ య్యాడు. జుట్టు పలుచబడింది.' అనుకుంది మాధవి.

"నమస్తే మాధవిగారూ !"

"రండి. ఎలీ...కాఫీ" అన్నది.

"అక్కరలేదు, తీసుకుని వస్తున్నాను." అన్నాడు. అతను చూస్తూ కూర్చున్నాడు. ఆమె ఏమీ అడగలేక పోయింది.

"నన్ను క్షమించండి మాధవిగారూ! ఎంత శ్రమ పడినా కమలను మార్చలేక పోతున్నాను. హిమబిందు పుట్టే వరకూ హంస అంటే ప్రాణంకన్న మిన్నగా చూచింది. నాకే ఆ అతిప్రేమ విసుగు అనిపించేది. కొందరు స్నేహి తులు కూడా మీకే ఉందా ప్రపంచంలో లేని పిల్ల అంటూ మాతో దూరం అయ్యారు. బిందు పుట్టింది, మీరు నమ్మండి, మానండి, నాకు మాత్రం హంస చలువ మహిమే నన్న అభిమానం వుంది. కమల పూర్తిగా మారిపోయింది. నన్నేం చేయమంటారు ?" అతను ఆవేదనగా, ఆర్తిగా అడిగాడు.

ఆమె జవాబు చెప్పలేకపోయింది. దీర్ఘంగా నిట్టూర్చింది.

"హరీష్ పుట్టాక మరీ ఎక్కువయింది. నేను చెయ్యి కూడా చేసుకున్నాను. నాకు చెప్పకోవటానికి ఎవరూ లేరు. ఈ సంవత్సరం చదువు మానిపించింది. ఒక్కటే ఆశతో ఉన్నాను. డిసెంబర్‌లో భారతదేశం వెళ్తాం. అప్పుడు ఏదయినా రెసిడెన్సియల్ స్కూల్లో పెడతాను." అన్నాడు అతను.

"ఐడియా బాగానే వుంది." అన్నది మాధవి ఆలోచిస్తూ.

"హాయ్ మాధవీ..." వసంతరావు వచ్చాడు. అతను రావటంతో హంస విషయము వదిలి, పరిచయాలు, ఉద్యోగాల విషయాలు మాట్లాడుకున్నారు.

## 5

డాక్టర్ జగన్‌మోహన్‌కి చాలా సంతోషంగా ఉంది. అతను భార్యతో పంతం కట్టి గెలిచాడు. కొడుకని అతను, కూతురని స్నేహలత అనుకొన్నారు. కాని కొడుకే పుట్టాడు. సందీప్‌కుమార్ అని నామకరణం చేశారు. అతనికి చాలా రాబడి వుంది. అందుకే అత్తవారు పోరినా అతను విదేశాలకు వెళ్ళలేక పోతున్నాడు.

ప్రేమలత, ఆమె భర్త వెళ్ళిపోయారు.

"పెద్దల్లుడు విదేశాలలో ఉన్నాడంటే మాకెంత గొప్ప, నువ్వూ వెళ్ళు నాయనా!" అన్నారు.

"నాకిక్కడ రాబడితో తృప్తిగానే ఉందండి, స్వంత బంగళా, కారు, నాకు కావలసిన హంగులన్నీ ఉన్నాయి. విదేశాలకు వెళ్ళి సంపాదించవలసినంత అవసరం లేదు." అన్నాడు.

అన్నా వినరు, వాళ్ళ తాపత్రయం వారిది. గొప్పగా చెప్పుకోవాలని వుంది.

ఆమె కొడుకుని పడుకోబెట్టి, బాత్ రూమ్‌లోకి వెళ్ళింది. ముఖం కడుక్కొని వచ్చేసరికి తల్లి, తండ్రి మాటలు చెవుల్లో పడ్డాయి.

"ఆ పిల్ల భలేగా ఉండేది కదా."

"అవునండీ. పుట్టగానే మూడు నెలల పాపలా ఉంది. ఎక్కడుందో..."

స్నేహలత వణికిపోయింది. ఆమె అపరకాళిలా బయటికి వచ్చింది.

"నా పాప...నా పాప చనిపోయిందన్నారు."

"ఉష్! అవతల అల్లుడు వున్నాడు..." అన్నారు.

"పదండి మామయ్యా, మిమ్మల్ని బండెక్కించి, నేను ఒక పేషెంటు దగ్గరకు వెళ్ళాలి." జగన్‌మోహన్ వచ్చాడు.

ఎవరో తరుము తున్నట్టు ఇద్దరూ బయటకు వచ్చారు.

"ఊళ్ళో ఉండి విశ్రాంతి తీసుకొమ్మంటే రావు. ఇక్కడయినా జాగ్రత్తగా ఉండు."

"ఊహూ..." ఎన్నో నిష్ఠూరాలు వెయ్యాలని వుంది. కాని భర్త ఉన్నాడని దిగమింగింది.

వాళ్ళు వెళ్ళిపోయారు. స్నేహలత వచ్చి ఉయ్యాల దగ్గర నిలబడింది. సందీప్ ముఖం మెల్లి, మెల్లగా ఫేడ్ అయింది. ఆ స్థానంలో అందమైన అమ్మాయి ముఖం ప్రత్యక్షమయింది.

ఆ రోజు సాధారణంగా, ఆర్భాటం లేకుండా వివాహం జరిగింది. విష్ణు తనూ గది తీసుకుని కాపురం పెట్టారు.

"ఇక్కడ వద్దు విష్ణు, మీ ఇంటికి వెళ్దాం." అన్నది అతని జుట్టు సవరిస్తూ. అతను తన జుట్టు సవరిస్తున్న చేతిని తన గుప్పిట్లో బిగించాడు.

"మా అమ్మను అంగీకరింప జేయటం తేలికే స్నేహా, మా ఇంట్లో ఓ యముడున్నాడు. అతనితో సమస్య. నువ్వు అనుకుంటున్నావు, అగ్రకులాలవారు వస్తే తక్కువ కులం వారు ఆహ్వానిస్తారని. అది శుద్ధ తప్పు. వాళ్ళు అభిజాత్యం ప్రదర్శిస్తారు" అన్నాడు.

"మరెలా!"

"నువ్వేం దిగులు పడకు. ఒక్క ఆరునెలలు అది లేదు, ఇది లేదు అనకుండా ఉన్నదాంట్లో సర్దుకుంటే అంతా చక్క బడుతుంది."

"అంటాను, నిన్న బాగా నవ్విస్తాను, సరా:.." అన్నది అతని జుట్టు రేపుతూ.

అలా వారం రోజులు, ఒకరికి ఒకరయి గడిపారు. తను కష్టం కల్గిస్తానని అనలేదు, కల్గించాలని అతను చూడ లేదు. ఇద్దరూ ఈ లోకాన్ని, తమచుట్టూ ఉన్నవారిని మరిచి పోయారు. ఆ రోజు హుషారుగా వచ్చాడు విష్ణు.

"ఏమిటో సంబరం!" అన్నది అతని ఛాతీ పై వాలి.

"మా అమ్మమ్మతో మా వాయిగా విషయం చెప్పాను."

"ఏమన్నాడు?" ఆత్రంగా అడిగింది.

"నన్న కొంతెగా ఆకట్టుకున్న ఆ మనుషులు ..."

కాన్ని చూడాలి, నాకు నచ్చితే అమ్మకు నచ్చచెబుతా నన్నాడు."

"నువ్వు అనవసరంగా బాధపడతావు విష్ణూ! ఈ డబ్బున్న వారికంటే, మధ్య తరగతి వారే నయం." అన్నది తను సంబరంగా.

ఆరోజు ఇద్దరూ ఊహాలోకాలలో ఉయ్యాల లూగారు.

ఆకాశపు టంచుల కెగిరిపోయి, భవిష్యత్తు కార్య క్రమాలు నిర్ణయించుకున్నారు.

అప్పుడు స్నేహ తండ్రి వచ్చాడు. తను పొరపాటు చేసి డాక్టరు సంబంధం కుదిర్చి పాపం కట్టుకున్నాను క్షమించ మన్నాడు. విష్ణు కెగిరిపోయాడు.

"పెద్దవారు మీరు అంతమాట అనకండి." అని బ్రతిమాలాడు.

ఆయన బజారుకు వెళ్ళి పండ్లు, స్వీట్స తెచ్చాడు. అందరూ ఆనందంగా భోజనము చేశారు.

"చూడు నాయనా! మన తరాల అంతరాలు గుర్తుంచుకుని నాకో సహాయం చెయ్యి."

"ఏమిటో ఆజ్ఞాపించండి." అన్నాడు ఆ సౌజన్య మూర్తిని చూచే ఆరాధిస్తుందేమో తను అనుకుంది స్నేహ.

"అందరూ నా కూతురు లేచిపోయిందనుకుంటే నాకు తల ఎత్తుకు తిరిగే యోగముండదు. నేను స్నేహాలతను తీసుకు వెళ్ళి వారం రోజులలో ముహూర్తం నిర్ణయించి, ఉత్తరం వ్రాస్తాను. మీ బంధువులతో నువ్వు వచ్చెయ్యి. ఇదిగో ఈ

అయిదువేలుంచు. నువ్వు రెండు సూట్లు కుట్టించుకుని; మిగి లింది, రైలు ఛార్జీలకు ఉంచు." అయిదువేలు విష్ణువర్ధన్ చేతిలో పెట్టాడు.

"ఇంత డబ్బు అక్కర లేదండి." విష్ణు మొహమాట పడ్డాడు.

"పరాయి వాడిలా చేస్తావేం? అందరూ ఫస్ట్‌క్లాసు లోనే రండి." అన్నాడు తన తండ్రి.

ఎంతో ఆనందంగా విష్ణు బండి యెక్కించాడు. పళ్ళు, మాగజైన్స్ తెచ్చి ఇచ్చాడు. తండ్రి ఉన్నాడని ఇద్దరూ మౌనంగానే గడిపారు. ట్రైన్ దిగేసరికి తెలిసింది తండ్రి యెంత పెద్ద నటుడో. అక్కడినుండి దాదాపు స్నేహను ఖైదుచేసి తీసుకువెళ్ళారు. సామదానభేద, దండో పాయాలు ఉపయోగించారు. మంగళసూత్రాలు త్రెంచి పారేశారు.

"నువ్వు జగన్‌మోహన్‌రావుతో వివాహానికి అంగీక రిస్తేగాని పచ్చిమంచినీళ్ళు ముట్టనని," తల్లి నిరసనవ్రతం ప్రారంభించింది. ఏం చేయాలో తోచని అయోమయ స్థితిలో ఉండిపోయింది స్నేహ. తండ్రి ఆత్మహత్య చేసు కుంటానని బెదిరించటం, బంధువులన్నవారి హితవు కది లించ లేదుగాని, విష్ణువర్ధన్‌ను నాశనం చేస్తామన్న విషయం ఆమె బుర్రకు బాగా యెక్కింది. ఆమె జగన్‌మోహన్‌తో వివాహానికి అంగీకరించింది. సమయము లేదని, నిశ్చితార్థం కాగానే, అతను రష్యా వెళ్ళాడు.

నిరాసక్తిగా, నిర్లిప్తంగా, జీవచ్ఛవంలా బ్రతుకు సాగింది. విష్ణు అడ్రసు లేదు. హాస్టల్‌కు వ్రాయవచ్చు. అతని స్నేహితుల సంగతి తెలుసు, కాని అతనికి వ్రాసినట్టు తెలిస్తే తండ్రి యెంతకయినా దిగజారుతాడు. ఆమె ఈ ప్రపంచాన్నే మరిచిపోయింది.

"పిల్ల రోజురోజుకు నీరసించి పోతుందండీ." అనే తల్లి.

"తెలిసీ, తెలియని వయసులో వచ్చే ప్రేమ జబ్బులు అలాగే ఉంటాయి, నువ్వేం కంగారుపడకు." అన్నాడు తండ్రి.

స్నేహలతకు తెలుసు తను నెల తప్పిందని. ఆ విషయం ఇంట్లో చెప్పదలుచుకోలేదు. తను తల్లి అయిన తరువాతయినా, వాళ్ళు జాలి తలుస్తారనుకుంది.

అయిదో నెలలో తల్లికి అనుమానం వచ్చి, డాక్టర్‌కు చూపించింది. తల బాదుకుంది. తిట్టింది, కొట్టింది. హుటాహుటిగా హైద్రాబాద్ ప్రయాణం అయ్యారు. అక్కగారింట్లో మంతనాలు, గొడవలు జరుగుతున్నాయి. తనకేం పట్టనట్టు, భోజనానికి పిలిస్తే వెళ్ళి వస్తుంది.

"ఇప్పుడు అబార్షన్ చేయటం చాలా కష్టం..." అన్నాడు బావ. అంతే, ఆ ఇంట్లో ఖైదు చేశారు. ఒకరోజు ఒక కార్డు దొరికితే, నాలుగు అక్షరాలు రాసి విష్ణుకు పోస్టు చేసింది. తన పరిస్థితి తెలిపింది.

అయిదారు రోజుల తరువాత బయట చాలా గల్లంతు, గొడవ జరిగింది. పనిపిల్లను అడిగింది, ఏమిటని.

"యెవల్లో ఒక మడిసి వచ్చిండమ్మ. నా భార్య

ఉన్నదంటే మీ నాయన, బావ కలిసి ఆయనను గెంటేసింద్రు." అన్నది.

ఆమె కడుపులో చెయ్యిపెట్టి దేవినట్టయింది. గదిలో నుండి బయటపడే మార్గం కనిపించలేదు.

విష్ణు వచ్చి వెళ్ళిన దగ్గరనుండి, గదిలోకి తల్లి, అక్క, తండ్రి తప్ప మరో మనిషి వచ్చేవారు కాదు. ఒకరోజు విపరీతంగా నడుము పోటు వచ్చింది. బావగారు జాగ్రత్తగా తీసుకు వెళ్ళి ఓ ప్రయివేటు నర్సింగ్ హోమ్‌లో చేర్పించాడు.

"వివాహం కాకుండా గర్భం ధరించారా?" వళ్లు తుడుస్తూ నర్స్ అడిగింది.

"ఏం? యెందుకు?"

"ఇక్కడికి వచ్చేవారంతా అలాంటివారే. ఈ డాక్టరమ్మగారు సోషియల్ వర్కర్. ఇక్కడ కని వదిలేసిన పిల్లలను, ఆమె యెవరికో ఒకరికి దత్తు ఇచ్చి, వీళ్ళ భారం వదిలిస్తుంది." అని చెప్పింది.

స్నేహలత వణికిపోయింది. తన విష్ణు ప్రతిరూపాన్ని అలా వదిలివేయదు, పురుడు రాగానే పాపతో పారిపోయి, లోకానికి నిజం చెబుతుంది.

కాని ఆమెకంటే ముందు పుట్టిన తల్లి తండ్రులు అతి తెలివిగా ఆమెకు స్పృహలేని స్థితిలో అన్నీ కానిచ్చేశారు. స్పృహ రాగానే తన బిడ్డకోసం అడిగింది.

"పుట్టగానే చనిపోయింది." అన్నమాట తప్ప రెండో మాట లేదు.

స్నేహలత కొన్నాళ్ళు ఏడ్చింది. ఆ కోపంలోనే

మనబిడ్డను ఈ రాక్షసులు దాచివేశారని, విష్ణువర్ధన్‌కు ఉత్తరం వ్రాసింది. ఆ ఉత్తరం అందిందో లేదో తెలియదు కాని విష్ణు మళ్ళీ ఎప్పుడు రాలేదు.

నెల రోజుల తరువాత అంతా తను ఊరు వెళ్ళారు. జీవచ్ఛవంలా బతికింది. మరో ఆరు నెలలకు జగన్ మోహన్ వచ్చాడు. అతనితో స్నేహ వివాహము అయింది. ఆమె మృదుభావాన్ని సిగ్గుగాను, ఆమె నిస్పృహను గాంభీర్యంగాను సరిపెట్టుకున్నాడు. స్నేహాలోని చదువూ, సంస్కారం నిలదీసేవి. 'అతనిదేం తప్పు' అంటూ. నిజమే అతనిదేం తప్పు !

జగన్‌మోహన్ మంచితనానికి లొంగిపోయి, జీవితంతో రాజీపడిపోయింది. అనుకోని విధంగా రెండు సార్లు వచ్చిన విష్ణువర్ధన్ ఆమె పలకరిస్తుండగానే పారిపోయాడు. తన అసహాయత చెప్పాలని ఉంది.

కాని...అనుకోకుండా ఈ రోజు ఏం విన్నది తాను. తన తల్లితండ్రులు చెప్పరు. తను పురుడు పోసుకున్న నర్సింగ్ హోమ్‌కు వెళ్ళాలి. అవును వెళ్ళి తన పాపను తెచ్చుకోవాలనుకుంది. ఆమె ఉయ్యాల దగ్గర నిలబడి వెక్కి, వెక్కి ఏడుస్తున్నానన్న సంగతి మరిచేపోయింది.

"ఏమయింది స్నేహా! ఇదంతా మీ వాళ్ళను గురించిన బెంగేనా!" వెనుకనుండి వచ్చి, భుజం తట్టేడు జగన్ మోహన్.

"ఛ...అదేం కాదు..." అని కళ్ళు ఒత్తుకుని, అతని వెంట డైనింగ్ హాల్లోకి వెళ్ళింది.

ఆ మర్నాడు ఆటో తెప్పించుకుని నర్సింగ్ హోమ్‌కు వెళ్ళింది.

ఆ డాక్టరమ్మకే పెరాలసెస్ వచ్చిందట. ఆమె రెండు చేతులు పట్టుకుంది స్నేహ.

"డాక్టర్... డాక్టర్! నా బిడ్డ బ్రతికే ఉందా... చెప్పండి..." ఆమె చేతులు పట్టుకుని బ్రతిమాలుతూ అడిగింది.

ఆమె అయోమయంగా చూచింది.

"నాకు నిజం చెప్పండి డాక్టర్! మీరొద్దంటే ఆ పాపను అడగనే అడగను..." అన్నది.

ఆ డాక్టర్ రిజిష్టర్ తెప్పించమని సైగ జేసింది. స్నేహ పరుగెత్తింది. రిజిష్టరులో ఆ సంవత్సరం తన పేరు గల వారెవరూ పురుడు పోసుకోలేదు. స్నేహ ఒక్కసారి స్పృహలోకి వచ్చింది. తన అసలుపేరు, అడ్రసు వ్రాసి ఉండరని. వివరాలు అడగటానికి అక్కడ యెవరూ పాత వారు లేరు. డాక్టరు మాట్లాడలేదు, వ్రాయలేదు.

ఓ గంట వేస్ట్ చేసి వచ్చింది.

యెప్పుడూ దిగులుగా, ఊహాలోకాలలో తన పాపను చూచుకుని తృప్తి పడేది.

ఓ ఆదివారం ఉపహారం చేస్తున్నారు.

"స్నేహా! నీకు పాపలంటే ఇంత మోజని తెలియదు." అన్నాడు జగన్‌మోహన్.

"యెవరు చెప్పారేమిటి? మీరు బాబు కావాలంటే, నేను పాప కావాలన్నాను, ఫన్‌సేక్..." అని తప్పించుకో బోయింది.

"ఫన్‌సేక్ మాట్లాడితే నిమురలో జపించరు." అన్నాడు ఫక్కున నవ్వేస్తూ.

ఒకసారి ఉలిక్కిపడింది. తను అతనితో నిజం చెప్పాలి లేకపోతే యెంత ప్రమాదం! నిజం చెబితే గ్రహించే శక్తి అతనికి ఉందో లేదో. ఆమె అక్కడినుండి త్వరగా వెళ్ళిపోయింది.

"ఇసంతా సిగ్గేనా!" మరోసారి పక, పక నవ్వాడు.

ఆమె జవాబు ఇవ్వలేదు, ఫోన్ రావటంతో అతను వెళ్ళిపోయాడు. ఆమె తేలికగా నిట్టూర్చింది.

# 6

"కమలా !"

"ఊఁ..." అన్నది కార్డ్స్ షఫిల్ చేస్తూ. విశాల ప్రపంచంలో అడుగు పెట్టిన కొంతరు అంతరంగం మార్చు కుంటారు. ఆలోచనా పరిధి పెంచుకుంటారు. కొత్తవి, మనకు వచ్చే పనులకంటే ఉపయోగమయినవి నేర్చు కుంటారు.

కాని కమల మాత్రం పాశ్చాత్యనాగరికం బాగా అలవరుచుకున్నది. బాబ్డ్ చేయించుకున్నది. చీరలు మానేసి, ప్యాంట్లు, డ్రస్సులు కుట్టించుకున్నది. బాగా త్రాగుడు నేర్చుకుంది కమల.

"నేనొక మాట చెబుతాను వింటావా?"

"చెప్పు." అన్నది నిర్లక్ష్యంగా.

"హాలిడేస్ అయిపోగానే హంసను బడిలో చేర్పించు." అన్నది.

"యేటు ఆలోచిస్తున్నావ్ జోకర్ పారేశావ్?" అన్నది హంస విషయం వినిపించుకోనట్లు.

"ఓ...ఐసీ...అదేమంత పెద్ద విషయంకాదు."

"పెద్ద విషయాలు ఆటలాడుతూ చర్చించుకోరు."

మాధవి కార్డ్సు దూరం గిరాటేసింది.

"నేను రెండు నెలల నుండి సీరియస్‌గా చెబుతున్నాను."

"తెలిసిన దానవు ఇతరుల విషయాల్లో జోక్యం కలుగ జేసుకోవద్దని తెలియదా?" అన్నది కోపంగా కమల.

మాధవికి కోపం వచ్చింది. పళ్ళు బిగువున కోపం అదిమి పట్టింది.

"నాకు పిల్లలు కలుగలేదు, ఒక అనాథ పిల్లను తెచ్చుకున్నాను, పెంచుతున్నాను. నాకు పిల్లలు కలిగారు, నా పిల్లలతో సమాన హక్కు కోరితే యెలా?" అన్నది నిర్మోహమాటంగా, నిర్లక్ష్యంగా.

"అంతకంటే యెక్కువగానే చూడాలి. ఆ అమ్మాయి వచ్చిన వేళా విశేషము అనుకోరాదు." అన్నది పదునుగా.

"ఓహో! సెంటిమెంట్లు చట్టుబండలు లేని మహామేధావిగా, ఈ గొడవ ఏమిటే?" అన్నది.

"కమలా! ప్లీజ్, మానవతా దృక్పథంతో ఆలోచించు." అన్నది.

"చూడు మధూ! ఈ సలహాలు యెవరన్నా ఇస్తే

పళ్ళు రాగొట్టి పంపేదాన్ని. మోసేవాడికి తెలుసు పల్లకీ బరువు. నాతో స్నేహంగా ఉండాలంటే నీ హద్దులేమిటో తెలుసుకో." అన్నది విసురుగా లేస్తూ.

"నా హద్దు నాకు తెలుసు కమలా! నీవు మరిచిపోయినా, నేనెలా మరిచిపోతాను? మీకు బిడ్డను ఇచ్చే రోజున డాక్టర్ షీలా కేడ్కర్ నన్ను హామీ ఉంచింది."

కమల ముఖం ఎఱ్ఱగా మారింది. మాధవి వంక పహ్యంగా చూచింది.

"అయితే ఇంకేం, నాకు బిడ్డలుపుట్టి సర్వంగా చూడటం లేదు. ఆ దిక్కుమాలిన పిల్లను నువ్వే ఉంచుకో." అన్నది విసురుగా. చర, చర ఇంట్లోకి వెళ్ళి, బల్లలు తుడుస్తున్న హంసను తెచ్చి, మాధవిపైకి నెట్టింది.

"పోవే! ఆవిడ మీ నిజమైన మమ్మీ..." అని తలుపు వేసుకుంది.

కమల దురుసు స్వభావం తెలుసు. యెందరో మొరటుగా మాట్లాడేవారి స్వభావము సున్నితంగా ఉంటుంది. ఈ మనిషిని యెలా అర్థంచేసుకోవాలో తెలియలేదు.

హంస మోచేయికి దెబ్బ తాకింది. ఆ పిల్ల బిక్కు, బిక్కున చూచింది. మాధవి చిన్నగా నవ్వింది.

"ఆంటీ! మమ్మీకి కోపం యెందుకు వచ్చింది?"

"ఊరికేనే..." అని ఆ పిల్లను లేపి, మందు వేసింది. ముఖం కడిగి, పౌడరేసి బొట్టు పెట్టింది.

సాయంత్రం మధుకర్ వచ్చాడు. అతను వారం రోజులనుండి రాలేదు. అతన్ని చూచి నవ్వింది మాధవి.

"హూ ఆర్ యువర్ సెసెలాంక్ ఫ్రెండ్స్?" అన్నది.

"మీరు అలా మాట్లాడటం ఏం బాగుండ్లా." అన్నాడు ముఖం చిట్లించి.

"గుమ్మడి కాయల దొంగ అంటే భుజాలు తడుము కున్నారట."

"ఫ్రెండ్స్ అంటే ఉలిక్కి పడతావేం!" అన్నది. ఇద్దరూ కూర్చున్నారు. హంస బాబ్డ్ హెయిర్ బ్రష్ చేసు కుంటూ వచ్చింది.

"హాయ్ లిటిల్ డేమ్...ఏమిటి కార్డ్స్‌తో తొక్కుడు బిళ్ల ఆడారా?"

"అలాంటిదే బధూ!" హంస నవ్వుతూ చెప్పింది మాధవి.

"నేను చెపితే మీకు బాగుండదుగాని, మీ స్నేహితురాలిని గూర్చి చెప్పటూ ఒక్క మంచి మాట చెప్పటం లేదు. ఇవతల ఉండ వచ్చిన రెండు చోట్ల ఈ పాప గురించే అందరితో పోట్లాడింది."

"అందరూ పోట్లాడారు. నాకు మోరల్ కమిట్ మెంటుంది కదా." అన్నది బాధగా.

"వాళ్ళు వాడి అన్నట్టు ఏదయినా హాస్టల్లో చేర్పించు" అన్నాడు.

"ఇక్కడే సాధ్యం కాదు. తెలివి ఉన్న పిల్ల అనవస

రంగా పాడవుతుంది." అన్నది మెల్లగా హంసకు అర్థం కానంత అస్పష్టంగా.

"నువ్వు డిసెంబర్లో వెళ్ళి పోతున్నావుగా, అప్పుడు ఆలోచించవచ్చు." అన్నాడు.

"ఊఁ..." అన్నది ఫోటో చూస్తూ. హంస కార్డ్స తెచ్చి పెట్టింది.

"మాధవిగారూ! నాకు ఒక కప్పు టీ కావాలి." అన్నాడు మధుకర్.

ఆమె వినిపించుకోలేదు.

హంస వెళ్ళి టీ తీసుకు వచ్చింది. మాధవి ఆశ్చర్యంగా చూచింది.

"థాంక్యూ డియర్! మేడమ్ నేను మిమ్మల్ని టీ అడిగాను. మీరు పరధ్యానంలో ఉన్నారు." అన్నాడు టీ తీసుకుని.

"మీరు తీసుకోండి ఆంటీ!"

"ఊఁ..." అన్నది. అంత చిన్న పాప రెండు కప్పుల టీ చేయటం అన్యాయం కాని, అలా చేయించటం అసూయ. ఆమె హృదయం కదిలిపోయింది. ఆకు చాటు పిందెలా పెరగవలసిన పసిబిడ్డ.

"మీరు టీ బాగుందో, లేదో అని ఆలోచిస్తున్నారు ఆంటీ! నేను చేస్తే టీ బాగుంటుందంటారు డాడీ!"

"మీ డాడీ మాటను నేను సెకండ్ చేస్తున్నాను." అన్నాడు మధుకర్.

టీ తాగింది మాధవి. లేచి, బిస్కెట్లు, వేపర్స

హంసకు పెట్టింది. ఆమె మధుకర్‌తో ఎప్పటిలా కబుర్లు చెప్పలేకపోయింది. అతనే తను ఎక్కడెక్కడ తిరిగాడో చెప్పాడు.

"సారీ...మీరు మూడ్స్‌లో లేనట్టున్నారు." అని మధుకర్ త్వరగా వెళ్ళిపోయాడు.

హంసతో కబుర్లు చెబుతుండగా కమల భర్త శ్రీపతి రావు వచ్చాడు. అతను చాలా విచారంగా కనిపించాడు.

"అయామ్ సారీ మాధవి! కమల తొందరపడుతుంది." అన్నాడు గిల్టీగా తల వంచుకుని.

"శ్రీపతిగారు! ఇప్పుడు హంస ముందు మాటలు వద్దుగాని, మీ పిలుపు బట్టి, మనసు చర్చించి, ఒక నిర్ణయానికి రావాలి." అన్నది.

"తప్పకుండాను. హంసా, ఇంట్లోకి వెళ్దాం రా." అన్నాడు.

"డాడీ! మీరు టీ త్రాగారా!"

"ఆఁ..." అతను అమాంతం కూతుర్ని ఎత్తుకుని ముద్దు పెట్టుకున్నాడు.

శ్రీపతిరావు ఏం చెప్పాడో గాని రెండు రోజులు ఏ గొడవా లేకుండా జరిగిపోయింది. మూడవ రోజు కమల దెబ్బలు, హంస ఆర్తనాదాలు వినిపించి, మాధవి తల్లడిల్లి పోయింది. ఫ్లాట్‌లో ఉంటే ఆమెతో దెబ్బలాడతానేమో నని భయం వేసింది.

వెంటనే కారు తీసుకుని వసంత్ రావు ఫ్లాట్‌కు వెళ్ళింది. అక్కడే భోజనం చేసి, ఆఫీసుకు వెళ్ళింది.

వసంతరావు అన్న మాటల్లో యెంత నిజం ఉందని ఆలోచించసాగింది.

"ఓ డియర్! ఆ అమ్మాయి కమల పెంపుడు కూతురని, ఆమె ఏం చేసినా, నీకు విపరీతంగానే కనిపిస్తుంది. ఇట్ ఈజ్ ఫ్యామిలీ ఇమాజనేటివ్ ట్రబుల్!" అన్నాడు.

నిజమేనేమో. స్వంత బిడ్డలను అమానుషంగా కొట్టిన తల్లి తండ్రులు యెందరు లేరు! వారి గురించి తను పట్టించుకుంటుందా! వసంత్ మాటలు నిజమే అనుకుని నిశ్చింతగా పని చేసుకుంది.

సాయంత్రం ఇంటికి వచ్చేసరికి డోర్ర్రులోకి కాళ్ళు ముడుచుకుని తలుపు ముందు కూర్చుంది హంస.

"హంసా!" ఆ అమ్మాయిని ముట్టుకున్న మాధవి షాక్ తిన్నది. వళ్ళు కాలిపోతుంది. యెదుటి గుమ్మం వంక చూచింది. దానికి తాళం కప్ప వేళ్ళాడుతోంది.

తన ఫ్లాట్ తలుపుతీసి, హంసనెత్తి తీసుకువచ్చి మంచంపై పడుకోబెట్టింది.

"హంసా...పాపా!" కుదిపింది.

"ఊఁ...అమ్మా ...ఆఁ..." మూల్గడం మొదలు పెట్టింది.

మాధవి భయపడింది. వెంటనే డాక్టర్ నాయక్ గుర్తుకు వచ్చాడు. అతనికి ఫోన్ చేసింది. అతను వచ్చి హంసకు సుంచెచ్చాడు.

"ఓ...ఈ పాప ఇక్కడ చేరిందా!" అన్నాడు.

"మీకు తెలుసా డాక్టర్?"

"తెలుసా! ఈ పాప విషయంలో దెబ్బలాడాను,

ప్రేమాభిమానాలు అంత విలువ లేనివా! నాల్గు రోజులు అలవాటయిన పిల్లలే కనిపించకపోతే ఏదో దిగులుగా, బాధగా ఉంటుంది. అలాంటిది పెంపుడు అంటూ తీసుకున్న పాపను అలా వదిలివేయటం అన్యాయం; అక్రమమని తెలియని వారిని ఏమంటారో మరి.

అతను మందులు తెచ్చి ఇచ్చాడు. ఆ రాత్రంతా గంట, గంటకు మందు వేస్తూనే ఉంది.

“మమ్మీ...నన్ను [illegible]. [illegible] కొట్టవద్దు మమ్మీ, నేను ఐస్‌క్రీమ్ తినలేను...వద్దు...వద్దు.” అంటూ కలవరిస్తూనే ఉంది. నాల్గుగంటలకు జ్వరం తగ్గింది. నిస్త్రాణంగా నిదురపోతుంది. హంస ప్రక్కనే పడుకుని నిదురపోయింది. మర్నాడు తొమ్మిది గంటలకు మెలుకువ వచ్చింది. ఉలిక్కిపడి లేచింది. జ్వరం తగ్గిన హంస ఎలీసాతో కబుర్లు చెబుతుంది.

“గుడ్ మార్నింగ్ ఆంటీ!”

“గుడ్ మార్నింగ్, నన్ను లేపొద్దా హంసా?”

“లేపాను, మీరు అటుతిరిగి పడుకున్నారు.” అన్నది.

మాధవి మొదట ఆఫీసుకు ఫోన్ చేసి తనకు ఒంట్లో బాగలేదు సెలవు కావాలని కోరింది. వాళ్ళు ఏమన్నారో నవ్వుతూ ఫోన్ పెట్టేసింది.

“హౌ ఆర్ యు డార్లింగ్!”

“ఫైన్ ఆంటీ! షల్ ఐ గెట్ ఎ కప్ ఆఫ్ టీ?”

“ఎలీ విల్ డూ. నువ్వు రెస్ట్ తీసుకో.” అన్నది. ఆమె

"అవును ఆంటీ! స్టోర్ రూమ్ పనిష్మెంటు రూమ్. నిన్న నా చేయి జారి కప్పు పగిలిపోయింది. పనికాగానే పనిష్మెంటు గదిలోకి వెళ్ళి రాత్రి వచ్చాను" అన్నది.

"మరి భోజనం?"

"నాకేం తెలియదు. పనిష్మెంటు అంటే ఎండాలి ఆంటీ, అప్పుడే బిక్క కుదురుతుంది." అని పక, పక నవ్వింది.

"ఏమిటా సిగ్గు, ఎగ్గు ఏం లేదా? ఏమిటా నవ్వులు." లోపలనుండి కర్ణకఠోరంగా వినిపించింది.

"నాకేం వర్రీ అవదు ఆంటీ, నువ్విన్నా పనిష్మెంటు అనగానే మారికేషు కొన్న బిస్కట్లు నాల్గు లోపలి జేబులో దాచుకున్నాను." అన్నది.

మాధవి అప్రతిభురాలయినట్టు నిలబడిపోయింది.

హంస వెళ్ళిపోయింది. రేపు ఆ పిల్ల దొంగ కావచ్చు, తిరుగుబోతు కావచ్చు, హంతకురాలు కావచ్చు, కష్టాలు కాలి నవ్వుకు కొందరు రాటు దేలితే, మరికొందరు మొరటు దేలుతారు.

భోజనానికి కూర్చున్నా, నిల్చున్నా హంస మాటలే గుర్తుకు వస్తున్నాయి. ఆమె అశాంతిగా గడపసాగింది.

రోజూ ఏదో గొల్లంతు వినిపిస్తుంది. ఒకరోజు పాలు ఒలికాయని, ఒకరోజు ఫ్లవర్ వాజ్ పగిలిపోయిందని, మరో రోజు పిల్లలను కొట్టారని, ఏదో ఒక గొడవ ఉంటుంది.

సంక్రాంతి రావు, మధుకి ఒక సెలవు ఇచ్చారు.

"మీరు ప్లాట్ మార్చండి. ఈ ప్రపంచంలో ఇలాంటి అన్యాయాలు చాలా జరుగుతుంటాయి. వాటికి ఏడుస్తూ ఎలా కూర్చుంటాము." అన్నారు.

మాధవికి ఆ నిముషం అదే ఉత్తమమైన మార్గం అనిపించింది. అందుకే ప్లాట్ మార్చుకుందామని అప్లికేషన్ పెట్టింది.

# 7

"విష్ణూ!"

"ఏమన్నయ్యా"

"ఆఖరుసారిగా చెబుతున్నాను. నీకు అమ్మాయిని మేము చూడాలా, నువ్వు చూచుకుంటావా?"

విష్ణు తల వంచుకున్నాడు.

"ఆవిడ నువ్వేదో ప్రవ్వి తలకెత్తుతావని ఎన్నో ఆశలు పెట్టుకుంది. ఉద్యోగం వద్దన్నావు. ఊరుకుంది. ఇప్పుడు ఇలా మొండిగా ప్రవర్తిస్తే ఏమనుకోవాలి."

"మీరు మరీనూ..." కాంతం అప్ప చెప్పబోయింది.

"ముందు నువ్వు నోరు మూస్తావా! అరవయి ఏళ్ళు వస్తుంటే ఎవరన్నా పనులు చేస్తుంటే సలహా ఇస్తారు. చిన్న

పిల్లలా ఆవిడే అన్నీ చేసుకోవాలంటే యెలా? బుద్ధీ జ్ఞానం ఉన్నాయా ?"

విష్ణు ఒక్కసారి తలయెత్తి మళ్ళీ దింపాడు. చంద్ర చర, చర బయటికి వెళ్ళిపోయాడు.

వర్షం వచ్చి వెలసినంత తెరిపి దొరికింది అందరికీ. చంద్ర ఇద్దరు కొడుకులు తేలికగా నిట్టూర్చారు.

"చూడు విష్ణూ, అత్తయ్యకోసం నువ్వు త్వరగా ఓ నిర్ణయానికి రావాలి నాయనా..." కాంతం చెప్పబోయింది.

"వదినా! అన్నింటికి ఆవిడ ఆరోగ్యం అడ్డు వేస్తారు. నా గురించి ఆలోచించరేం? 'నాకు వివాహేచ్ఛ లేదు.' అంటే నమ్మరేం ?" విసుక్కున్నాడు విష్ణు.

"యెందుకు ? యెందుకంట ! జవాబు చెప్పు."

"అన్నింటికి జవాబులుండవు."

"మా క్లాస్‌లో అన్ని ప్రశ్నలకు జవాబులుంటాయి చిన్నాన్నా!" అన్నాడు సురేష్.

కోపం, విసుగు మరిచిపోయి ఫక్కున నవ్వేశాడు విష్ణు.

"హాఁ! నీ క్లాసుడు విద్యకు సంబంధించిందిరా" అన్నాడు.

"విష్ణు! జీవితంలో కూడా అన్ని ప్రశ్నలకు జవాబులుంటాయి."

"ఆమె హాయిగా కాపురము చేసుకుంటుంటే నీకేం వొచ్చింది?" కాంతం అరిచింది.

దాపరికం లేకుండా అన్ని విషయాలు కాంతానికి చెబుతాడు విష్ణువర్ధన్.

"ఏమో! అసంతా నాకు తెలియదు" అన్నాడు రేకెట్ చూస్తూ.

కాంతానికి రెండిళ్ళు చూడటం బాధగానే ఉంది. యెప్పుడో ఒకరోజు అంటే ఫరవాలేదు. ఒక్కొక్కసారి అర్ధరాత్రి ఆమెకు ఆయాసం వస్తుంది. ప్రక్కింటినుండి తను వచ్చి సేవ చేయటం బాధగా, శాధ్యతగా ఉంటుంది. అని అనటానికి మొహమాటం. భర్త దగ్గర అంత చనువుకూడా లేదు.

"వదినా! యముడు ఏదో బెదిరిస్తున్నాడు. నాకు పెళ్ళి అక్కరలేదు. నేనే ఓ పనిమనిషిని వెతుక్కుంటానని చెప్పు" అన్నాడు.

"నువ్వే చెప్పుకో నాయనా!" విసురుగా ఆమె లోపలికి వెళ్ళిపోయింది.

అతనికి చర్రున కోపం వచ్చేసింది.

"ఇదిగో వదినా! నీలా బానిసగా యెవరూ రారు. ఆ వచ్చే అమ్మాయి నా భార్యగా వస్తుంది. వచ్చి మన నెత్తికి ఎక్కుతానంటుంది" అన్నాడు.

"............"

"మళ్ళీ అప్పుడు నేనేగా నలిగిపోయేది. మీకేం హాయిగానే ఉంటారు. ఒక్కమాటతో తీర్చేసుకుంటారు. అమ్మో! విష్ణు భార్యను నెత్తికి యెక్కించుకున్నాడని, నన్నాడి పోసుకుంటారు" అన్నాను.

"..............."

అతను ఒక నిముషం అటు, ఇటు పచార్లు చేశాడు.

"నాకు పూనాలో ఉద్యోగం వస్తే పోలేను - పోవా ల్సింది" అన్నాడు. ఒక్క నిముషం వంటింటి తలుపు పట్టుకుని ఆగి.

"..............."

"వాగి, వాగి నేనే ఊరుకుంటానని నీ ధీమా..."

"బాబాయ్! కొత్త నాటకం వేస్తున్నారా?" చిన్న వాడు అడిగాడు.

"వెధవ...వెధవా అని..." పళ్ళు కొరుకుతూ బయ టికి వెళ్ళాడు. అతని మనసు యెందుకో పదేపదే స్నేహను చూడాలని కోరుకున్నది.

అందుకే అతని కాళ్ళు స్నేహ యింటికి వెళ్ళాయి. అతని వెహికిల్‌కి ఆమె అడ్రసు తెలుసు అన్నట్టు, ఆమె ఇంటి ముందు ఆగింది. ఆమె పాలమ్‌లో బాబును కూర్చో బెట్టింది. ఇంటిముందు తిప్పుతూ తిరుగుతుంది.

"విష్ణు!" ఆశ్చర్యంగా, ఆనందంగా చూచింది.

అతను మాట్లాడక యీర్ష్యగా ఆమె కొడుకును చూచాడు.

"కబీర్. బాబును చూడు...రా విష్ణూ." పనివాడు రాగానే ఆమె ఇంట్లోకి దారితీసింది.

వెళ్ళి కూర్చున్నాడు ఆమె ఫ్రిజ్‌లోనుండి కూల్ డ్రింక్స్ తీసే ప్రయత్నం చేసింది.

"ప్లీజ్ స్నేహా! నాకిప్పుడేం వద్దు."

ఆమె గాఢంగా నిట్టూర్చింది.

"నా పరిస్థితి అంతా వివరించినా నీకు కోపం తగ్గ నట్టున్నది. నీవు మగాడిగా పుట్టావ్. అస్సలు నంతుడవు విష్ణు!" అన్నది. అలా అంటుంటే ఆమె కళ్ళు నీటితో నిండాయి.

"ఓ...సారీ స్నేహా!" అతను ఆమె కన్నీరు చూడ లేదు.

"నీకే నేను కబురు చేద్దామనుకుంటున్నాను విష్ణు." వచ్చి అతడు ఊహించని విధంగా అతని ప్రక్కన కూర్చుంది.

"ఏమిటి? యెందుకు స్నేహా! మీ వారు..."

"విష్ణు! ఆయన చల్లని స్నేహమే నిన్ను, నా గతాన్ని మరిపించింది. అదికాదు...కాదు...మన పాప... మన పాప బ్రతికే ఉందట" అన్నది. అలా అంటుంటే ఆమె ముఖం ఎర్రగా మారిపోయింది.

విష్ణు నిదానంగా కూర్చున్నాడు.

"అప్పుడు విష్ణు, పాప చనిపోయిందని అబద్ధం చెప్పారు. పాప బ్రతికే ఉందట. అక్కయ్యకు తెలిసిన వారికి పిల్లలు లేరని దత్తత యిచ్చారట."

"నిజం...నిజమా స్నేహా! ఎవరట వారు! నీ తీపి గుర్తుగా నా పాపను నేను పెంచుకుంటాను..." అతను ఉద్వేగంగా అన్నాడు.

"నాకు తెలిస్తే కదా!"

"సందేహించకు స్నేహా! నీ జీవితంలో పాప

ప్రమేయం లేకుండా పెంచుకుంటాను..." ఆమె భుజాలు పట్టి కుదిపాడు.

అతనిలోని ఆవేదన, ఆవేశం, ఆత్రుత యెంత ఉధృతంగా ఉన్నాయో అతను చెయ్యిపట్టిన తీరులో, భుజాలు నొక్కిన పద్ధతిలో అర్థం అయింది.

"విష్ణు! నీకంటే ఆత్రం నాకు వుంది. ఆ స్నేహితులు విదేశాలలో స్థిరపడ్డారట. అక్కయ్యను నిలదీస్తూ ఉత్తరం వ్రాస్తే, తనకేం తెలియదని, ఒక స్నేహితురాలికి తెలిసిన వారికిచ్చామని స్నేహితురాలి అడ్రసు యిచ్చింది. అది ఆరాతీస్తే ఆనిడ విదేశాలకు వెళ్ళిందట..." అన్నది కన్నీరు ఒత్తుకుని.

"ఓ..." అతను ఆమె భుజాలు వదిలేశాడు.

"అబ్బా..." అని భుజాలు వ్రాసుకున్నది.

"సారీ స్నేహా! ఆ అడ్రసు ఇలా ఇవ్వు" అని ఆమె ఇచ్చిన అడ్రసు తీసుకుని బయలుదేరాడు.

"విష్ణు! నా పరిస్థితి అర్థం చేసుకుని, నీ మనసులో ఏదయినా సందేహం ఉంటే తీర్చుకో కాని కోపం పెట్టుకోకు."

"నాకు కోపం ఏదయినా ఉంటే పరిస్థితులపై స్నేహా"

"అయితే నేనిచ్చింది ఏదీ వద్దంటావేం?"

"గతం మరచిపోవాలని. ఓ. కె. వెళ్ళి కాఫీ తీసుకురా."

"స్నేహా..." జగన్మోహన్ వచ్చాడు. అతను విష్ణుని చూచి యెవరు అన్నట్టు కళ్ళతోనే ప్రశ్నించాడు.

"నమస్తే..." విష్ణు లేచి నమస్కరించాడు.

"జగన్! విష్ణు అని చెబుతానే..." అని ఆగింది.

"ఐ సీ..." అతను నవ్వి, కరచాలనం చేశాడు. విష్ణు ప్రక్కనే కూర్చున్నాడు.

"ఏమిటి సర్, విశేషాలు?"

"ఏమున్నాయి? లేవటం వ్యవసాయం చూచుకోవటం, తిండి నిదుర..." విష్ణుకు ఇబ్బందిగా ఉంది. వాళ్ళు లోకాభిరామాయణం మాట్లాడుతుండగా, స్నేహ కాఫీ తెచ్చింది. కాఫీ త్రాగి బయటపడ్డాడు. ఆమె ఇచ్చిన అడ్రసుకు వెళ్ళాడు. అక్కడ ఇంటికి తాళం వేసి వుంది.

"ఈ ఇంటివారు?"

"తిరపతి వెళ్ళారండీ, వారం రోజులవుతుంది వచ్చే వరకు" అన్నారు.

వారం రోజులు ఆగటమా! విధి చిత్రంగా నాటకాలు ఆడుతుంది. అందించినట్లే అందించి, తీసుకుంటుంది. అతను నిరాశగా ఇల్లు చేరాడు.

"విష్ణూ! బాక్సీ తీసుకురావో, ముత్యాల అనే ఊళ్లో ఆ తాతకు మందు వేస్తారట. మీ అమ్మను వెంటనే తీసుకు వెళ్దాం" ఆదుర్దాగా ఎదురు వచ్చింది కాంతం.

"డాక్టర్ ఏమన్నాడు?"

"మందు, ఇంజక్షన్ రెండూ ఇచ్చాడు. లాభం లేదు."

"అక్కడికి వెళ్తే తగ్గుతుందని ఎవరు చెప్పారు వదినా!"

"వెళ్ళి బాగు చేసుకున్నవారు."

శాస్త్రవిజ్ఞానం ఇంతగా పెరిగినా, చిల్లర మందుల పైన, మంత్రాలపైన నమ్మకం తగ్గలేదు మనుష్యులకు — అనుకుని, వెళ్ళి టాక్సీ తీసుకుని వచ్చాడు.

కాగల కార్యం గంధర్వులే తీర్చారన్నట్లు, విష్ణువు ముత్యాలలోనే వారం రోజులుగడిచాయి. వారిచ్చే మందులు ఒక నెల వాడితేగాని గుణం కనిపించదట.

ఇంటికి వచ్చి కాంతాన్ని తీసుకువెళ్ళి తనెంత పొర పాటు చేశాడో అర్థం చేసుకున్నాడు.

చంద్రశేఖరం లుంగి ఎగగట్టి, పొయ్యిమీాది అన్నం కలుపుతున్నాడు. ఇద్దరు పిల్లలు ఉల్లిపాయలు, వంకాయలు తరుగుతున్నారు. రమేష్ నెత్తినిండా ఉల్లిపాయల పొట్టు ఉంది. వంటింటి నిండా గిన్నెలు పరచి ఉన్నాయి. చంద్ర శేఖరం బల్లంతా మాడర్న్ పెయింట్‌లా బూడిదతో నిండి ఉంది.

"అందర్నీ ఏడిపించే మీా అన్నయ్య ఏడుస్తున్నారు." అన్నది కాంతం విష్ణు వెనుకే వచ్చి నిలబడి.

విష్ణుకు నవ్వాగలేదు.

"నాన్నా! గాగుల్స్ పెట్టుకో, కళ్ళమ్మట నీళ్ళు కారవు" సలహా ఇచ్చాడు రమేష్.

"నోరుమూయ్యి. ఇలా వచ్చి అన్నం ఉడికిందేమో చూడు." అని ఇటు తిరిగి గుమ్మంలో నిల్చున్న వదినా మరు ధులను చూచాడు.

"మహారాణిగారికి ఇప్పుడు తీరిందా?" అన్నాడు, విష్ణు ఉన్నాడని కోపాన్ని మింగుతూ.

"ఇంకో వారం ఉండాలన్నారు. ఆమె ఒంటరిగా ఉండలేదు..."

"ఇదిగో! ఈ రోజు సాయంత్రం ఈ ప్రబుద్ధుడిని ఎక్కడికి వెళ్ళవద్దని చెప్పు. హైదరాబాద్‌నుండి శేషావతారం గారని వస్తున్నారు. వాళ్ళమ్మాయి గ్రాడ్యుయేటు. అన్నింటి కన్నా ముందు పని, పాటలు వచ్చినపిల్ల. వీడు చూచేదేమిటి నా ముఖం. అతనొక్కసారి చూస్తే చాలు ముహూర్తాలు పెట్టుకుంటాము." అన్నాడు చంద్రం.

"ఊం..." అన్నది.

"ఊం...అంటావేమే. ఈ పెళ్ళి జరిగితీరాలి. పిల్లలాట అనుకుంటున్నాడు వాడు" భార్యకు గరిట అప్పజెప్పి బయటకు వచ్చేశాడు.

పిల్లలు ఇద్దరూ ఒక్క దూకులో బయటకు వెళ్ళిపోయారు.

"వదినా! ఏమిటీ దౌర్జన్యం? ఏది కర్తవ్యం?"

"బుద్ధిగా ఆ శేషావతారం కూతురి మెడలో మూడు ముళ్ళు వెయ్యి" అన్నది, చేతులుకడుక్కొని గంజివార్చేస్తూ.

"సొంత భర్త అయితే మాత్రం ఇలా వెనుకేసుకు రావడం అన్యాయం, అక్రమము. అప్పీల్ యువర్ ఆనర్!" అన్నాడు.

"ఇది సుప్రీమ్‌కోర్టు జడ్జిమెంటు. నీ అప్పీలు విలువ లేనిది" అన్నదామె.

చంద్రం గురించి బాగా తెలుసు. అతను ఏదయినా పట్టించుకోడు. పట్టించుకున్నాడంటే అంతే సంగతులు. చిన్నప్పటినుండి యెరుగును.

ఇప్పుడేది దారి? పైగా అమ్మాయిని చూడక్కర లేదుట. ఎంత నిరంకుశత్వం. అతను పళ్ళు కొరుకుతూ ఇంట్లోకి వచ్చేసరికి కొత్త కంఠము ఖంగుమన్నది.

"నీ ప్రతిపాదన బావుందయ్యా. కాని మా అమ్మాయి బంగారు గుడ్లు పెట్టే బాతు. పెళ్ళిచేసి పంపించామనుకో, రేపు మన గతి!" అంటున్నాడు.

"అవీ వరస రంగనాయకమ్మగారూ! తల్లిదండ్రులం ఉన్నాము. రేపు ఒంటరిగా యెలా ఉంటుంది అమ్మాయి."

"ఒంటరిగా ఎందుకుంటుందే? అప్పచెల్లెండ్రు! అన్న తమ్ములు లేరా! దానికసలు వివాహేచ్ఛ లేదు చెల్లెమ్మా."

విష్ణు వెళ్ళి నమస్కరించాడు.

"మీరా పాపారావుగారూ! క్షేమంగా ఉన్నారా?"

"ఏదో ఇలా ఉన్నాము బాబూ! మా అమ్మాయి వస్తుందయ్యా నీకేం కావాలో చెప్పు, టేప్ రికార్డరా! టు-ఇన్-వన్..."

"నేను చేసే వ్యవసాయానికి అవన్నీ అక్కరలేదు" అన్నాడు విష్ణు.

"మీ వ్యక్తిత్వానికి సాటిలేదు...ఏదో అన్నారు..."

"గుడ్నైట్ చెన్నా! మా అమ్మ, మీరు ఇంతగా పొగిడిన మీ అమ్మాయిని చూడటానికి తప్పక వస్తాను" అన్నాడు.

"తప్పక రా బాబూ! నీ స్నేహితులలో మా కులం వాడెవడయినా ఉంటే చూడు బాబూ! అమ్మాయి చదువు కుంటే చాలు" అన్నది అతని భార్య అమాయకంగా.

ఆమె వేష భాషలు చూస్తే ముచ్చట వేసింది.

"అలాగేనండీ."

"మా నాయనే, నా ఆయుష్షు పోసుకుని బ్రతుకు తండ్రి" అన్నదామె.

"చ... చ... పిల్లలను స్వతంత్రంగా వదలాలి. అదిప్పుడు పెళ్ళి పెళ్ళంటూ పడ్చిందా!" అన్నాడు.

"పాపారావుగారూ! ఆ మాటే మా అమ్మతో చెప్పండి. గట్టిగా చెప్పండి" అన్నాడు.

"అదెలా చెబుతాను బాబూ! నాకు నల్గురు పిల్లలు. ఒక పిల్ల వివాహం కాకపోయినా పరవాలేదు. నువ్వు ఒక్క-డివి" అన్నాడాయన.

విష్ణు పళ్ళు కొరుక్కున్నాడు. ఒక్కరయినా, నల్గురయినా ఎవరి ఇండివిడ్యువాలిటీ వారిదని, ఎవరి జీవితం వారిదని తెలియని అమాయకులు.

వాళ్ళను సాగనంపి వచ్చాడు. మళ్ళీ తన కూతురిని గురించిన ఇన్ఫర్మేషన్ కోసం అతని హృదయం తహ, తహలాడింది. ఒకవేళ అడ్రసు దొరికినా వాళ్ళు తన పాపను ఇస్తారా! అనుభవం కంటే ఊహ, అందని దానికంటే అందీ

అంతక ఊరించేది ఎంతో మధురంగా ఉంటుందేమో! తన రక్తం పంచుకుని పుట్టిన బిడ్డను తన ప్రతిరూపాన్ని చూచుకోవాలని, తహ తహ లాడిపోయాడు.

మర్నాడు మరో పని పెట్టుకోకుండా నేరుగా అడ్రసు పట్టుకుని వెళ్ళాడు. ఆ అడ్రసుగల ఇంట్లో ఇప్పుడెవరో, రామచంద్ర అని వ్యాపారస్తుడు ఉంటున్నాడు. అతనే మూడు సంవత్సరాలనుండి ఉంటున్నాడట.

ఒక పని చెయ్యండి, పోస్టు ఆఫీసులో వారి అడ్రసు ఇచ్చారు. అక్కడకు వెళ్ళిరండి" అన్నాడు. అక్కడకు వెళ్ళి కనుక్కుంటే ఆ ఇంట్లో ఉండేవారు రామచంద్రాపురం టౌన్‌షిప్ అడ్రసుంది. "చిరంజీవి... క్వార్టర్ నంబరు" అంటూ ఉంది. అది చూడగానే అతనికి కొండెక్కినంత సంతోషం కల్గింది. ఆ వైపుకు తన వెహికిల్‌ను పరుగెత్తించాడు.

# 8

"మాధవీ! నీ హద్దుల్లో నువ్వుండు." దభీమని తలుపు వేసింది కమల, లోపలనుండి హంస ఆర్తనాదం వినిపించింది. మాధవి హృదయం గిల గిల లాడింది. ఇల్లు మారాలంటే వీలు కాలేదు. స్త్రీని అమృతమూర్తి అంటారు. ఇంత హాలాహలం ఉంటుందా!

"అబ్బ! నిన్ను చూడాలంటే భయంగా వుంది మాధవీ! మళ్ళీ ఏమొచ్చింది?" కాస్త విసుగ్గా అడిగాడు వసంతరావ్.

"నాకు పిచ్చి" అన్నది స్పష్టంగా.

"కోపం వచ్చింది" అన్నాడు.

"రా..." లోపలికెళ్ళి కూర్చున్నారు. అతను ఏదో చెప్పబోయేటంతలో తలుపు తీసుకుని హంస వచ్చింది. వెనుకే వచ్చిన కమల ఒక్కతోపు తోసి తలుపు వేసింది. హంస అరిచిన అరుపుకు వసంతరావు వెళ్ళాడు. నుదురు చిట్లి రక్తం కారుతుంది.

అతనికి కళ్ళు ఎర్రబడ్డాయి. తన కుర్చీలో కూర్చునే చూస్తుంది మాధవి.

అతను హంసను భుజాన వేసుకుని దబదబ తలుపు బాదాడు.

"ఏమిటి?" విసురుగా వచ్చింది కమల.

"ఈ దారుణం ఏమిటి?"

"ఇతరుల పనులు ఎప్పుడూ దారుణంగానే కనిపిస్తాయి. మీరు చేసే పనులు అందమైనవి కదూ." అన్నది కమల.

"పసి పిల్లనలా హింసించడం దారుణం కదూ!"

"పడుచువారు అలా విచ్చలవిడిగా తిరగటం అందం, చందం కదూ! అలా తిరక్కపోతే పెళ్ళి చేసుకోరాదు?" అన్నది వెటకారంగా.

"అమ్మాయిని డాక్టరుకు చూపించాలి. లేకపోతే నీకు

జవాబు చెప్పి వెళ్ళేవాడిని..." వసంతరావు తన కారు వైపు నడిచాడు.

"ఔనులే, పెళ్ళి చేసుకుంటే పెళ్ళాం పడి ఉండాలి. స్నేహితునితో తిరిగితే సహించే పాటి సహృదయత మీకేది..." ధన్‌మని తలుపు పడింది.

మాధవి వచ్చి వసంతరావు చేతిలోని తాళాలు తీసుకుని వెళ్ళి స్టీరింగ్ ముందు కూర్చుంది.

అయిదు నిమిషాల్లో కారు వెళ్ళి హాస్పత్రి ముందు ఆగింది.

హంసను తీసుకెళ్ళి పెట్టారు. ఇంజక్షన్ ఇచ్చాడు డాక్టరు. అరగంటకు కళ్ళు విప్పింది. పాలు ఇస్తే తాగింది.

"సాయంత్రం వరకు ఉంచి తీసుకువెళ్ళండి. మరేం ప్రమాదం లేదు." అన్నాడు.

"నువ్వెళ్ళు వసంత్! నేనుంటాను."

"ఏమయినా స్నాక్స్ ఉంటే తెస్తాను. షి ఈజ్ ఎ స్టుపిడ్ లేడీ. ఆ పిల్ల యెంత ముద్దుగా ఉంది. కొట్టటానికి చేతులెలా వచ్చాయో నాకర్థం కావటం లేదు" అన్నాడు.

"ఒక్కనాడు చూచి అలా అంటున్నావు. ప్రతిరోజూ చూస్తూ ఆ నరకం యెలా భరిస్తున్నానో మీరు ఆలోచించరేం?"

"అయామ్ సారీ మధూ!"

"అయి టూ ఫీల్ సారీ..." శ్రీపతిరావు వచ్చాడు.

"డాడీ..." హంస కళ్ళు మిల, మిల లాడేయి.

"హంసా..." అతను వంగి ఆ పిల్ల నుదురు ముద్దు పెట్టుకున్నాడు. వాళ్ళు ముగ్గురూ గంభీరంగా కూర్చున్నారు. నర్స్ వచ్చి పాపకు మాత్ర ఇచ్చి వెళ్ళిపోయింది. ఆ పసి పిల్ల గాఢనుషుప్తిలోకి జారిపోయాక, ఆమె అంతరంగంగా దాగిన భయాలు బయటపడ్డాయి.

"మమ్మీ ...వద్దు... ఆంటీ అలా చెప్పలేదు మమ్మీ... ఆంటీ మంచిది... కాదు చాలా చెడ్డది... నాకేం తెలియదు..." ఇదే వరస. శ్రీపతిరావు ముఖం వెల వేసిన తెల్ల గోడలా అయ్యింది. ఏమీటూ నిర్ణయించు కోలేకపోయాడు.

అతడిని నిందిస్తే ఇంకా బాధపెట్టానుకోలేదు.

"రావుగారూ! హంస నా దగ్గర ఉంటుంది. ఆ అమ్మాయిని మీకిప్పించాను. అందుకేనేమో నేనొక్క నిముషం శాంతిగా ఉండలేకపోతున్నాను. ఆ పిల్లకు అమ్మమ్మ, తాతలు ఉన్నారు. పెంచుకుంటారేమో..." అన్నది మాధవి.

"మాధవి గారూ! నేను హంసని నా మొదటి బిడ్డలా చూచాను." అన్నాడు గాద్గదికంగా.

"మాడండి శ్రీపతిరావుగారూ! జరుగుతున్నదంతా చూస్తుంటే నాకు భయంగా ఉన్నది. మీరు మూర్ఖత్వంతో హంసను చంపిన వారవుతారు..."

"అది కాదండి..."

"మీ అసహాయతను అర్థం చేసుకుంటాను. ఒక

వారు, మీరేం చేయలేరు. హంసకేదన్నా జరిగితే జీవితాంతం నేను బాధపడాలి." అన్నది.

అతనో నిట్టూర్పు వదిలాడు.

హంసను ఇంటికి తెచ్చిన తరువాత ఆ అమ్మాయి తన ఇంటికి వెళ్తానంటుంది.

"చూడు హంసా! మీ మమ్మీకి కోపంగా ఉంది. వారం రోజులయిన తరువాత వెళ్దువుగాని." అన్నది మాధవి.

"ఓ కె ఆంటీ..." అన్నది.

మాధవికి తెలిసిన రిటైర్డ్ దంపతులు ప్రయివేటుగా బడిలాంటిది పెట్టారు. వారి దగ్గర హంసను చేర్పించింది. వారంరోజులు యాంత్రికంగా జరిగిపోయాయి.

ఆ రోజు శుక్రవారం, సర్దూర్ సింగ్ అనే సూపర్ వైజర్ ఇంట్లో పుట్టినరోజు పండుగ. వాళ్ళ పాపకు రెండేళ్ళు. మాధవి ఆ పాపకు అందమైన బొమ్మల సెట్టు కొని, హంసకు తెల్ల లేసు గౌను కొని వచ్చేసింది.

"హంసా!" రోజులా పిలిచింది.

"ఆంటీ..." అంటూ పరుగున వచ్చే హంస కనిపించలేదు. మాధవి కంగారుపడుతూ కారులోని సామాన్లు తీస్తుండగా ఎలిషా వచ్చి పాకెట్లు అందుకున్నది.

"హంస..." అనుమానంగా చూచింది. వారం రోజులయిందని ఇంటికి వెళ్ళిపోయినా పోతుంది.

"యెందుకో మూాఢిగా కూర్చుంది మేడమ్!" ఎలీషా అన్నది.

"అవతలి ఫ్లాట్‌లోకి వెళ్ళిందా ?"

"నేను చూడలేదు. బట్టలు ఉతుకుతూ కూర్చు న్నాను."

"ఐసీ..." మాధవి లోపలికి వచ్చి, తిన్నగా పడక గదిలోకి వెళ్ళింది.

"హంసా!"

తలెత్తింది హంస, ఆ అమ్మాయి మంచం మధ్యగా చెక్కట చేయి చేర్చి సర్వం పోగొట్టుకున్నట్లు కూర్చుంది. తలయెత్తింది గాని ఆ చూపులు యెప్పటిలా ఆప్యాయతను కురిపించేవిగా లేవు. ఏహ్యతను కురిపిస్తున్నాయి. విషయాలు పరిశోధించినట్టున్నాయి.

"హంసా!"

"నో...సీతో మాట్లాడను పో..." అన్నది అటు తిరిగి.

"ఏం జరిగింది హంసా?"

"నువ్వే... నువ్వే మా మమ్మీనని యెందుకు చెప్పలేదు?"

"హంసా!" తలపై పిడుగు పడింది. యెంత అభాండం?

"యెవరు...యెవరు చెప్పారు హంసా?"

"మమ్మీ చెప్పింది. నువ్వు... నువ్వు నన్నక్కడ వదిలేసి వస్తే పెంచిందట_ ఇక పెంచటం తనకు చేత కాదట" అన్నది.

"అలా అన్నదా!" కోపంగా బయటికి వచ్చింది మాధవి. కమలను పట్టి నాలుగు దులపాలనుకుంది. కాని వెంటనే విచక్షణ మేలుకున్నది. తమ గొడవలు తెలియని అమాయకురాలు ఆ పసిపిల్ల, ఇదంతా విని ఏమయినా అఘాయిత్యం తలపెడితే?

మమ్మీ వెనక్కు వచ్చింది. హంస మంచం దిగి మాధవిని గమనిస్తుంది.

"సారీ హంసా! అయామ్ వెరీ సారీ... కమలకు పిల్లలు లేరని అడిగి తీసుకుంది." అన్నది, తనదేం తప్పు లేదన్నట్టు.

"ఊఁ, అలా అడిగితే ఇచ్చేస్తారా!"

"సారీ అన్నానుగా హంసా..." అన్నది, చేతులు చాపి. హంస వచ్చి మాధవి చేతులలో వాలిపోయింది.

"ఎక్స్‌క్యూజ్ మీ హంసా..." అన్నది. నుదురు ముద్దు పెట్టుకొని. ఆమెకు హంసను ఆ ఇంటికి పంపకుండా ఆపాలంటే కష్టంగా ఉండేది.

కాగల కార్యం గంధర్వులే తీర్చినట్టు అనిపించింది.

తను తీసుకు వెళ్ళి ప్రేమకు అప్పగిస్తుంది. అప్పుడు పరువుకోసం వదులుకున్నా, బంగారు తల్లిని చూశాక కాదంటారా!

"మమ్మీ...మమ్మీ డాడి యెక్కడ?"

"డాడియా!" కొత్త సంబోధనకు, కొత్త ప్రశ్నకు తెల్లబోయింది. తేరుకోవటానికి ఒక్క నిముషం పట్టింది.

"నాకు తెలుసు! నిన్ను మోసం చేశాడు..."

"హంసా!"

పసిపిల్లతో ఇంత పెద్ద పరిహాసమా?

"మాట్లాడవేం మమ్మీ?"

"ఆఁ...మోసమూ, లేదమ్మా! ఆయన...ఆయన... భారత దేశంలో ఉన్నారు." అన్నది తనకంతా తెలుసు అన్న ధోరణిలో మాట్లాడుతున్న హంసతో.

"నిజం?...ఊహు! కాదు. అందరి మమ్మీ, డాడి కలసివచ్చారు." అన్నది. నువ్వు ఒంటరిగా వచ్చావు అన్న ధోరణిలో.

"ఓ...హంసా! మా ఇద్దరికి పోట్లాట వచ్చిందమ్మా, ఇక వెళ్దాం." అన్నది తడబడుతూ.

"ఓ...కె మమ్మీ..." వచ్చి మాధవి మెడకు చేతులు వేసి గారాలు పోతూ నవ్వింది.

మాధవి ఆలోచిస్తూ కూర్చుండిపోయింది. బర్త్‌డే

పార్టీ సంగతే మరచిపోయింది. ఫోన్ రాగానే హంస వెళ్ళి అందుకుని మాట్లాడింది.

"వెయిట్...ఆంటీ...సాకే మమ్మీ! బాసీ ఆంటీ." అన్నది.

"పింకీ బర్త్ డే ఉంది కదూ! పది నిముషాల్లో వస్తున్నామని చెప్పు" అన్నది.

హంస చిలుకలా చెప్పి ఫోన్ పెట్టేసింది.

మాధవి హంసను తయారుచేసింది. గిఫ్ట్ చేతికిచ్చింది.

"అక్కడ వసపిట్టలా వాగకూడదు." అన్నది. మనిషికి మనసులోని శాంతి కూడా అందాన్ని కలుగజేస్తుందేమో, హంస కల, కలలాడి పోయింది. తెల్లని గౌనులో శాంతిదూతలా, అందాల కపోతంలా ఉంది.

ఇద్దరూ సరూప్ సింగ్ ఇంటికి చేరారు. అప్పటికే పిల్లలతో, పెద్దలతో ఇల్లు కల, కలలాడి పోతుంది.

"రా మాధవీ..." అంటూ మిసెస్ సింగ్ శాసీ ఆహ్వానించింది.

"ఈ పాప యెవరు?" పరిచయస్తులు ఇద్దరు ముగ్గురు అడిగారు.

"మా పాపే..." అన్నది. మాధవి ఆ విషయాన్ని ప్రాముఖ్యం ఇవ్వనట్టు.

"అయామ్ ద డాటర్ ఆఫ్ మాధవి." అన్నది హంస.

ఎంత ఘాటు ప్రేమయో!

"ఊఁ, ఏమైనా ఏదయితేనేం చాలా ఉంది ప్లీజ్." అన్నారు.

"రియల్లీ స్వీట్..." అని ఒకతను ముద్దు పెట్టుకున్నాడు.

అందరూ పాట గొడవలో పడిపోయారు.

వసంతరావు మెల్లగా మాధవి ప్రక్కన చేరాడు.

"మధూ! ఐ కాంట్ లివ్ అలోన్ నా! నేనింకా త్రాగి పతనమయితే దానికి కారణం నీవే" అన్నాడు.

"ఇలాంటి ప్రస్తావన తేవటానికి సమయము, సందర్భము...?"

"ఒంటరిగా ఉంటే నీకు దూరంగా ఉండి మాట్లాడలేను డార్లింగ్! నేనంటే ఇష్టం లేదంటే చెప్పు." అన్నాడు.

అతని మాటలోని నిజాయితీకి కరిగిపోయింది. మనిషి త్రాగినా, తనవాడన్న భావన అద్భుతంగా ఉంటుంది. మధుకర్ మాటలకు ముగ్ధురాలయినా, అతని పద్ధతులు నచ్చవు. పమిట తాకితే చాలు పరవశించిపోతాడు. అది తను భరించలేదు.

"మాట్లాడు మధూ!"

"త్రాగుడు మానేస్తానని వాగ్దానం చెయ్యాలి మరి."

"మన్నించే బాధ్యత మీది" అన్నాడు ఆరాధనాపూర్వకంగా చూస్తూ. అప్పుడే అక్కడికి ఎవరో వచ్చారు.

"ఇక్కడకూడా రహస్యాలేనా..." అంటూ.

"ఏమో, రేపు కలుస్తాముగా వసంత్..." అని పార్టీలో చేరిపోయింది.

ఆ రాత్రి ఇంటికి వచ్చేసరికి ఆడి, అలిసిన హంస నిదురపోయింది.

ఆమెను పడుకోబెట్టి, బట్టలు మార్చుకుని వచ్చి, తల దగ్గర పెట్టిన ఉత్తరాలు చూసుకుంది. చిరపరిచితమైన దస్తూరి చూడగానే అన్నీ మరచి ఉత్తరం విప్పింది.

"పాపా!

మీ నాన్న రోజుకు రోజు మారిపోతున్నారమ్మా. అతని లోకమంతా చిరంజీవే. నేనలా మీ నాన్న గురించి నీకు రాయటం విడ్డూరంగా ఉంటుంది. ప్రతి నెలా డబ్బు పంపుతున్నావు. బిల్డింగు కట్టుకుంటున్నారు. జల్సాగా తిరుగుతున్నారే తప్ప నీకు సంబంధం చూడడం లేదు. నేను ఎన్నాళ్ళుంటాను! ఒంటరిగా ఈ ప్రపంచంలో ఉండలేవు తల్లీ. నా మాట విని వచ్చేయి. సరస్వతి కొడుకు విదేశాల నుండి వస్తున్నాడు. అది అమ్మ చాదస్తం అనుకుంటే నువ్వు మెచ్చినవాడు, నచ్చిన వాడినే వివాహం చేసుకో. నువ్వు ఒక యింటి దానవయితే చూడాలని ఉంది. చిట్టి, చిన్న ఇద్దరూ కులాసే. చిట్టి కొడుకునుచూస్తే నాకు నువ్వే గుర్తుకు వస్తావు. ఆరోగ్యం జాగ్రత్త!

ఇట్లు,

అమ్మ.

వసంతరావు చేసిన ప్రతిపాదనను తల్లి బలపరుస్తుంది. నిజంగా ఒంటరిగా ఉండడం బోరుగా ఉందనిపించింది. ఒక నిముషం ఆలోచించింది. వెంటనే లేచి వసంతరావుకు ఫోన్ చేసింది.

"హలో వసూ ! సుధా ... వ్వాటే సర్‌ప్రైజ్!"

"నాకు ఆశ్చర్యంగానే ఉంది. నువ్వింకా మూడ్‌లో లేవేమిటా అని..." అన్నది నవ్వుతూ.

"ఓ డియర్! నా గురించి నువ్వు ఆలోచిస్తానంటేనే నేనెంతో పొంగిపోయి, నీతో గడుపబోయే జీవితాన్ని చిత్రించుకుంటున్నాను" అన్నాడు.

"నేను కాదంటే"

"అనవని తెలుసు డియర్. నీ అంగీకారం తెలుపటానికే ఫోన్ చేశావు"

"హేట్స్ ఆఫ్ టు యువర్ ఇమాజినేషన్? ఒక్క విషయం వసంత్!"

"చెప్పండి మేడమ్..."

"నా దగ్గర పెద్దగా డబ్బులేదు. అదనంగా హంస బాధ్యత ఒకటి వచ్చి పడింది..."

"ఓహో! నా దగ్గర బోలెడు డబ్బుంది. నిన్ను డబ్బు కొరకు పెళ్ళాడుతున్నాననుకుంటే, నువ్వు ఫూల్‌వి. ఇంకే బాధ్యతలున్నా నీతో పాటు నేను స్వీకరిస్తాను. గుడ్ నైట్, స్వీట్ డ్రీమ్స్..."

"నేమ్ టు యు...అవునూ రిజిష్టర్ మేరేజి చాలు"

"నువ్వు దండలు మార్చుకుందామన్నా నా కభ్యంతరము లేదు."

"థాంక్యూ..." ఫోన్ పెట్టేసి నిశ్చింతగా, బల్ల ముందు కూర్చుని తల్లికి ఉత్తరం వ్రాయటానికి ఉపక్రమించింది.

9

రామచంద్రాపురం చుట్టుప్రక్కల వ్యవసాయదారులకు వ్యవసాయం చేయటం ఓ పెద్ద తలనొప్పిగా తయారయింది. చుట్టూ పరిశ్రమలు వెలిశాయి. ఏ ఫ్యాక్టరీలో చేరినా దణ్ణం డబ్బు. వ్యవసాయదారునికి అంతంత డబ్బిచ్చి కూలీలను పెట్టుకునే స్తోమతు లేదు. అందుకే విష్ణు వ్యవసాయం కొంకెక్కింది. ఆ ప్రక్కనే పడిన వ్యవసాయక పరిశోధనా కేంద్రంలో ఉద్యోగం సంపాదించుకుని, తన పొలం కౌలుకిచ్చాడు. నెల రోజులుగా తల్లికి ఏ అనారోగ్యము లేదు. తేలికగా నిట్టూర్చాడు.

సాయంత్రం ఆఫీసునుండివచ్చి, టీ చేసుకుని త్రాగుతూ,

ఇంటిముందు విరగబూసిన గడ్డిపూలను చూస్తున్నాడు. రమేష్ వచ్చాడు.

"శాబాష్! యమభటుడిని వచ్చితిని! నువ్వే చచ్చితివా!" అన్నాడు.

"యమధర్మరాజు ఏమాజ్ఞాపించెను పుత్రా!"

"సజీవముగా తోడుకురమ్మని. . ."

"నా ప్రాణములా. . ."

"ఏమిట్రా ఆ కారుకూతలు" రంగనాయకమ్మ విసుక్కుంది.

"నాయనమ్మా! యమభటుణ్ని అవమానించినందుకు అంతకంతా అనుభవించక పోవు. పదండి శాబాయి. లెఫ్ట్, రైట్" రమేష్ నడిచాడు.

"అది కాదురా! మీనాన్న కోపంగా ఉన్నాడా?"

"అమ్మో! ఉత్తకోపమా! నిప్పులు కక్కుతున్నాడంటే నమ్ము"

"సరే...పద..." సంభాషణ యెలా మొదలు పెట్టాలో పదిసార్లు రిహార్సల్స్ వేసుకున్నాడు.

అతను వెళ్ళేసరికి చంద్రం కూర్చుని లెక్కలు వ్రాసుకుంటున్నాడు.

"అన్నయ్యా!...నాకు...నాకు...నాకు..."

చంద్రం తలెత్తి చూచాడు. విష్ణు మాటలు నోట్లోనే ఆగి పోయాయి.

"ఏమిట్రా...నాకు...నాకు అంటావ్. నీకు పిచ్చా?"

యెంత ప్రయత్నించినా గొంతు పెగిలి మాట బయటికి రాలేదు. చంద్రం మాట మెత్తగా ఉన్నా, ఆ కళ్ళలోని జీరలు, అతని వాలకం తనెరగనిది కాదు.

"వినిపించలేదా? పిచ్చా అని అడుగుతున్నాను."

"అబ్బ! ఏమ్మాటలండీ. నోటికి యెంత మాట వస్తే అంతేనా!" కాంతం ధైర్యం చేసి అన్నది.

"అమ్మా, కాంతమ్మా! నా నోరు కొవ్వలేదు. వాడే ఆ శేషావతారంతో దారిలో కలిసి, 'ఆ విష్ణు ఉత్త రాడీ! ఆడపిల్లల వెంట తిరిగి వదిలి వేస్తాడ'ని చెప్పాడట. అంతే కాదు 'ఆ కుర్రాడికి కాస్త పిచ్చి. ఈ కాలంలో ఇంత భూవసతి వుండి, అగ్రికల్చరు బి. ఎస్సీ. చదివినవాడికి యెవరూ పిల్లనివ్వరా. అన్నగారు ఆడపిల్లల వేటలో తిరుగుతున్నాడంటే యెంత అవమానమో చూడండీ...' అంటూ అడ్డమైన కూతలు కూశాడట" అన్నాడు.

"అవునా విష్ణు ?"

"ఏమిటే? ఏమిటి నీ ఉద్దేశ్యం? నేను అబద్ధం చెబుతున్నాననా? ఆ శేషావతారంగారు ఈ ప్రబుద్ధుడే విష్ణు అని తెలియక అడ్రసు అడిగితే వీడు చేసిన నిర్వాహకం ఇది. అతను యెన్ని నిందలు, నిష్ఠూరాలు వేసాడని. 'నాకు నిజం చెబితే మంచిది. నీకు అమ్మాయిలు లేరని, మా అమ్మాయి

గొంతు కోస్తావుటయ్యా!' అంటూ నిలదీస్తే ముఖం యెత్తుకుని తిరగలేక పోయానే." అన్నాడు కోపంగా.

"ఛ...ఛ...అదేమిటి విష్ణు! ఇష్టం లేకపోతే నీ మెడను బిగించి పెళ్ళి చేస్తామా!" అన్నది కాంతం.

"ఇక వాడి కర్మ! మనకు వాడితో ఎలాంటి సంబంధ బాంధవ్యాలు వద్దు. ఆవిడ పెంచింది. అందుకే ఆమెకు సేవ చెయ్యటం మన బాధ్యత అర్థం అయిందా?"

తలాడించింది కాంతం.

"తలాడించటం కాదు, కచ్చితంగా అమలు జరపాలి. దీనికి విరుద్ధంగా జరిగితే మొఖట నీ తల పగులుతుంది. 'ఏమయ్యా' అంటూ పెళ్ళి ప్రస్తావన తెచ్చావో పళ్ళు రాల్తాయి."

యెవ్వరూ మాట్లాడలేదు.

చంద్ర చర, చర బయటికి వెళ్ళిపోయాడు. కాంతం మౌనంగా తన పన్లు చేసుకు పోతుంది.

"నాన్నారు చాలా కోపంగా వున్నారు. రేపటికి మరిచిపోతారు బాబాయ్." ఓదార్చాడు సురేష్.

"బాబాయ్! మరిచిపోయే కోపం కాదు. రాముడు ఇక్రిసయిట్‌లో ఉద్యోగం చేస్తున్నాడు. మన చేను ఎండి పోయింది. ఆ కోపం కూడా కలిసింది." అన్నాడు, తనకు చాలా తెలుసు అన్నట్టు.

"రాముడు వెళ్ళిపోయాడా వదినా?"

వెళ్ళి వంటింటి తలుపు పట్టుకుని నిల్చున్నాడు. నేనంత పనికిరాని వాడిని అయ్యానా అన్నట్టు చూచాడు.

"వదినా! నేనంత కాని పని ఏం చేశాను?"

"మీ అన్నయ్య పరువుతో ఆడుకున్నావు" అన్నది తీక్షణంగా.

"వదినా! దురుద్దేశంతో కాదు. అతను మళ్ళీ మన జోలికి రాడన్న ధీమాతో అలా అన్నాను. నన్ను నమ్ము" అన్నాడు.

"నిన్ను నమ్మినా, మానినా, నేనుపత్తోట్ల వంకాయను! ఆయన చెప్పింది చేస్తాను." అన్నది.

"సరే! ముప్పై ఏళ్ళు దాటుతున్న మగాడిని, నన్ను నాకు మెడలు వంచి పెళ్ళి చేస్తాననటం న్యాయంగా ఉందా! దాన్ని తప్పించుకున్నందుకేగా ఇన్ని మాటలంటుంది, అనండి." అనుకుంటూ రోషంగా వెళ్ళిపోయాడు.

విష్ణుకు చాలా కోపం వచ్చింది. కాంతం, పిల్లలు రావటం మానేశారు. ఫ్యామిలీ డాక్టరులా చంద్ర రోజుకు ఒకటి, రెండు సార్లు వచ్చి "పిన్ని! మీ ఆరోగ్యం ఎలా ఉంది?" అని అడుగుతాడు.

తనకేనా అభిమానం లేనిది! పిల్లలు కూడా తండ్రి

మాట జవదాటరు. రెండు నెలల తరువాత, రెండు నెలల. జీతం వచ్చింది. తల్లికి చీర, మిఠాయి కొనుక్కుని వస్తున్నాడు

సురేష్ ఎరువు సంచి మోత్తుకుని వెళ్తూ కనిపించాడు.

"ఎరువు కొడుతున్నా మేమిట్రా!"

"మా పొలంలోకే." అన్నాడు ముక్తసరిగా.

"పొగరు...పొగరు..." అనుకున్నాడు. ఆరోజే తన కొల్లీగ్స్‌కు పార్టీ ఇచ్చాడు.

మర్నాడు ఆలస్యంగా వస్తానని చెప్పాడు. మెల్లగా లేచి ముఖం అది కడుక్కుని, తల్లికి కావల్సిన సరుకులు తెచ్చి ఇచ్చి, ఆఫీసుకు బయలు దేరాడు. తను ఆఫీసు మేనేజరు రమేష్‌ను ఎడా, పెడా వాయిస్తూ కనిపించాడు.

"అదేమిటి సర్...వాడేమన్నాడు?" అతని చేతిలో చిక్కిన రమేష్‌ను విడిపించాడు.

"వెధవ! అదిగో ఆ ఫెన్సింగ్ పైనుండి ఆవులను దూకించి, మొక్కలు మేపాడు."

"వాడు మా అన్న కొడుకు. విషయం ఏమిటో నేను కనుక్కుంటానుగా." మేనేజర్ వదిలేశాడు.

తనే రెండు ఫెడీ, ఫెడీమని వాయించేశాడు.

"బడి వదిలేసి నువ్వు చేస్తున్న నిర్వాహక మిదట్రా. బుద్ధిలేదు! అందరినీ చూపులతోనే కాల్చే మీ అయ్య, మిమ్మల్ని వదిలేశాడా!" చెవి పట్టి లాగాడు.

గజ, గజ వణికిపోలేదు. చెవి దులపరించుకుని బయటికి వచ్చేసాడు.

"ఏమిట్రా ఆ పొగరు."

"బాబాయ్! నాన్నె నన్ను చదువు మానిపించేశాడు."

"ఏమిట్రా...ఏమన్నావ్?"

"అవును బాబాయ్! ఈసారి మా పంటలు పోయాయిగా. అన్నయ్యకూడా యెక్కడో పని చేస్తున్నాడు. రోజుకు ఆరు రూపాయలు ఇస్తారు." అన్నాడు.

విష్ణు కడుపులో చెయ్యి పెట్టి కలియ బెట్టినట్టు అయింది.

"అన్న...మీ అన్న...పని చేస్తున్నాడా! కాని ఆ విషయాలు నాకు తెలియవు. అవునా?"

వాడు బిక్క మొహం వేశాడు. వాడిని మోటార్ బైక్ ఎక్కించుకుని వచ్చి, ఇంటిముందు దింపాడు.

"వదినా...ఓ వదినా..." గట్టిగా అరిచాడు.

అతని అరుపులకు భార్యా భర్త లిద్దరూ బయటికి వచ్చారు.

"ఏమిటి!" కాంతం కొడుకును, మరిదిని మార్చి, మార్చి చూచింది.

"విష్ణు అన్న మనిషి బ్రతికి ఉన్నాడని మీ ఆయనకు తెలుసా?"

"ఇక్కడెవరు చెవిటివారూ లేరని, చెప్పేది మనిషిలా చెప్పొచ్చునని మీ మరిదితో చెప్పవే."

"ఇదిగో వదినా! ఇన్నాళ్ళు ఆయన నిరంకుశత్వం సాగింది. ఇక సాగదని చెప్పాదినా."

"సాగుతుందని నేనేం సంబరపడి పోవటం లేదు. సంపాదనా పరుడు, స్వతంత్రుడన్న సంగతి అర్థం అయిందని చెప్పవే."

"సంపాదించి, నా బొంద కా! పిల్లలు బడులు ఎందుకు మానారో అడగండి."

"నా పిల్లలు నా ఇష్టం, చదివిస్తాను, చదువు మాన్పిస్తాను."

"నీ పిల్లలు...తండ్రిగా, రక్తం పంచినందుకా మాట అంటావేమో, వాళ్ళను యెత్తి, నా గుండెలపై వేసుకుని పెంచింది నేను!"

"ఆహా? తమర్ని నేను అలాగే పెంచాను."

ఇద్దరూ వాదించుకుంటుండగానే రమేష్ వెళ్ళి రంగ నాయకమ్మను తీసుకుని వచ్చాడు.

"ఏమిట్రా! మీరింట్లో మాట్లాడుతున్నా మీ గొంతులు ఊరంతా ప్రతి ధ్వనిస్తున్నాయి" అన్నదామె.

"చూడమ్మా! ఈ ఏడు పంటలు పోడయి పోయాయి. నేను చచ్చిపోయానా! పిల్లలను బడి మానిపించేడు." అన్నాడు విష్ణు.

"ఛ...ఏం మాటలయ్యా అవి." కాంతం కసిరింది.

"మీరంతా చేతల వాళ్ళు వదినా..." అన్నాడు కోపంగా.

"చంద్రం, ఏమిట్రా ఇది?"

"ఛిన్నా! వాడిని ఏ అధికారంతో సహాయం అడగాలి. బంధువులంతా అనే మాటలు విని నిబ్బరంగా ఉన్నానంటే నాది రాతిగుండె. వాడికి పెళ్ళి అయితే నా ఆటలు సాగవుట. అందుకే నా భార్యను...ఛీ...ఛీ... ఆ మాటలు మళ్ళీ అంటే పాపం." అన్నాడు.

"అన్నయ్యా..." విష్ణు అప్రతిభుడే అయ్యాడు!

"అవున్రా! ఈ సంఘము మన సాంఘిక జీవితానికి అరకోశము. మనకు మనముగా యెంతో స్వతంత్రంగా బ్రతుకాలనుకుంటాము, కాని బ్రతుక నివ్వదురా." అన్నాడు. చంద్రం నోట అంత సామ్యంగా ఏనాడు మాటరాదు. ఈనాడు వచ్చిందంటే అది ఆయన బాధకు నిదర్శనము.

"అన్నయ్యా! నాకు...నాకు ఇంత దారుణమైన నిందలు వస్తాయని తెలియదు. ప్లీజ్ ! మీరు చూచిన అమ్మాయికి మూడు ముళ్ళు వేస్తాను. ఆ అమ్మాయి రామావతారం కూతురు కాని, శేషావతారం మేనకోడలు కాని నాకేం అభ్యంతరం లేదు."

"విష్ణూ! ఏమిటి పసిపిల్లడిలా!"

"చాముండి వదినా. నేనే పసిపిల్లడినా! పంతాలతో పట్టింపులతో మీరే పసిపిల్లల భవిష్యత్తు నాశనం చేయాలని చూచారు." అన్నాడు.

"నిజమే చంద్రం, మీ పంతాలకు పట్టింపులకు పిల్లలను అడ్డువేయకండి. చిన్నాడి పిల్లలను చూచే యోగ

ముందో, లేదో, నా ఈ నగలు యెందుకు చెప్పు! తీసుకెళ్ళి పిల్లలను చదివించు." అన్నదామె.

"నాకొచ్చేదాంట్లో పిల్లలను చదివించగలను. చెప్పు వదినా, నా పెళ్ళి యెలాగయితే ఆయన చేతిలో పెట్టానో, పిల్లల చదువు బాధ్యత నాది. అతనికేం హక్కు లేదు." అన్నాడు కోపంగా.

"బావుందిరా. మీ ఇద్దరి మధ్య అది చెప్పటం దేనికి." రంగనాయకమ్మ ముచ్చటగా నవ్వుకుంది.

"మీరు మళ్ళీ బడి మానేసి, తిరుగుతూ కనిపించండి. తాటవలిచేస్తాను." అని ఇద్దరి పిల్లల చెవులు పిండాడు.

"నన్ను పనిలోనుండి తీసేశారు బాబాయ్..." అని చెప్పబోయిన సురేష్ మాట మింగేశాడు.

"పనిట పని! గొప్పపని చేశారు. పదండి." అని పిల్లలను తీసుకెళ్ళి, ఫీజులు కట్టి, మళ్ళీ బడిలో చేర్పించి వస్తూ ఒక్క నిముషం ఆగాడు. అంతా యూనిఫార్మ్ వేసుకున్న ఆడపిల్లలు అందంగా కనిపించారు.

'నా పాప ఇలాగే ఉండేదేమో...' అనుకున్నాడు.

ఇంటివారిచ్చిన అడ్రసు ప్రకారం వెడితే అక్కడ పాపారావు దర్శనము ఇచ్చాడు. వివరాలు విని నిట్టూర్చాడు.

"ఆ పాప చనిపోయింది బాబూ." అన్నాడు. అతను తమకు పరిచయస్తుడు., అబద్ధం ఆడవలసిన పనిలేదు.

ఆ విషయం విన్న స్నేహలత కూడా బాధపడింది. ఏడ్చింది. తన బ్రతుకు తనకోసం యెలాగు నిరుపయోగం! తల్లి కోసం, సంఘం కోసం బ్రతకాలి.

## 10

మాధవి హంసను తయారు చేసి, దగ్గరలో చర్చి వారు నడుపుతున్న సన్‌డే స్కూలుకు పంపింది. హంస తన జీవితంలో వెలుతురు నింపిందేమో అనిపించింది. ఆదివారం బద్ధకంగా పడుకునే తను హంస కోసం లేస్తుంది. మాధవి పోషణలో ఆ పాప వికసించిన పుష్పంలా అందంగా తయారయింది.

"ఏమిటి అంత పరవశంగా చూస్తున్నావ్ !"

మాధవి తల తిప్పింది. వసంతరావు నిల్చున్నాడు.

"హాయ్ వసంత్! ఇప్పుడే హంస వెళ్ళింది. రా బ్రేక్ ఫాస్ట్ చేద్దాం" అన్నది. మనసులో మాయామాలిన్యం, కపటం ఉన్నవారు ఇంత స్వచ్ఛంగా మాట్లాడగలరా!

అతను ఆమెను అనుసరించి లోపలికి వచ్చాడు. డ్రాయింగ్ రూమ్ నీటుగా ఉంది. ఫ్లవర్ వాజ్‌లో ప్లాస్టిక్ ఫ్లవర్స్‌కు బదులు, అప్పుడే వికసించిన గులాబీలున్నాయి.

"ఇంటి మీద శ్రద్ధ పెరిగిందే..." అన్నాడు.

"మరి ఇల్లాలుగా అవతారం యెత్తుతున్నాను. ఆ మాత్రం శ్రద్ధ లేకపోతే యెలా! అయినా అసంతా హంస

ప్రతిభ. వసంత్, ఆ పిల్ల చిన్నది కాని యెంత ఆలోచన యెంత వివరణ..."

"తల్లి బుద్ధు లేవచ్చాయేమో..."

"ఏమో..." పక, పక నవ్వింది. "యెందుకో అర్ధం కాలేదా."

"అంత హాస్యాస్పదంగా ఉన్నాయా, నా మాటలు!"

"అబ్బ అది కాదు డియర్! హంస అడిగే ఒక్కొక్క ప్రశ్నకు గుండె అదిరి పోతుంది." అన్నది నవ్వుతూ.

"హంస...హంస...హంసా! అసలు ఆ పిల్ల యెవరు? ఆ పిల్లకు నీకు ఏమిటి సంబంధం?"

వసంతరావును ఒక స్నేహితుడుగా, ప్రేమికుడుగా యెరుగుదును కాని ఈరోజు కొత్తగా కనిపించాడు. ఆమె అతడినే వింతగా చూచింది.

"వసంత్...నువ్వు...నువ్వేనా?"

"ఆఁ నేనే మధూ! నాకాబోయే భార్య టాక్ ఆఫ ద టౌన్ అయితే యెలా శాంతం తెచ్చుకోను?"

"వాట్ డూ యూ మీన్?"

"అవును, నువ్వెంత దాచినా దాగని రహస్యము ఇప్పుడు వెలుగులోకి వచ్చి నైస్‌గా ప్రచారం జరుగుతున్నది. నిజం నిప్పులాంటిదని మరచిపోతే యెలా?"

"నువ్వు మాట్లాడుతున్న నిప్పు, ఉప్పు గురించి నాకేం తెలియదు. సరిగా చెప్పు."

"నీకు వినడానికి అభ్యంతరం లేకపోతే నాకేం సిగ్గు. హంస నీ కూతురు, కాలేజీలో నీవు విచ్చలవిడిగా తిరిగిన దానికి ఫలితం అవునా!"

"ఐసే షటప్......"

"నా నోరుమూస్తావ్. స్నేహితుని దబాయించుతావు. నీ మమతకు, మమకారానికి జవాబు చెప్పగలవా!"

"వసంత్...ఏమిటీ కట్టుకథ?"

"కట్టు కథే అయితే హంసపై నీకెందుకంత ఇంటరెస్ట్?"

"మొన్న కాపాడింది నువ్వేగా! నీకెందుకా ఇంటరెస్ట్. అయితే కాలేజీలో నన్ను మోసం చేసిన బాయ్ ఫ్రెండ్ వి నువ్వే. కాబోలు." అన్నది వెటకారంగా.

"అది కాదు మాధవీ..."

"మీ నోట వచ్చిన అభియోగాలు చాలు, మీకు తాగుడే దురభ్యాసం అనుకున్నాను. ఈ చెవులు పారేసే అలవాటుకూడా ఉందన్నమాట. అది అంటువ్యాధి..." అన్నది.

"మరి కమల అంత అభాండం వేస్తుందా!"

"అభాండమో, నిజమో ఇప్పుడే తేల్చుకుందాము." విసురుగా తలుపు తీసింది.

"ఊం...ధైర్యం ఉంటే రా..." అని దబా, దబా యెదురు ఫ్లాట్ తలుపు కొట్టింది.

శ్రీపతిరావు తలుపు తీసాడు. కమల తన ఇద్దరి పిల్లలతో కూర్చుని ఆడుతుంది. మాధవి ఆ ఇద్దరి పిల్లలను తీసి కమల వడిలో కూలేసింది.

"కమలా! నీ పిల్లలను వడిలో పెట్టుకుని చెప్పు. హంస నా కూతురా!"

"మాధవీ..."

"శ్రీపతిరావుగారూ! మీరు ఒక్క నిముషం ఊరుకుంటారా! భార్యంటే ప్రేమాభిమానాలు, గౌరవము ఉండాలిగాని, ఆమె అన్నదే వేదం అనుకునే భర్తంటే పేడి, ఆడంగి నయం..." అన్నది తీక్షణంగా. ఆమెను చూచి జంకాడు అతను.

నవ్వుతూ ప్రశాంతంగా ఉండే మాధవి కోపం వస్తే అగ్నికణాలు కురిపించ గలదని మొదటిసారి అర్థం అయింది. వసంతరావు కూడా జంకాడు.

"కమలా ప్లీజ్! చెప్పు. నీ బిడ్డలమీద ప్రమాణం చేసి చెప్పు."

"ప్రమాణం యెందుకు చేస్తాను...అది నా బిడ్డ కాదు."

"నీ బిడ్డకాదు, తెలుసు. నా బిడ్డేనా అని అడుగుతున్నాను?"

కమల ముఖం తిప్పుకుంది.

"రా మాధవీ! అయామ్ సారీ, ఆవిడ నిజం చెప్ప లేదు. అబద్ధం ప్రచారం చేస్తుంది." వసంతరావు రెక్కపట్టి బయటికి లాక్కువచ్చాడు.

"కమలా, నీ సైకాలజీ అర్థం అయింది. నీకోసం జాలి పడుతున్నాను. మనిషి తను చెడిపోయి నప్పుడు చుట్టూవున్న వారికీ చెడు అంటగట్టి తృప్తిపడతారు. నువ్వు అదే చేస్తు న్నావు. కాని ఇది ఫౌల్ ప్లే...యువర్ బ్రైన్ ఈజ్ లూజ్..." అని వచ్చేసింది.

ఆమెను ఇంకా కోపంగా ఆవేశంగా ఉన్నది.

"మధూ..." ఏదో చెప్పబోయాడు వసంతరావు.

"ప్లీజ్ మిస్టర్ రావ్, మీరు వెళ్ళిపొండి. ఇప్పుడు నేను మాట్లాడితే పగ్గవునే అవుతాను..." గదిలోకి వెళ్ళి తలుపు వేసుకుంది. వసంతరావు ఒక్క నిముషం నిలబడి ఆలోచించాడు, తను తొందర పడ్డానేమో అనుకున్నాడు.

అతను వెళ్ళిన అరగంటకు ఎలీసా వచ్చింది. తలుపు త్రోసింది.

"మేడమ్!"

"ఎలీ! ప్లీజ్...నాకు బాగాలేదు. హంస వస్తే ఏదో వండిపెట్టి నీతోనే ఉంచుకో. డిస్టర్బ్ చెయ్యకు" అన్నది.

"అలాగే మేడమ్..." అన్నది సిస్టర్. ఆమెకు మాధవి సంగతి బాగా తెలుసు. రెండు రోజులు

ఒక్కొక్కసారి అలా అన్నం సహించకుండా తనను తాను శిక్షించుకుంటుంది. అది ఎరిగినా బాగా తెలుసు. అందుకే ఆ అమ్మాయి అడ్వాన్స్ కావాలన్నా ఉత్తరం రాసు కొస్తుంది. తను తప్పుగా మాట్లాడి మేఘం మనసు నొప్పి స్తానని భయం. మేఘమ్ తనకు తాను వేసుకొనే శిక్ష తెలుసు.

తన భర్త అంటే ఇలా ఉండాలని ఏనాడు ఊహించే అవకాశము రాలేదు. సన్నని తరగతి సంసారంలో పుట్టింది. చదువు చాలీ, చాలని రాబడితో బాధ్యతలతో పెరిగింది. కెనాన్ని వచ్చిన తరువాత కూడా చెల్లెళ్ళ వివాహాలు, తమ్ముడి చదువుకు చేసిన అప్పులు అంతా ఆలోచించింది.

ఈ మధ్యే ఆ నిర్ణయాలు అన్నీ మరచి, వసంత రావు, సుఘోషల ప్రేరణతో వివాహం గురించి ఆలోచించింది.

ఆ ఆలోచనలో భర్తంటే తన కష్టసుఖాలు అర్థం చేసుకుని ప్రాణానికి ప్రాణంగా ఉండాలని కోరుకుంటుంది. కెనాన్నిలో తనను పరిశీలించే అవకాశము వసంత్, సుఘోష లకే వచ్చింది.

“బంగారాయి, స్పందన లేదు” అన్నారు.

మొదట తనను కవ్వించడానికి సుఘోష్ చేసిన ప్రయత్నాలు వసంత్ కు తెలుసు.

వారితో ఒక మగాడిలా ప్రవర్తించింది. ఆ పేరు అంతటా ప్రచారం చేసి ఈనాడు కేముల అనగానే నవ్వులు...

ఆ ఊహే భరించలేక పోతుంది. ఒకవేళ ఆవిడ చెప్పింది నిర్ధారణ చేసుకోవాలని అడిగినా, పద్ధతి అది కాదు. అతను మరచిపోయినా అతను చేసిన అవమానం మరచిపోయి తను కాపురం చెయ్యలేదు.

"ఈ పాప కోసమయినా తను త్వరగా భారతదేశం వెళ్ళాలి. హంసను వాళ్ళ, వాళ్ళకు అప్పగించేస్తుంది.

రాత్రి ఎనిమిది దాటాక గది బయటకు వచ్చింది. సోఫాలో పడి వడలిన తోటకూర కాడలా నిదురబోతుంది హంస.

ఆ ప్రక్కనే కూర్చున్న ఎలీసా లేచింది. ఆ పిల్ల ముఖం పీక్కుపోయింది.

"ఎలీ! పాపను పడుకోబెట్టి, నువ్వు వెళ్ళిపో!" అన్నదినీరసంగా.

"మేడమ్..."

"ఏమిటి ఎలీ?"

"ఉదయం నుండి పాప ఏం తినలేదు. మమ్మీ తినందే నాకు వద్దని మొండి కేసింది."

"మైగాడ్...నాకెందుకు చెప్పలేదు?"

"మీరు..." చెప్పలేక పోయింది. భయంగా చూచింది.

"ఓ..." మాధవి వెళ్ళి హంస నుదురు ముద్దు పెట్టుకుంది. ఆ పిల్ల కళ్ళు విప్పింది.

"మమ్మీ కోపం పోయిందా!"

"నాకు కోపం అని యెవరన్నారు?"

"ఎలీషా చెప్పింది."

"పన భోజనం చేస్తున్నప్పుడు."

"ఊహూ! మమ్మీతో మాట్లాడను." అన్నది. మాధవి ఒక్కసారి ఆమెను హృదయానికి హత్తుకున్నది.

"ఎలీ... నువ్వు సంచరికి గ్లాసు సిద్ధం చెయ్యి." అని బాత్‌రూమ్‌కు వెళ్ళి ఫ్రెష్ చేసుకుని వచ్చింది. ఉదయం చేసిన పదార్థాలే ముగ్గురూ తిన్నారు.

"ఎలీ! గుడ్ నైట్..." అన్నది తలుపు వెయ్యాలని వేస్తూ.

"మేడమ్! వసంతరావుగారు, మధుకర్ గారు, మరీసా ఫోన్లు చేశారు" అన్నది.

"ఊఁ..." అన్నది. ఎలీషా వెళ్ళిపోయాక తలుపు వేసి వచ్చేసరికి హంస నైట్ డ్రస్సు వేసుకుని రడీగా ఉంది.

"గుడ్ నైట్ మమ్మీ."

"గుడ్ నైట్ డార్లింగ్..." ఆ పిల్లకు దుప్పటి కప్పి బయటికి వచ్చింది. ఫోన్ చేసిన వారికి కాల్ చేయటం ధర్మం. వెళ్ళి ఫోన్ చేసింది. యెవరో పర్సెల్ జపాన్ నుండి చీరలు తెచ్చాడట. కావాలా అని అడిగింది. వచ్చి చూస్తానని చెప్పింది.

మధుకర్‌కి చేసింది.

"ఓ మేడమ్ మీరా! వివాహము అయితే ఏలాగు బయటికి వెళ్ళలేరు. ఈరోజు బయటికి వస్తారని చేశాను, మీరు లేరని చెప్పింది ఎలీసా..."

"ఐ వాజ్ బిజీ, థాంక్యూ ఫర్ యువర్ ఆఫర్" అన్నది.

"మేడమ్, ఒక్కసారి వసంత్ గురించి ఆలోచించండి. అతను మరీ ఓవర్‌గా డ్రింక్ చేస్తున్నాడు."

"థాంక్యూ, ఫర్ ద సజెశ్చన్" అని ఫోను పెట్టేసింది.

వసంతరావుకు ఫోన్ చేసింది.

"హాయ్ స్వీటీ! నీ నుండి ఫోన్ కాల్ వస్తుందని ఎక్స్‌పెక్ట్ చెయ్యలేదు. అయామ్ సారి..."

"అందుకని తాగుతూ దేవదాసు వయ్యావా!"

"ఓ...నీకు తాగినట్టు తెలిసిపోయిందా! ఎక్స్‌క్యూజ్ మి."

"గుడ్‌నైట్" అని ఫోన్ పెట్టేసింది. గదిలోకి వచ్చింది. ఆమె పెన్ను పేపరు తీసుకుంది.

"డియర్ వసంత్!

నిన్న జరిగిందానికి నాకేం కోపంలేదు. కాని నా జీవిత భాగస్వామి కాబోయే వ్యక్తికి నాపై పూర్తి నమ్మకం ఉండాలి. అన్నింటికన్నా నిగ్రహం ఉండాలి. చిన్న భేదాభి

ప్రాయం రాగానే ట్రాగావ్. వైవాహిక జీవితంలో యెన్నో వస్తాయి. అలాంటివి తట్టుకోవాలి, మానసికంగా బలహీనులను నేను ఏవగించుకుంటాను. మన మధ్య ప్రేమాభిమానాలతో పాటు గౌరవం వుండాలి. మనిద్దరము స్నేహితుల్లాగా మిగిలిపోదాము" అని వ్రాసి సంతకం చేసి దగ్గర పెట్టుకుని, నిదురపోయింది.

మర్నాడు ఆఫీసుకు వెళ్ళగానే అతని బల్లమీద పెట్టింది. అతను లంచ్ టైములో కంగారుగా వచ్చాడు.

"నా మాట విను డియర్..."

"వసంత్ ప్లీజ్! ఆ చాప్టర్ క్లోజ్ అయింది." అతనెంత మాట్లాడాలని ప్రయత్నించినా అదే సమాధానం చెప్పింది. నిరాశగా వెళ్ళిపోయాడు. ఆమె తేలికగా నిట్టూర్చింది.

సాయంత్రం హంసకు పాఠము చెబుతూ కూర్చుంది. మధుకర్ వచ్చాడు. ఆమె ఆశ్చర్యంగా చూచింది. సాధారణంగా వీళ్ళు శని, ఆదివారాలలో తప్ప రారు.

"వ్వాట్ సర్‌ప్రైజ్!" అన్నది.

"మీరే, ఉండి, ఉండి సర్‌ప్రైజింగ్ న్యూస్ అనౌన్స చేస్తారు." అన్నాడు ఆమె యెదురుగా కూర్చొని.

"నేనా!" అన్నది ఆశ్చర్యంగా.

"మీరే మొన్న అనుకోకుండా వసంత్‌తో పెళ్ళి అన్నారు. ఈరోజు వసంత్ కేసి పెళ్ళి జరుగటం లేదని చెప్పాడు."

"కారణం కూడా చెప్పారా!"

"ఊఁ... మగవాడికి ఒక్కొక్కసారి పురుష అహంకారం తలెత్తుతుంది మాధవిగారూ!"

"పురుష అహంకారానికి సంకుచిత తత్వానికి అర్థం తెలియని అమాయకురాలినా మధూ?"

"అవుననుకో, అయినా వివాహానికి పూర్వం మన చరిత్రలు త్రవ్వటం దేనికి, ఆవేశంలో, అమాయకత్వంలో యెన్నో జరిగిపోతాయి..."

మాధవి తీక్షణంగా చూచింది.

"అంటే, హంస నా పాపని నువ్వు నమ్ముతున్నావా?"

"అయితే ఏమయిందండీ..."

"మధూ..."

"అవును. ఆమాత్రం విశాల భావం లేకపోతే బ్రతకలేము"

"నీ విశాలభావాలకు నమస్కారం. పమిట తగిలితే పరవశించిపోయే నీకు అంతకంటే మంచి ఆలోచన యెలా వస్తుంది. చూడు మధుకర్, ఇంతకు ముందే నీ గురించి యెంతో ఉన్నతంగా ఊహించుకున్నాను. కాని ఉఫ్‌మని ఊదేశావు. ఇట్స్ ఓ. కె. సగటు మగాడివి" అన్నది ఆవేదనగా.

"అది కాదండీ."

"ఇంకేం చెప్పనద్దు. అతను నేను తల్లినని అనుమానించాడు. నువ్వు సహృదయంతో అర్థం చేసుకుని, నా

తప్పును కడుపులో పెట్టుకుని ఉద్ధరిస్తావు" అన్నది. ఆమెకు ఉక్రోషంగా ఉంది.

"అయామ్ సారీ..." సుధాకర్ వెళ్ళిపోయాడు.

మాధవి అలాగే చూస్తుండి పోయింది. 'అచ్చు మగాడు' అనుకుంది.

వారంరోజులు కెన్యాలో ఉన్న భారతీయులందరికీ ప్రచారం జరిగిపోయింది.

"నంగనాచిలా ఉండే మాధవి, వివాహము కాక పూర్వమే పాపను కని, స్నేహితురాలి దగ్గర వదలి వచ్చేసింది. ఆ స్నేహితురాలు ఇప్పుడు తనకెందుకని పాపను ఇచ్చేసింది." అంటున్నారు. మనిషి దిగజారిపోతే ఎంత పతనమవుతారో ఆలోచించుకోలేదు.

"మాధవీ, మీ ఇంట్లో ఉన్న పాప యెవరు?"

"నా కూతురు!"

"మీకు వివాహం కాలేదన్నారు..."

"యెప్పుడయినా మీరు అడిగారా నాకు పెళ్ళి అయిందా, లేదా అని..." నిలదీసింది.

"అది కాదు, మిస్ మాధవి అని ఉంటేను!"

"భర్త వదిలిన వారిని కూడా అంటారు." అన్నది.

దాంతో ఆర్గ్యుమెంటుకు అవకాశమే ఉండేది కాదు. వసంతరావు, సుధాకర్లు వచ్చినా కేకాయి, రాజకీయాలు, కంపెనీ విషయాలు తప్ప వేరే విషయాలు చర్చించలేదు. హంస విషయము యెత్తనిచ్చేదే కాదు.

శ్రీపతిరావు భార్య ప్రచారాన్ని ఖండిస్తూ అసలు విషయము అందరికీ చెప్పాడు. వసంతరావులాంటి వారు నమ్మారు. ఆ విషయం ఎత్తబోతే ఆమె త్రుంచి వేసేది.

"సారీ మధూ!"

"ఇటూ వసంత్! మనిషికి తననను కున్న మనిషి కావాలి. ఎంతయినా మీరు మగవారు నా కోసం హంస దినమంతా అన్నం మానేసిందంటే ఆ పిల్ల కోసం ఏమయినా చెయ్యాలనిపిస్తుంది." అన్నదామె కళ్ళు మిల, మిల లాడగా.

వసంతరావు నిట్టూర్చాడు.

"ఏమీ అనుకోకు, నా జీవితంలో నావారి కోసం ఇన్నాళ్ళు బ్రతికాను. ఇప్పుడు హంస కోసం బ్రతుకుతాను. ఈ నెల మావారికి రెమిటెన్సు కూడా పంపలేను" అన్నది ధృడంగా. అతనేం మాట్లాడలేదు. ఆమె ఒక నిర్ణయానికి వచ్చిందంటే తిరుగులేదని తెలుసు. అతను వెళ్ళిపోయాడు.

# 11

విష్ణు తన ఆఫీసు దర్శించడానికి వచ్చిన జెకోస్లావేక్య అగ్రికల్చర్ ఆఫీసరును బాంబే ప్లేన్ ఎక్కించటానికి వచ్చాడు. అతను డైరెక్టరుతో మాట్లాడుతూ కూర్చుంటే ఇతను దూరముగా నిలబడి, వచ్చి పోయేవారిని చూస్తున్నాడు. జీవితం ఇంతేనా అనిపించింది.

చంద్రం కష్టపడి ఓ మంచి సంబంధం వెతికి యాభై వేల కట్నంతో సంబంధం కుదిర్చాడు.

కట్నం తీసుకోవటం తన ఆశయానికి విరుద్ధమయినా తల్లి కోసం బ్రతకాలన్న నిర్ణయంతో అతను మాట్లాడలేదు. వాళ్ళు అన్నదానికంతా తలాడించాడు.

అమ్మాయి బాగానే వుంది. ఉన్న కుటుంబమేనట. వాళ్లు వరపూజ చేయటానికి వచ్చినరోజు పెద్ద గందరగోళమే జరిగింది. వాళ్ళతో వచ్చిన ఓ యువకుడు విష్ణును అనుమానముగా చూచాడు. విష్ణుకూడా అతడిని ఎక్కడో చూచానని అనిపించింది. "మీరు..." అతను బొమ్మలు ముడివేశాడు.

"విష్ణువర్ధన్‌ని...మీరు, డాక్టర్ కమలాకర్ రావు కదూ?"

"అవును. మీరు మీ కూతురి వివరాలు కావాలంటూ మా ఆస్పత్రికి వచ్చారు గుర్తుందా?"

"ఓ...ఎస్...గుర్తుకు వచ్చింది" అన్నాడు.

"అదేమిటి? మీకు కూతురుందా? మీకు వివాహమే కాలేదన్నారు" ఆశ్చర్యంగా చూచాడు అమ్మాయి తండ్రి.

"అవును..." అంగీకరించాడు. ఇప్పుడు అబద్ధం చెప్పినా లాభంలేదని తెలిసిపోయింది. క్లుప్తంగా పేర్లుదాచి తన ప్రేమ కథ చెప్పాడు విష్ణు.

అమ్మాయి తండ్రి ముఖం వివర్ణమయింది.

"నాకీ విషయం ముందే యెందుకు చెప్పలేదు."

"దానివల్ల లాభం, నష్టం లేవు" అన్నాడు పొడిగా.

"అది నిర్ణయించవలసింది మేము" అన్నారు. వాళ్ళలో

వారు చర్చించుకుని, అమ్మాయితో కూడా ఈ విషయం చర్చించి తెలియజేస్తామని వెళ్ళిపోయారు.

మర్నాడు అమ్మాయికి వేరే సంబంధం చూచుకున్నారని వ్రాశారు.

దాంతో రంగనాయకమ్మ మంచం పట్టింది. అతను ఏమీ చెయ్యలేనట్టుండి పోయాడు. అంతటా నిశ్శబ్దంగా, యాంత్రికంగా తిరుగుతున్నారు.

అదే సమయంలో ఆఫీసులో పని. విదేశాల నుండి వచ్చే అతిథులను సాగనంపాలి, ఆహ్వానించాలి, సాగనంపాలి.

"మిస్టర్ కృష్ణా! యూ ఆర్ ఫ్లూయెంట్ ఇన్ ఇంగ్లీషు..." అంటూ మొదలు పెడతాడు. ఆజ్ఞాపిస్తే యెదిరించవచ్చు.

"మిస్టర్ కృష్ణా, థ్యాంక్ యు ఫర్ యువర్ కైండ్ అండ్ ఫ్రెండ్లీ కంపెనీ. సాయంత్రానికే ఢిల్లీ వెళ్ళాలి" అని చెప్పి అతను కరచాలనం చేసి వెళ్ళిపోయాడు. అప్పటికే ఫ్లైట్ వచ్చినట్టుంది. ఎక్కట్నుంచి జనం బిల, బిలలాడుతూ కనిపించారు.

"కృష్ణా!"

అతను ఆశ్చర్యంగా చూచాడు. అగ్రికల్చర్ యూనివర్సిటీలో ప్రొఫెసర్‌గా పని చేస్తున్న పరాంజపే గారు కలిశారు.

"నమస్తే సర్!"

"నమస్తే! అది ...అక్కడ ఫ్లైట్‌లో కూచున్నావిడ మా చెల్లెలి క్లాసుమేటు.

పాపం ఒకటే జ్వరం మూడు రోజులు బొంబాయిలో ఉన్నదట. తగ్గే సూచనలు కనిపించక వచ్చింది. నాకు కాస్త పని ఉంది. ఒక టాక్సీ మాట్లాడిపెట్టు" అని రెండో మాటకు యెదురు చూడకుండానే చక, చక నడిచి వెళ్ళిపోయాడు. ఆయన యెప్పుడూ అంతే.

"మహారాష్ట్రియులే ప్రాక్టికల్ మనుష్యులు" అని అతని గురించి అందరూ అనుకునేవారు. పిచ్చకోపం వచ్చింది. యెందుకు అతని మాట వినాలి? కాని మానవత్వం మేలుకుంది. ఒక అమ్మాయి అసహాయ స్థితిలో ఉంటే వదిలేసి వెళ్ళటమా!

అతను సోఫా దగ్గరగా వెళ్ళాడు. ఆమె ఒక మూలకు ఒత్తిగిలి ఒరిగి పోయింది. అతనికి ఏం చేయాలో తోచలేదు.

"మమ్మా...మమ్మా యెవర్ని అడగాలి నీళ్ళు?" ఒక పాప ప్రశ్నించింది.

చక్కటి, స్పష్టమైన ఇంగ్లీషు చూచి ముగ్ధుడయ్యాడు.

"మీ అమ్మనా ?"

"ఊఁ..." ఆ పిల్ల కళ్ళలో అసహాయత స్పష్టంగా కనిపించింది.

అతను వెళ్ళి గ్లాసుతో నీళ్ళు తెచ్చాడు.

ఆమె అరగ్లాసు నీళ్ళు త్రాగి భళ్ళున వాంతి చేసుకున్నది. ఒళ్ళు ముట్టుకు చూచాడు. కాలిపోతుంది.

"మైగాడ్...! టాగ్స్ ఏవి పాపా?"

ఆ పిల్ల భుజానికి వేసుకున్న పర్సుతీసి ఇచ్చింది. అతను లగేజి తీసుకొని టాక్సీని కేకవేసి సామాను పెట్టి, పోర్టర్‌ను ఉంచి లోపలకి వచ్చాడు.

"ఏమండీ వస్తారా..."

బలవంతంగా కళ్ళు విప్పింది. మీ రెవరన్నట్టు చూచింది.

"మిమ్మల్నే, పరాంజపేగారు మిమ్మల్ని ఇంటి దగ్గర దింపమన్నారు."

"ఊఁ..." లేచి, తూలిపోయింది. విష్ణు చటుక్కున ఆమెను పట్టుకుని ఆపాడు.

"ఓ..ఇంత జ్వరమా..." అతను చేయూత నిచ్చాడు. రెండో వైపు ఆ పిల్ల చెయ్యి పట్టుకుంది. అయినా ఈడుస్తూనే ఉంది. ఇక లాభం లేదని, ఆమెను రెండు చేతుల మధ్య ఎత్తి తీసుకుని వచ్చి టాక్సీలో పడుకోబెట్టాడు.

"పాపా! మొదట ఏదయినా హాస్పత్రికి వెళ్ళాలి." అన్నాడు.

"అలాగే అంకుల్." అన్నది.

డాక్టర్ స్మిత అతని క్లాసుమేటు అక్క. ఆమె నర్సింగ్ హోమ్‌కు తీసుకు వెళ్ళాడు. అక్కడ స్పృహ రాలేదు. వెంటనే రోజుకు ఇరవై రూపాయలట గది-అందులో ఆమెను చేర్పించి, సామాన్లు పెట్టాడు. డాక్టరు వచ్చి పరీక్షగా చూచాడు.

"నర్స్..." వెంటనే ఇంజక్షన్ ఇచ్చి, గ్లూకోజు ఎక్కించమన్ని ఆదేశించాడు.

"ఇంత సీరియస్ అయ్యే వరకు ఏం చేశారు?" అన్నాడు కోపంగా.

"సారీ డాక్టర్ గారూ! ఆమె మా గురువుగారి తాలూకు. ఇప్పుడే ప్లేన్ దిగారు. నాకు వివరాలు తెలియవు." అన్నాడు.

"ఓ ఐసీ..." అని అతను కేస్‌షీట్ వ్రాశాడు.

"పేరు?"

"మాధవీలత!" ముద్దుగా చెప్పిందా పాప.

"మిగతా వివరాలు పాస్‌పోర్ట్ చూచి వెయ్యండి." అన్నాడు విష్ణు.

వెంటనే పాప పాస్‌పోర్ట్ తీసి ఇచ్చింది.

వాళ్ళు వివరాలు వ్రాసుకున్నారు. పాస్‌పోర్ట్, అందులో మారిన అడ్రసు నోట్ చేసుకున్నాడు.

"నర్స్ నెవరయినా ఉంటే చూడండి డాక్టర్! నేను వెళ్ళి వాళ్ళ ఇంట్లో చెబుతాను." విష్ణు అడిగాడు.

"అంకుల్! నేను చూచుకుంటాను. మా తాతయ్యకు చెప్పండి." అన్నది ముద్దుగా.

"ఐసీ! నీ పేరేమిటమ్మా?"

"హంస!"

"ఓ...బ్యూటిఫుల్ నేమ్."

పాప ఆరిందానిలా మాధవి చెయ్యి పట్టుకుని కూర్చుంది. రెండు అటాచీలు, బ్యాగులు సర్దిపెట్టు పెట్టింది.

"జాగ్రత్తగా ఉంటావా పాపా?"

"ఓయస్ అంకుల్! మమ్మీకి పండ్లు, పాలు కావాలి."

"నువ్వు తినవా?"

"మా మమ్మీ మేలుకునే వరకు ఆకలికాదు అంకుల్." అన్నది.

ఆ పిల్ల ముద్దు మాటలకు ముగ్ధుడయి చూచాడు.

"మీ డాడీ రాలేదా పాపా!"

"నో...మా డాడి ఇండియాలోనే ఉంటారు." అన్నది.

"ఓ...ఐసీ" వెళ్ళి పాలు తెచ్చి త్రాగించాడు. అడ్రసు తీసుకుని వెళ్ళిపోయాడు.

దారిలో కొట్టునుండి ఆఫీసుకు ఫోన్ చేశాడు.

"ఎక్స్‌క్యూజ్ మి సర్! ఎర్‌పోర్ట్‌లో పాత స్నేహితురాలు స్పృహలేని స్థితిలో కనిపించింది. ఆమెను నర్సింగ్ హోమ్‌లో అడ్మిట్ చేశాను." అన్నాడు.

"ఓ...కె. పని చూచుకుని వచ్చేయి." అన్నాడు.

ఫోన్ పెట్టేసి అడ్రసు పట్టుకుని వెత్తే తిన్నగా అది పాపారావుగారింటికి తీసుకు వెళ్ళింది. ఒక ముత్తయిదువు తలుపు తీసింది. గోచి బిగించి కట్టిన ఆకుపచ్చ గుంటూరు ఎఱ్ఱచీర, గుంటూరు రవిక, పసుపు తడలీనుతున్న పచ్చని ముఖానికి ఎఱ్ఱని బొట్టు, కళ్ళకు ఒత్తుగా పెట్టిన కాటుక

మెడకు గుత్తుగా కట్టిన నల్లపూసలలో, రెండు చిన్న పుస్తెలు, పసుపుతాడు, తలలో వాడిన మల్లెలు, కాళ్ళకు కడియాలు, గమ్మత్తుగా గౌరవభావం కల్గించేలా ఉంది.

"ఎవరంటే జవాబు చెప్పవేంబాబూ! మా చిరంజీవి కోసం వచ్చావా?...నువ్వు...రంగనాయకమ్మ కొడుకువి కదూ!"

"అవునమ్మా...మాధవీలత..."

"మా పెద్దమ్మాయి బాబూ! యెలా ఉందో, ఉత్తరాలు రాయటం మానేసింది." అన్నది దిగులుగా.

"అలాగా! ఆమె వచ్చారమ్మా- జ్వరంతో వచ్చి హాస్పత్రిలో ఉన్నారు." అన్నాడు.

"అయ్యో! నా తల్లి నీకెంత కష్టం వచ్చిందే..." ఆమె శోకం తీసింది.

"ఇంట్లో యెవ్వరూ లేరా? మీరు వెంటనే వస్తే..."

"ఒరేయ్ అబ్బులూ..." అంటూ చీదేస్తూనే యెవర్నో పిలిచింది. ఆ ప్రక్కింటి నుండి ఓ కుర్రాడు వచ్చాడు.

"మీ పెద్దయ్య రామభద్రయ్య ఇంట్లో పేకాటలో ఉంటారు. కాస్త పిలువు." అన్నది.

ఆమె ఈ లోపున ఇల్లంతా సర్ది తాళాలు వెయ్యటానికి వచ్చింది. అప్పుడు గుర్తుకు వచ్చిన దానిలా వెళ్ళి కాఫీ తెచ్చింది.

"నా మతి మండా! నా ఒంట్లో బాగాలేదంటే కంగారులో ఏం గమనించలేదు. నువ్వు...రంగనాయకమ్మ కొడుకువి కదూ!"

"అవునమ్మా." అన్నాడు నవ్వుతూ. కాఫీ త్రాగాడు, ఆమె అడిగిందే అడుగుతుంది.

"అమ్మెలా ఉంది బాబూ?"

"బాగానే ఉంది. వయసు వస్తుంది కదా కాస్త అప్ సెట్ అయితే ఏదో ఒక సుస్తీ" అన్నాడు.

అబ్బులు పరుగెత్తుకు వచ్చాడు. "యెవరు చచ్చినా, ఏమయినా సాయంత్రం వరకు రారట" అన్నాడు.

"ఈయన పేకాట పాడయిపోను. నా పిల్ల ప్రాణాలు తీసేలా ఉన్నాడు!" అన్నది. తలుపుకు తాళం వేసి, ప్రక్క వాటాలో ఇచ్చింది.

"ఇంట్లో ఇంకెవరు లేరాండీ?"

"ఇంకెవరున్నారు బాబూ? హేమలత, పుష్పలతల పెళ్ళిళ్ళు అయిపోయాయి. చిరంజీవి భార్య పురిటికి వెళ్ళింది. నా తల్లికేం ప్రమాదం లేదు కదా బాబూ?"

"అబ్బే, లేదమ్మా." అన్నాడు.

"ఏమిటో పిచ్చి తల్లి! తమ్ముడు, చెల్లెండ్లు, అమ్మ, నాన్నంటూ సంపాదించినదంతా పంపించింది. పెళ్ళిచేసుకోమని ఉత్తరం వ్రాశాను, తప్పా నాయనా? జవాబు వ్రాయలేదు." అన్నది కళ్ళు ఒత్తుకుని.

అతను నవ్వాడు. తన తల్లి గుర్తుకు వచ్చింది. ఇద్దరు బస్ ఎక్కి స్మితా నర్సింగ్ హోమ్ చేరుకున్నారు. గ్లూకోజ్ తీసి వేశారు. హంస మాధవి చెమట్లు తుడుస్తుంది.

"లతా..." బావురుమన్నది రుక్కమ్మ. కూతురుపై వాలి ఏడ్చింది.

"అమ్మా... నాకు... నిన్ను... ఓదార్చే... శక్తి లేదు..." అన్నది నీరసంగా.

"ఉష్! అమ్మమ్మా! అమ్మ అప్‌సెట్ కావద్దు." హంస ఆమెను లేపింది.

ఆమె ఆశ్చర్యంగా చూచింది ఆ పిల్ల వంక.

మాధవి నీరసంగా విష్ణువంక మీరేనా నన్ను హాస్పత్రిలో చేర్పించింది అన్నట్టు చూచింది.

"థాంక్ గాడ్! జ్వరం దిగిపోతుందనుకోలేదు." అన్నాడు విష్ణు.

"మీకే థాంక్స్ చెప్పాలి. మా హంస మీ గురించి ఒకటే చెబుతుంది." అన్నది మెల్లగా.

"మీరు స్ట్రైన్ తీసుకోవద్దు."

"ఏమిటే అమ్మా! అమ్మా, నాన్న చచ్చారనుకున్నావా? వస్తూ ఉత్తరం వ్రాయమంటే. అబ్బాయి దేవుడిలా తీసుకుని వచ్చాడు కాబట్టి సరిపోయింది." అన్నది వెక్కుతూ.

"నేను యెప్పటిలా వారానికో ఉత్తరం వ్రాశాను"

"అయిదు నెలలనుండి ఉత్తరమే లేదు..." అని మరోసారి కళ్ళు ఒత్తుకున్నదామె.

"చిత్రంగా ఉందే..."

"మీకు తగ్గినాక మాట్లాడుకోండి. మరి నేను వస్తాను. హంసా, సామాన్లు జాగ్రత్త..." అన్నాడు.

"మీరు చెప్పవద్దు సార్ ! షి ఈజ్ టూ క్యూట్." నర్సు అన్నది, మాధవి టెంపరేచర్ నోట్ చేస్తూ.

బుట్టబొమ్మలా పోనీ టేల్‌తో నిలబడిన హంసను చూడగానే అతని అంతరంగం కదిలిపోయింది. చటుక్కున వచ్చి ఆమెను యెత్తి రెండు బుగ్గలపై గట్టిగా ముద్దు పెట్టుకున్నాడు.

"థాంక్యూ అంకల్!" అన్నది. దిగి కాస్త సిగ్గు పడింది.

"మరి నేను వెళ్ళిరానా అమ్మా !" రుక్కమ్మ నడిగాడు.

"బాబూ! ఈపాటికి ఇద్దరూ ఇల్లు చేరి ఉంటారు. కాస్త విషయం చెప్పయ్యా" అన్నది ఆదుర్దాగా.

"అలాగేనమ్మా, నేను వెళ్ళే సరికే యెనిమిది దాటు తుంది. మీ భోజనం ?"

"నువేం పట్లేదయ్యా, మధ్యాహ్నం ఆలస్యంగా భోజనం చేశాను."

"ఓ పండు ఒలుచుకు తింటాను" అన్నదామె.

"ఇంకో రెండు పండ్లు తెచ్చి యిస్తాను" అన్నాడు. అతను వెళ్ళి రెండు యాపిల్ పళ్ళు, బిస్కట్లు తెచ్చి ఇచ్చాడు.

"అంకుల్ చేంజ్!" పర్సు తీసి పది రూపాయలు ఇచ్చింది.

"యెందుకు ?"

"పళ్ళు, పాలు, ఇప్పుడు బిస్కట్లు తెచ్చారుగా. తీసుకోండి అంకుల్" అన్నది. ఆ పిల్ల అభ్యర్థన ఏదీ కాదనలేని అసహాయత ఆవరించిందా క్షణంలో. తీసుకున్నాడు.

విష్ణు ఇంటికి వెచ్చి, తల్లి ఆరోగ్యం యెలా ఉందో చూచి, పాపారావింటికి బయలుదేరాడు.

"అమ్మా! మీ పాపారావు కూతురు జ్వరంతో వచ్చి హాస్పిటల్లో చేరింది." అన్నాడు.

"అయ్యో! ఏమయిందిరా..." తల్లి అడిగింది. అందుకే అన్నారేమో పుట్టింటి కుక్కయినా అభిమానమని అంతవరకు ముఖం మాడ్చిన తల్లి లేచి కూర్చుంది.

మధ్యాహ్నంనుండి జరిగిన సంగతులన్నీ చెప్పాడు.

"పాపన్న అలవాట్లు ఇంకా మారలేదన్నమాట. ఒకసారిలాగే మీ నాన్నను తీసుకుని వాళ్ళింటికి వెళ్ళానురా అబ్బాయ్. అరుగుమీద పేకాటలో కూర్చున్నాడు. ఆ

రుక్కమ్మ కాఫీ ఇచ్చింది. పలుకరించింది. ఇంటికి వచ్చారు మీ నాన్న ధూం, దాం ఏం చెప్పను?"

"మరి ఇంటికి అతిథులు వస్తే పేకాడుతూ కూర్చుంటే వచ్చిన వాళ్ళకు కోపం రాదేమిటి మరి!"

"ఉత్త కోపమా! పిచ్చకోపం వచ్చింది. ఆ కోపమే చంద్రుడికి వచ్చిందనుకో. కాఫీ నీళ్ళ కోసం కరణంగారింటికి లాక్కెళ్ళిందని నన్ను ఎన్నిసార్లు సాధించారు" అన్నది.

"అతనికి చెప్పి వస్తాను" అని త్వరగా బయలుదేరి వచ్చేశాడు. అతను వెళ్ళేసరికి పాపారావు, అతని కొడుకు చిరంజీవి భోజనం చేస్తున్నారు.

"రావోయ్ విష్ణువర్ధన్ రా..." చేతులు తుడుచుకుంటూ వచ్చాడు.

"మీతో ఓ విషయం చెప్పాలని వచ్చాను..." టూకీగా మాధవీలత విషయం చెప్పాడు.

అంతవరకు ప్రసన్నంగావున్న ముఖం మాడిపోయింది.

"నా కూతురే లేదనుకుంటున్నాను బాబూ!" అన్నాడు కోపం, ఆవేశం మిళితమైన స్వరంతో.

"ఏం జరిగిందండీ?"

"మగ బిడ్డడికి చెప్పించినట్లు చదువు చెప్పించానా! విదేశాలకు పంపించానా! ఉద్ధరించి ఊరేగిస్తుందని ఆశపడ్డాను. నన్ను నట్టేట ముంచి, యెవడినో, కులంగాని వాడిని, గోత్రం

లేనివాడిని కట్టుకుంటుందా! బుద్ధిఉందా అసలు..." అన్నాడు రోషంగా, కోపంగా.

"ఐసీ! ఆయనేం పని చేస్తాడు?"

"వాళ్ళ ఆఫీసులోనే ఏదో చేస్తాడట"

"అతను అక్కడే ఉన్నాడట కదా!"

"వచ్చేశాడేమో. కులం, గోత్రం లేనివాడు కడదాకా పలుకుంటాడంటే నాకు నమ్మకం లేదు"

"ఆవిడగారొస్తున్నట్టు మీకు తెలియదా?"

"ఆరు నెలలనాడు పెళ్ళి అంటూ వ్రాసింది బాబూ, ఆ తరువాత దాన్ని లేనిదాని క్రిందే జమ చేశాను"

"ఆవిడ పెళ్ళి అయి ఆర్నెలలయిందా?" ఆశ్చర్యముగా చూచాడు. ఆరేళ్ళ కూతురుంది.

"అవునయ్యా! ముప్పై ఏళ్ళు ముడ్డి క్రిందికి వస్తుంటే పెళ్ళికేం వచ్చింది? చిరంజీవిని కొడుకనుకుంటే పోలా! ఆమె సంపాదన నమ్ముకుని ఈ ఇల్లు మొదలుపెట్టాను. వాడికి వచ్చే జీతంలో అడ్జస్టు కావాలంటే తాడు తెగుతుంది" నిట్టూర్చాడు.

అదేం మనిషి! కూతురి వివాహం కావాలని, ఆడపిల్ల సంపాదనకు ఆశించామని బాధపడే తల్లిదండ్రులున్నారుగాని ఇలాంటి వారున్నారని మొదటిసారి తెలిసింది.

"అది వచ్చిందని నువ్వే చెప్పావా?"

"అవునండీ. మధ్యాహ్నము వచ్చాను."

"నాన్నా! నలుగురు ఏమనుకుంటారు! వెళ్ళి అక్కయ్యను చూద్దాం పద" చిరంజీవి అప్పుడు అన్నాడు.

"చూచావా బాబూ! మగపిల్లడయినా యెంత దయో. దానికి మాపై లేకపోయింది."

విష్ణుకు అసహ్యం కలిగింది. ఆరేళ్ళ కూతురుండగా, ఆరునెలలనాడు పెళ్ళి చేసుకున్నట్లు తల్లితండ్రులకు చెప్పటమా! యెంత మోసకత్తె! అందుకే తండ్రి అసహ్యించుకుని దూరం ఉంటున్నారు. ఆడవారు చేసేవి అన్నీ చేసి అసహాయంగా చూస్తారు. అదే వారి దగ్గరున్న ఘటాయుధం.

"వస్తానండీ..." చెటుక్కుని లేచి బయటికి వచ్చేశాడు. యెవరెలా పోతే తనకేం?

ఒక్క నిముషం మాత్రం అసహాయురాలయిన తల్లి, ఆరిందానిలా ఉన్న కూతురు అతని కళ్ళముందు మెదిలారు. తల విదిలించి బయట పడ్డాడు.




## 12

ఆఫీసు, ఇల్లు, ఏకాస్త సమయము దొరికినా రమేష్, సురేష్‌ల చదువు పర్యవేక్షిస్తున్నాడు. ఆ రోజు ఆదివారం ఆలస్యంగా లేచి కాఫీ త్రాగాడు. అప్పుడే కాంతం వచ్చింది. నిన్నటివరకు మూల్గుతూ పడుకున్న రంగనాయకమ్మ లేచింది. హుషారుగా తయారయింది.

"మేము బంధువుల ఇంటికి వెళుతున్నాము. అక్కడ ఆలస్యం అయితే, ఇక్కడ నా కోసం కాచుకుని కూర్చోక భోజనం చెయ్యి." అన్నది.

"ఎక్కడకమ్మా..." అతని ప్రశ్న పూర్తికాక ముందే టపీమని నోరు మూశాడు సురేష్.

"ఎందు బోయెదవన్న, యెదురు తంబలింగన్న, మంచ గన్న, చాకి మూటగన్న..."

ఈసారి వాడి నోరు విష్ణు మూశాడు.

"శాబాష్! అమ్మా, నాయనమ్మా యెక్కడికి వెళ్తున్నారో తెలుసా?" రహస్యంగా అడిగాడు, రమేష్.

"యెక్కడికి?" తన నోటిపై ఉన్న సురేష్ చేయి తీసి అడిగాడు.

"మరే...మరే...,అమ్మ వాళ్ళ శాబాయి కూతురుందట, చూడటానికి వెళ్ళారు."

"ఏం ఆవిడకు బావుండలేదా?"

"ఛ...నీకేం తెలియదు. ఆమెను చూచి నచ్చితే నీ పెళ్ళి చేస్తారట."

"వెధవ... వెధవాని! వేలెడు లేడు అన్నీ ఆరినవారి కబుర్లు! మళ్ళీ ఇలాంటి కబుర్లు తెస్తే నీ పని చేస్తాను." అన్నాడు, చెయ్యి యెత్తి కొడతానన్నట్లు బెదిరిస్తూ.

"ఏదో విన్నది చెప్పాను. నా కెందుకు!" అని వాడు సీరియస్‌గా వెళ్ళిపోయాడు! అతనికి తల్లిపై విపరీతమైన జాలి కలిగింది. 'పాపం అమ్మను యమధర్మరాజు పిలిచినా,

మా అబ్బాయి పెళ్ళిచేసి వస్తానంటుందేమో అమాయకు రాలు' అనుకున్నాడు. రామచంద్రాపురంలో యెందరో స్నేహితులున్నారు. వారు రమ్మని గొడవ చేస్తుంటారు. ఏనాడు సమయము దొరకదు. ఆ రోజు అందరిని కలుద్దామని బయలు దేరాడు. అతను బయటకు వచ్చేసరికి సురేష్ వెహికల్ తుడుస్తున్నాడు.

"ఏమిట్రో శాబాయి మీద భక్తి ముదిరిపోయింది."

"ఏం లేదు బాబాయి, దుమ్ముంటేను. శ్రీనివాసా పిక్చర్ ప్యాలెస్‌లో కొత్త సినిమా వచ్చిందట." అన్నాడు.

"సినిమాకి డబ్బులు కావాలని తిన్నగా ఏడ్వవచ్చు కదా!"

"ఏడిస్తే ఏమొస్తుందని ఆలోచించే కాలం బాబాయి" అన్నాడు తెలిసినవాడిలా.

అయిదు రూపాయలు తీసి ఇచ్చాడు.

"మీరిద్దరూ వెళ్ళండి. మన యముడు అడిగితే నా పేరు చెప్పండి."

"అమ్మో! యముడుంటే అడుగుతామా! ఆయన ఊరెళ్ళిపోయారు. రేపు వస్తారు అని తల యెత్తేసరికి చేతిలో సంచి అరుగుమీద పెట్టి నుదుట చమట తుడుచుకుంటూ చంద్రం నిల్చున్నాడు.

ఒక్కసారే సురేష్ కాళ్ళలో వణుకులాంటిది ప్రారంభంఅయింది - వాడి అవస్త చూస్తే విష్ణుకు నవ్వ

వచ్చింది. కాని, చంద్రం ముందు ఏనాడు పగలబడి నవ్వలేదు. నిక్కర్ తడి అయిందా అన్న అనుమానం కలిగింది.

"బాబాయ్... నేను హోమ్ వర్క్ చేసుకోవాలి" పరుగెత్తుకుని పోయాడు.

"మీరు ఊరు వెళ్ళలేదా అన్నయ్యా?"

"బస్సు దొరకలేదురా" అన్నాడు.

"ఈ బస్సులదో సమస్య-యెప్పుడూ సమయానికిరావు. నేను వెహికల్ మీద తీసుకువెళ్ళి సెంటర్ లో వదిలిపెడతాను పదండి."

"అలాగే..." ఇద్దరూ బయలుదేరారు- రామచంద్రాపురం బస్సుస్టాండులో చంద్రాన్ని వదిలి అతను వెళ్ళిపోదామని మోటర్ బైక్ దగ్గరకు వచ్చాడు.

"అంకుల్! నమస్తే..." అన్న మృదుమధుర కంఠము వినిపించింది.

"యెవరూ?" తిరిగి చూచాడు. చిన్న స్కర్టు, బ్లౌజు వేసుకుని హంస నిలబడిఉంది.

"ఓ...హంసా! మీ అమ్మకు పూర్తిగా నయం అయిందా?" అన్నాడు. హంస అన్నపేరు ప్రత్యేకంగా అనిపించింది. అందుకే గుర్తుపెట్టుకున్నాడు.

"బాగయింది అంకుల్! అక్కడ ఉంది రండి" అన్నది చేయిపట్టి లాగుతూ.

"పద..." ఆమె వెంట వెళ్ళాడు. సామాన్లు పెట్టుకుని టాక్సీని శేరం ఆడుతుందామె.

"మమ్మీ...మమ్మీ! ఇదిగో నిన్న హాస్పత్రిలో చేర్పించిన అంకుల్" అన్నది హంస.

ఆమె ఒక్కసారి ఇటు తిరిగి చిన్నగా నవ్వి చేతులు జోడించింది.

"చాలా ధన్యవాదాలు. మీకు కృతజ్ఞత చెప్పుకుందామంటే వీలు కాలేదు" అన్నది.

ఏమిటీవిడ చిరునవ్వులో మెస్మరిజం అనుకున్నాడు. హాహారావుద్వారా ఏర్పడిన అసహ్యం, అయిష్టత యెగిరిపోయాయి. బంగారు రంగు నైలెక్స్ చీరలో కడిగిన ముత్యంలా, నీరసంగా కనిపించింది. ఆమెకు అతను తనను మోసుకెళ్ళాడన్న విషయం గుర్తుకురాగానే తల వంచేసింది.

"అప్పుడే వెళ్ళిపోతున్నారా?" అన్నాడు.

"ఏమిటో నాయనా! అంతా నా ఖర్మ" అంటూ రుక్కమ్మ వచ్చింది.

"అమ్మా! మళ్ళీ ఎందుకు వచ్చావ్!" అన్నది మాధవి.

"నీకు నేను తల్లినే తల్లిని. యెవరి పిల్లకోసమో పెంచినందుకే మమ్మల్ని వదులుకుంటున్నావు...నేను కన్నానే"

"అమ్మా! ఇది రోడ్డు, వాదనలు వద్దు. హంస చాలా చురుకయిన పిల్ల, పెంచానని, అదని అనకు." అన్నది హెచ్చరికగా.

"అదేం లేదు. మనిషిగా ఎవరయినా చేస్తారు. మా అమ్మమ్మ ఊరువారే, పరాయివారా?" అన్నాడు.

"బాబూ విష్ణూ! ఒక్క స్త్రీ వెళ్ళలేదు. కాస్త ఏదయినా మంచి హోటల్లో దింపు నాయనా!" రుక్కమ్మ బ్రతిమాలింది.

"వెళ్ళగలనమ్మా. నువ్వేం కంగారుపడకు." కాస్త విసుక్కుంది.

విష్ణు వెళ్ళి టాక్సీ మాట్లాడి, వారి సామాన్లు ఎక్కించాడు. తను వెహికల్ తీసుకుని టాక్సీ వెంట బయలుదేరాడు.

"నాయనా! శ్రమ అనుకోక అమ్మాయి ఎక్కడ దిగిందో చెబుతావు కదూ!" వెనకనుండి రుక్కమ్మ అడిగింది.

తలాడించి వచ్చేశాడు. ఆమెను హోటల్లో దింపి, కాఫీ తెప్పించాడు. హంసకు గోల్డ్‌స్పాట్ తెప్పించాడు.

"చాలా థాంక్స్! ఏదో బంధువులున్నారని వస్తే... పోనివ్వండి. మీరేం చేస్తున్నారు?" అన్నది మాధవి.

"ఇక్కడ ఉన్న ఒక పరిశోధనా కేంద్రంలో అగ్రికల్చర్ అసిస్టెంటుగా పనిచేస్తున్నాను." అన్నాడు.

"మన దగ్గర జీతాలు పెరగలేదుగాని ఇన్‌ఫ్లేషన్ మాత్రం బాగా పెరిగిపోతుంది." అన్నది.

"అప్పుడు, జనాభా సమస్య కదండీ, అన్నింటికన్నా ముఖ్యంగా బయటి దేశాలు ఎన్నో రకాల చాకిరి చేస్తున్నారు కదా. మన దగ్గర కష్టపడి పని చేద్దాం అసలు." అన్నాడు.

"శీతాలు తప్పవని నిరాశ కాబోలు."

"ప్రయాసాధ్యం కదండీ. మన దేశాన్ని మనమే బాగు చేసుకోవాలి. ప్రజల మనస్తత్వం విచిత్రంగా మారి పోయింది. ఉద్యోగం దొరికే వరకు ఉద్యోగం, ఉద్యోగం అంటారు. జీతం రాళ్ళు చేతికి రాగానే మన ఊరి దగ్గరుండాలి. మన ఇంటి దగ్గర ఉండాలనుకుంటారు." అన్నాడు.

ఆ విషయం విని మాధవి ఫక్కున నవ్వింది.

అతను తెల్లబోయినట్టు చూచాడు. ఆ నవ్వు యెందుకో అర్థం కాలేదు.

"ఏమండీ! నేనేదయినా అతిశయోక్తి అన్నానా?"

"అబ్బే... అది కాదండీ నా అనుభవము గుర్తు వచ్చింది. నాకు మొదటిసారిగా ఎల్. డి. సి. గా హైదరాబాద్ జిల్లాపరిషత్తులో ఉద్యోగం వచ్చింది. 'ఆడపిల్ల, పల్లెలకు- ఊళ్లకు వేస్తే ఒంటరిగా వెళ్ళలేను బాబూ!' అంటూ మా నాన్నగారు నానా యాతన పడి బొల్లారంలో వేయించారు..."

"మీ విషయంలో మరి ఆ రూలు వర్తిస్తుంది."

"పూర్తిగా వినండి మరి. నెలరోజులు బొల్లారంలో చేయగానే నాన్నగారు, నన్ను ఎం. ఏలో చేరమన్నారు. ఇంటికి వచ్చేసరికి అయిదున్నర అవుతుంది. అసలు విశ్రాంతే ఉండదు, అన్నాను. మా నాన్నగారు వెళ్ళి సికింద్రాబాద్‌లో యెక్కడో షిఫ్ట్ సిస్టమ్ స్కూలుందట. అక్కడికి కావాలని తిరిగి, పట్టుబట్టి ట్రాన్స్‌ఫర్ చేయించారు."

"పాపారావుగారు సమర్థులే లెండి."

"అక్కడ నెలరోజులు ఉద్యోగం చేశాను. బస్ స్టాండుకు, మా స్కూలుకు చాలా దూరం. మా నాన్న గారు చైర్మెన్ దగ్గరకు నన్ను తీసుకువెళ్ళి దీనంగా నా విషయం చెప్పాడు. ఆడపిల్లండీ! ఆలస్యం అయి ఆ దారమ్మట నడుస్తుంటే ఇంకా ఏమయినా ఉందా! ఆయన మంచివాడే. మల్కాజిగిరిలో వేయించారు. నెల తిరక్కముందే మరో అప్లికేషన్ పెట్టాను."

"మైగాడ్! మళ్ళీ దేనికండీ?"

"మగపిల్లల బడిలో మా అమ్మాయి చెయ్యలేదు. గరల్స్ స్కూల్‌కు ట్రాన్స్‌ఫర్ చెయ్యండి అంటూ."

"బాగుంది, చెప్పండి."

"అప్పుడు చైర్మెన్‌గారికి ఒళ్ళుమండి రికమండేషన్ లెటర్ ఇచ్చారు. అది తీసుకుని, నేను జడ్. పి. ఆఫీసుకు వెళ్ళాను. అందరూ పకా పకా నవ్వటమే. నాకు రోషంవచ్చి, ఆ ఉత్తరం తీసుకుని చదివి తెల్లబోయాను."

"ఊస్టింగ్ ఆర్డర్స్ కావు కదా, కొంపదీసి."

"కాదు. ఈ అమ్మాయి తండ్రిని కూర్చోబెట్టి, అతనికి ఏ ప్రాంతంలో బడి కావాలో, యేలాంటి బడి కావాలో చర్చించి, అలాంటి బడి మన జడ్. పి. లో ఉంటే సరే, సరి లేకపోతే కట్టించి అక్కడ ఈ అమ్మాయిని అపాయింట్ చెయ్యండి, అని వ్రాశారు."

ఈసారి విష్ణువర్ధన్ పక, పక నవ్వాడు.

"బాగుండదండి. వారు ప్రాశారని కాదు. ఏమిటో మనవారి దృక్పథంలో మార్పు వచ్చింది. ఉద్యోగం దొరకగానే తమ ఊరికి రావాలి అనుకుంటారు. అదీ అయ్యిందను కోండి. ప్రమోషన్ అంటారు, పదవి అంటారు..." అన్నాడు నిస్పృహగా.

"మీరు అక్కడికి రానూడదూ?"

"మీరు అదృష్టవంతులండీ, నల్గురు సంతానం. నేను అమ్మకు లేక, లేక పుట్టినవాడిని. అమ్మను వదిలి రావటం కుదరదు. అందులో ఆమె ఆరోగ్యం అంత మంచిది కూడా కాదు" అన్నాడు.

"మీ శ్రీమతి..."

"నాకు ఇంకా వివాహము కాలేదు." నవ్వేశాడు.

"ఓ...అయామ్ సారీ..." అన్నది.

"అయామ్ సారీ అంకుల్! మీ ఇంటికి వచ్చి, మీ పిల్లలతో ఆడుకుందామనుకున్నాను" ఆరిందానిలా అడిగింది హంస.

"ఓ...పాపా..." నవ్వి ఆమెను దగ్గరగా తీసుకుని ముద్దు పెట్టుకున్నాడు. ఆ పిల్లను అలా దగ్గరకు తీసుకుంటే అనిర్వచనీయమైన ఆనందం కల్గింది.

"మా అన్నయ్య కొడుకులు ఇద్దరున్నారు. నువ్వు రామ్మా ఆడుకుందురుగాని, వాళ్ళకు తోక ఒక్కటే తక్కువ" అన్నాడు.

"అంకుల్! నాకు తెలుగు రాదనుకోను, ఇందాక మమ్మీతో ఏం చెప్పారు! ఒక్కడినే అని చెప్పలేదూ!" అన్నది. నీ సంగతి నాకు తెలియదా, అన్నట్టు.

"చెప్పాను. అయితే ఏమిటి?"

"మరి మీకు అన్న లేడని తెలిసిపోయింది."

"టూ స్మార్ట్! మా అమ్మగారికి నేను ఆలస్యంగా పుట్టాను. అందుకే ఒకతన్ని పెంచుకుంది. అతను నాకు అన్న కాదా?"

"ఓ...ఐసీ..." అన్నది చాలా తెలిసినట్టు.

"అతడికి మేమో ముద్దుపేరు పెట్టుకున్నాము యముడని"

"అంత భయంకరంగా ఉంటాడా..." అక్కడే ఉన్న బాలమిత్రలోని బొమ్మలు చూపింది.

"నేను చెప్పడం దేనికి? రేపు నువ్వే వచ్చి చూడు. ఏమండీ, మాధవిగారూ! రేపు సాయంత్రము మా యింటికి టీకి రాకూడదూ!"

"మీరంతగా ఆహ్వానించాలా! తప్పక వస్తాము."

"తప్పక వస్తాము. మీ యమధర్మ రాజును చూడాలి మరి" నవ్వింది హంస.

"సిసింద్రీ. మీ ప్రోగ్రామేమిటి?"

"ఈ పూట హాయిగా రెస్ట్ తీసుకుని, రేపు ఏర్ లైన్స్ ఆఫీసుకు వెళ్ళి, నా టికెట్ కన్‌ఫర్మ్ చేయిస్తాను" అన్నది.

"రేపు నేను వచ్చి తీసుకువెళ్తానండీ" అన్నాడు లేస్తూ.

"అక్కరలేదండీ నాకు ఇప్పుడే చూచాయగా గుర్తుకు వస్తుంది."

"గంగారాం ఊర్లోకి రాగానే పాతకాలపు మేడ, దాని ముందు రెండు వేప చెట్లూ..."

"ఎగ్జాక్ట్లీ..." అన్నాడు అతనికి ఆశ్చర్యం వేసింది. ఆమెకెలా తెలుసు అని అడిగేశాడు.

"నేను టెంత్ క్లాసు చదువుతుండగా మా ఊరినుండి వస్తుంటే, బస్ మిస్ అయింది. మా నాన్నగారు తీసుకువెళ్ళి మీ ఇంట్లో కూర్చోబెట్టారు. అప్పుడు ఉదయం ఒక బస్సు, సాయంత్రం ఒక బస్సు నడిచేవి." అన్నది.

"శాప్ రే. మీ జ్ఞాపక శక్తికి జోహార్లు అర్పించాలి." అన్నాడు.

"కొన్ని సంఘటనలు మరచిపోదామన్నా మరపు రావు. నాకు దాహంగా ఉంటే మంచినీళ్ళు అడిగి త్రాగాను. ఆ రోజు మా నాన్న చేసిన హడావుడి అంతా ఇంతా కాదు." అన్నది.

"ఇప్పటికీ మారాడనా! ఇప్పుడూ మంచినీళ్ళు త్రాగడు" అన్నాడు విష్ణు.

"ఇంకో వింత సంఘటన జరిగింది. ఆ ఇంట్లో ఓ కుర్రాడు ఉండేవాడు. మీ అమ్మగారు మల్లెలు కట్టి నా

తలలో తురిమింది. 'అబ్బ యెంత పెద్ద తలకట్టో' అన్నది నా జడ యెత్తి చూస్తూ. ఆ అబ్బాయి ఉడుక్కుని 'అమ్మో, ఆ జడతో మగణ్ణి ఉరి వేస్తుందిలే' అని వెక్కిరించాడు."

"మా ఇంట్లో నేను తప్ప అబ్బాయిలు లేరండీ."

"మీరు కారండీ, పొట్టిగా నిక్కర్లు వేసుకుని ఇంత ఉండేవాడు."

"అమ్మో! అయితే నేనేనండీ బాబూ! బియస్సీ వరకు నిక్కర్లు వేసుకున్నాను." అన్నాడు ముసిముసిగా నవ్వుతూ.

హంస కూడా మాధవి, వదులుగా అల్లిన జడతో ఆడుకుంటూ ముసి, ముసిగా నవ్వింది.

విష్ణు లేచి బయటికి వచ్చాడు. వాళ్ళు లిఫ్ట్ వరకు వచ్చి సాగనంపారు. విష్ణువర్ధన్ తలుపేసుకుంటూ చెయ్యూపాడు. అతని కెందుకో చాలా ఆనందంగావుంది. యెవరిని కలవాలో కూడా మరచిపోయి, చాలాసేపు అలా నిలబడి చూస్తూ వుండిపోయాడు. యెవరో హార్న్ కొట్టి వెహికల్ అడ్డు తియ్యమనేవరకు ఈ లోకంలోకి రాలేకపోయాడు.

# 13

మాధవికి యెదురు వచ్చి ఆహ్వానించారు. హంస, మాధవి వచ్చేసరికి, రమేష్ సురేష్ యుగళగీతంలా 'హాయ్' అన్నారు.

"స్వీట్స్ ఏనా అంకుల్, తోక లేని కోతులు!" హంస ముద్దుగా అడిగింది.

మాధవి "హంసా!" అంటూ ఉరిమి చూసింది.

అదెవరూ గమనించలేదు. ఒక్కసారి గొల్లున నవ్వారు.

"అరే యముడు కూడా నవ్వుతున్నాడే..." హంస మరో బాంబు పేల్చింది.

దాంతో అందరూ ముఖా, ముఖాలు చూసుకున్నారు. చంద్రశేఖరం మాత్రం హృదయ పూర్వకంగా నవ్వుకుంటూ వచ్చి హంసను యెత్తుకున్నాడు.

"నువ్వు దేవకన్యవా తల్లీ!" అంటూ రెండు బుగ్గలపై గట్టిగా ముద్దుపెట్టుకున్నాడు.

విష్ణు తల యెక్కడ దాచుకోవాలో తెలియనట్టు, గిల, గిలాడి పోయాడు. అతనికి మొదటిసారి తనపై తనకు కోపం వచ్చింది.

పసిపిల్లలముందు అంత క్రూరమైన పరిహాసం ఆడకూడదని, లెంపలు వాయించుకున్నాడు, మనసులో.

"మీరేమి అనుకోకండి. అది వాగుడు పిట్ట" అన్నది మాధవి.

"పెద్దలు వాగినవి పిల్లలు అప్పజెప్తారు." అన్నాడు నవ్వుతూనే. అతనంత హృదయ పూర్వకంగా నవ్వటం మొదటిసారి చూచింది కాంతం. ఆమె భర్త చేతులనుండి హంసను అందుకుంది.

"మీ అంకుల్ నాకు అవ్వాకేం ముద్దు పేర్లున్నాయని చెప్పలేదా?"

"భలేదానివి వదినా..." కళ్ళతోనే ఇక చాలు అన్నట్టు వారించాడు.

అందరినీ నవ్వుల మధ్య పరిచయం చేశాడు. కాంతం చేసిన పకోడీలు కాఫీ త్రాగారు.

రంగనాయకమ్మ కొడుకు పెళ్ళిపురాణం విప్పింది.

పిల్లలిద్దరూ హంసతో సగం ఇంగ్లీషులో, సగం తెలుగులో మాట్లాడారు.

"సీ...సీ...హంసా... దేర్ ఈజ్ బిగ్ బండా ఇన్ అవర్ స్కూల్..." అంటూ చెబుతున్నాడు.

"మీ నాన్నగారి పేరు యముడు కాదా?"

"కాదు.. ఆయన పేరు చంద్రశేఖర్. మేము ముద్దుగా పెట్టుకున్నాము. మరి మీ నాన్న పేరు?"

"మా నాన్న పేరు డాడీ"

"డాడీ కాదు. డాడీ అంటే నాన్నే."

"ఏమోనుకి మా మమ్మీ చెప్పింది." అన్నది. ఆ పిల్లకు శ్రీపతిరావు అని చెప్పాలనిపించింది కాని, మాధవి హెచ్చరిక గుర్తుకు వచ్చింది.

"హంసా! మమ్మీ కావాలనుకుంటే డాడీని పూర్తిగా మరిచిపో."

మాధవి అంటే ఆ పసిమనసుకో దేవత. అందుకే శ్రీపతిరావు దంపతులను మరిచిపోయింది.

"హంసా! మీ డాడికేం పని?" రమేష్ అడిగాడు.

"నాకు తెలియదు మరి మీ డాడి?"

"మా డాడి వ్యవసాయం చేస్తారు. అదే... గ్రోయింగ్ రైస్, వెజిటబుల్స్." అన్నారు.

"రియల్లీ..." నవ్వింది హంస.

పెద్దవారి మధ్యకూడా చర్చలు జరుగుతున్నాయి. మాటల సందర్భంలో మాధవి పాపారావు కూతురని తెలిసింది.

"మరి చెప్పవేం? భలేదానివి, మా పాపన్న కూతురి వన్నమాట. మీ నాన్న నోట నీ గురించి విన్నానమ్మా. మరెప్పుడూ నీకు పెళ్ళి అయినట్లు చెప్పలేదేమమ్మా?" రంగనాయకమ్మ అడిగింది.

"బావుందమ్మా! అందరితో నీలాగే చెబుతా రేమిటి?" అన్నాడు నిష్ఠూరంగా.

"అదికాదు, ఉండరా. అబ్బాయి ఏం పని చేస్తా డమ్మా? ప్రేమ పెళ్ళి అయి ఉంటుందిలే. ఈ కాలంలో

అంపకూ చేసుకుంటున్నారు. మావాడిని అన్నాను, అలా యెవరినయినా..."

"అమ్మా!" ఆమె వాక్ ప్రవాహానికి అడ్డు పడింది.

"అయ్యో కష్టం, సుఖం..." అని ఇంకేదో అన బోయి, కొడుకు తీక్షణమైన చూపులకు ఆగిపోయింది.

"పదండి, మిమ్మల్ని పంపించి వస్తాను." అన్నాడు విష్ణు.

చంద్రశేఖరం గంభీరంగా ఉండిపోయాడు. కాంతం లేచి, బొట్టు పెట్టి, పూలమాల ఇచ్చింది.

"విష్ణువర్ధన్ గారూ! మీరు అనవసరంగా కంగారు పడ్డారు. పెద్దలు అడుగుతారు." అన్నది నవ్వుతూ.

"వీలున్నప్పుడు రామ్మా!"

"వచ్చేవారం నేను వెళ్ళిపోతున్నానమ్మా." అన్నది మాధవి.

"అయ్యో! మావాడు నువ్వు ఫలానా అని చెప్పలేదు, లేకపోతే హాయిగా భోజనానికే పిలిచి, రవికెలగుడ్డ తెప్పించే దాన్ని."

"ఇప్పుడేమయింది."

"మళ్ళీ వచ్చినప్పుడు పెడుదువుగానిలే" అన్నాడు.

వాళ్ళు బయటికి వచ్చాక హంస అందరికి "టా-టా"లు చెప్పింది. చంద్రశేఖరం పది రూపాయలిచ్చి ముద్దు పెట్టుకున్నాడు. "స్వీట్ కొనుక్కోమ్మా!"

"మమ్మీ..." ఇటు తిరిగి చూచింది.

"తీసుకుని, థ్యాంక్స్ చెప్పు" అన్నది.

"మాధవీ! ఈ అమ్మాయిని చూస్తే ఈ రోజే చూచినట్లు లేదమ్మా. పాత పరిచయంలా ఉంది" అన్నాడు.

"వదినపిల్లకదా, నిమిషంలో స్నేహం కలుపుకుంది" అన్నది నవ్వి. హంసను తీసుకుని ఇద్దరూ బస్ స్టాండుకు వచ్చారు.

"మమ్మీ, మా డాడీ పేరేమిటి? ఆయన ఏంచేస్తారు?"

"హంసా!" అరిచినట్లే పిలిచింది. ఆమె ముఖంలో రంగులు మారిపోయాయి.

"సారీ మమ్మీ... అయామ్ సారీ ...అదికాదు ఇందాక వాళ్ళు అడిగారు. మళ్ళీ రానడన్నా అడగకూడదేమోనని..." అన్నది.

"దట్స్ ఆల్ రైట్..." అన్నది గంభీరంగా. బస్ ఆలస్యంగా వచ్చింది. చీకటి పడిందని, విష్ణుకూడా బస్ యెక్కాడు.

"వద్దండి, వెళ్ళగలను!"

"మీరు వెళ్ళగలిగినా, మిమ్మల్ని ఒంటరిగా పంపి నేనుండలేను. అదికాక హంస తూలుతుంది" అని, నిదుర కళ్ళతో సోలిపోతున్న హంసను భుజంపై వేసుకున్నాడు.

"మీకు శ్రమ ఇచ్చాను"

"శ్రమ ఏముంది. ఇంటికి వెళ్తే పిచ్చిపట్టినట్లు ఉంటుంది, మా అమ్మ ఆరాటం గ్రహించారుగా. మా అన్నయ్య గాంభీర్యం, మా వదిన మెతకతనం విసుగ్గా ఉంటాయి. ఆ పిల్లలు లేకపోతే పిచ్చివాడిని అయ్యేవాడిని" అన్నాడు.

"మీ రెండో సంతోషంగా ఉంటున్నా రనుకుంటు న్నాను."

"నిజంగా అలాగే అనుకునేవాడిని. మా అన్నయ్య గాంభీర్యం చూచి, నా కాపురం అలా కాదు. ప్రతీ క్షణాం నవ్వుల పువ్వులు పండించుకుంటూ గడపాలని..."

యెవరో నెట్టటంతో ముందుకు జరిగాడు.

హైద్రాబాద్ చేరగానే, ఆమెను హోటల్‌కు తీసుకు వెళ్ళి హంసను పడుకోబెట్టాడు.

"గుడ్ నైట్ వస్తానండీ..."

"విష్ణుగారూ? మీరు సంస్కారవంతులు కాబట్టి నా గురించి తలెత్తిన ప్రశ్నలు దాస్తున్నారు. నాకు మీతో చెప్పి, హృదయ భారము దించుకోవాలనే ఉంది" అన్నది దిగులుగా.

"నాకేం అలాంటివి లేవండీ. మా అమ్మ చాదస్తాన్ని మీరు మన్నించాలి" అన్నాడు బయటికి వచ్చి. అతను లిఫ్ట్ వరకు వచ్చి వెనక్కు తిరిగాడు. ప్రపంచములోని దిగులంతా తల కెత్తుకున్నట్టు, యెటో చూస్తూ, ఒంటరితనాన్ని అన్నట్టు నిలబడిన మాధవిని చూస్తే అతనికి అడుగు ముందుకు పడ లేదు.

ఆమె నలా గుండెలకు హత్తుకుని "నీ దిగులేమిటో, నాకు చెప్పు" అని ఓదార్చాలని ఉంది. సగం, సగం నీటితో తడి అయ్యే ఆ కళ్ళను తనివితీరా ముద్దు పెట్టుకుని, నువ్వేం బాధపడకు. నీ బాధలు నా పరంచేసి నిశ్చింతగా ఉండు అనాలనిపించింది. తన భావావేశాన్ని అణుచుకున్నాడు.

"పదండి మాధవీ! మనకు భోజనం చేద్దాం. నాకు ఆకలిగా ఉంది" అన్నాడు.

"ష్యూర్..." వర్ష ఆమె కళ్ళు కాంతివంతం అయ్యాయి. ఆమె చక, చకా భోజనానికి ఆర్డర్ చేసింది.

"హంసకూడా లేకుంటే..."

"వద్దు లెండి. మీ ఇంట్లో టిఫిన్ బాగానే తిన్నాను" దుప్పటి సరిచేసింది. లైటు తీసి చిన్న లైటు వేసింది. వచ్చి, అతని ఎదురుగా కూర్చుందామె.

"ఇప్పుడు చెప్పండి హంస ఏమనుకుంటున్నారు?"

"మీ కూతురు మాత్రం కాదనుకుంటున్నాను" అన్నాడు.

"నిజం! ఎందుకలా అనుకున్నారు?"

"అది నా రహస్యం. మీకు చెప్పను" అన్నాడు నవ్వుతూ.

"మీ ఇష్టం. మీకున్న నమ్మకం మా నాన్నగారికి లేకపోయింది నాపైన" అన్నది నిట్టూరుస్తూ.

"ఆయన తరం వేరు..."

"నాకు మగపిల్లాడికి చెప్పించినట్టు చదువు చెప్పించారు కానీ. అంతమాత్రాన నాపైన సర్వ హక్కులు తనవే అనుకుంటే ఎలా?"

"అసలు ఏం జరిగిందండీ?"

"ఈ ప్రపంచంలో డబ్బుతోనే పనులు జరుగుతుంటాయి. డబ్బుతోనే గౌరవములా వుంది. పెడితే పెళ్ళి కోరటం, లేకపోతే చావు కోరటమూ!" అన్నది ఆవేశంగా.

అతను జాలిగా చూచాడు.

"నా కుటుంబం ఆర్థికంగా అట్టడుగున ఉన్నదని తెలుసు. అందుకే నా అన్నది వదులుకున్నాను. బయటి దేశాలకు

వెళ్ళి డబ్బు సంపాదించాను. అదే నా ధ్యేయంగా పెట్టుకున్నాను. అందరూ బాగుపడ్డారు. నేను కోరిందేమిటి? ఏ పరిస్థితులలో ఈ పాప బాధ్యత వహించానో అర్థం చేసుకొమ్మన్నారు" ఆమె గొంతు పూడుకుపోయింది.

"ఛ...ఛ...అచ్చమైన ఆడపిల్లనిపించారు"

"నిజమే, మానసికంగా బలహీనురాలిని..." కళ్ళు తుడుచుకుంది.

"తమాషా కన్నానులెండి. మనసు కలతచెంది భారం అయినప్పుడు కన్నీటి రూపంలో వెళ్ళిపోవటమే నయం" అన్నాడు, కుర్చీనుండి లేచి వచ్చి ఆమె కెదురుగా కూర్చుని.

"ఈ పాపను నా బాధ్యతపై ఒకరికి పెంపుడు ఇప్పించాను. వారు దాన్ని రాచి రంపాన పెడుతుంటే యెలా సహించను- తీసుకోక తప్పలేదు. నైతికంగా, సాంఘికంగా నా బాధ్యత" అన్నది.

"మంచిపని చేశారు"

"నాకయినా యెన్నాళ్ళని ఓపిక ఉంటుంది. అందుకే ఈ సంవత్సరం ప్రారంభం నుండి డబ్బు పంపడం మానేశాను."

"మంచి పని చేశారులెండి. డబ్బు వస్తూ, వస్తూ ఒక్కసారి ఆగిపోతే ఇబ్బందే - నిష్ఠూరం తప్పదు. ఆ సంగతి మీకు తెలుసు. నేను చెప్పవలసిన పని లేదు." అన్నాడు ఓదార్పుగా.

"నిజమే. అలా అక్కా చెల్లెండ్లు, వారి భర్తలు, నా తమ్ముడు, మరదలు అన్నా నాకు బాధ ఉండేది కాదండీ. మా నాన్న అంటున్నారు..." ఆమె కళ్ళు చెమర్చాయి.

ఆమె ఏర్‌లైన్స్ ఆఫీసుకు వచ్చింది. అక్కడ వివరాలు కనుక్కుంది.

“రేపు సాయంత్రం ఫ్లయిట్ తప్పితే, మళ్ళీ నెక్స్ట వీకే ఖాళీగా ఉందండీ. సోమవారంనుండి జరిగే ట్రేడ్ ఫేర్‌కు వెళ్తున్నారు జనం.”

ఆలోచించింది మధుని, ‘ఈ స్థితిలో హంసను ప్రయాణం చేయించటం మంచిదికాదు.

“ఓ. కె. నెక్స్ట వీక్ కన్‌ఫర్మ్ చేయండి” అన్నది. వాళ్ళకు వివరాలన్నీ వ్రాయించి వచ్చింది.

బయటికి వచ్చాక, స్నేహితురాండ్రు చెప్పిన లిస్ట్ గుర్తుకు వచ్చింది. ఒకరు గద్వాల్ చీర కొనివ్వమని అడిగారు. మరొకరు పోచంపల్లి చీర తెమ్మన్నారు. ఇంకొకరు వెంకటగిరి చీర ఆర్డర్ చేశారు.

బ్రాస్ వస్తువులు తెమ్మన్నారు, పర్స తీసి లిస్ట చూసుకుంది. లేపాక్షికి వెళ్ళి దొరికిన వస్తువులు కొన్నది. మనకోసం మనము కొనటం వేరు. ఇతరుల కోసం షాపింగ్ చెయ్యటం తలకాయనొప్పి. అభిరుచులు వేరు, అలంకారాలు వేరు.

పళ్ళు, బిస్కట్లు కొనుక్కుని, హోటల్‌కు తిరిగి వచ్చింది. బాయ్ వచ్చి, ఆమె చేతిలో ఉన్నవన్నీ తీసుకున్నాడు.

“ఎవరన్నా వచ్చారా బాయ్!”

“ఒక బాబు, పెద్దావిడ వచ్చి, ఇప్పుడు మీ కోసం అడిగింది. రేపు వస్తామని చెప్పారండి.” అన్నాడు.

రంగనాయకమ్మ కాదు కదా.

తలుపు తీసుకుని లోపలకు వెళ్ళింది. హంస ముడుచుకుని పడుకుంది. మూల్గుతుంది. బల్లమీద పొట్లాలు కనిపించాయి. తన తల్లి వచ్చిందని అర్థం అయింది మాధవికి.

"హంసా!" వెళ్ళి నుదురు తాకి చూచింది. కాలిపోతుంది ఆమె కంగారుగా అటు, ఇటు కుదిపింది. హంస కళ్ళు విప్పి చూచి మళ్ళీ మూసుకుంది.

బాయ్‌ను పంపించి, మైక్రోఫైరిన్ టాబ్లెట్ తెప్పించింది. మంచి నీళ్ళు ఒంపింది. వెళ్ళి హంసను లేపింది.

అంత జ్వరంలోను తీవ్రంగా త్రోసింది నీళ్ళు.

"హంసా!"

"నాకు మందు వద్దు ఆంటీ...నాకు మందు అక్కరలేదు. నేను చచ్చిపోవాలని ఉంది... నేను చచ్చిపోతాను..." అన్నది కాళ్ళు, చేతులు నేలకేసి కొడుతూ.

"హంసా..." గట్టిగా పట్టుకుని కడుపుకు హత్తుకుంది.

"ఏమిటి పాపా! ఏమయింది?"

"నాకు...నాకు మమ్మీ లేదు...డాడి లేదు నేను వెధవ పిల్లను...నిన్న శనిలా పట్టాను. చస్తే పీడా విరగడయిపోతుంది...." హంస శివమెత్తినట్టు అరుస్తూ బ్లాంకెట్టు, దిండు తన్నేసింది.

"హంసా !" ఆర్తిగా ఒక చేత్తో ఆమె కాళ్ళు నొక్కిపట్టింది.

"నేనే మీ అమ్మను తల్లీ..." అన్నది నుదురు ముద్దుపెట్టుకుని.

"ఊహు... కావు...మా మమ్మీ వెధవపని చేసి, పోయింది..." చటుక్కున హంస నోరు మూసింది.

"ఇంకొక్క మాట అన్నా నాపై ఒట్టే, ప్రామిస్..." అన్నది కోపంగా. ఆవేశం చల్లారి, ఆవేదన ఆవరించి నట్లు, ఏడుస్తూ మాధవి చేతుల్లో వాలిపోయింది పాప.

"హంసా! ఈ మందు వేసుకోవూ! నా బంగారు తల్లివి కదూ!"

"ఊహు! వేసుకోను..." మంచం చివరకు జరిగి వెక్కి, వెక్కి ఏడ్వసాగింది. మాధవి ముట్టుకుంటే ఉలిక్కి పడుతూ గల్లంతు చేస్తుంది.

"హంసా! చూడు నేను మీ మమ్మీని, ప్రమాణం చెయ్యాలా?" అన్నది అనునయంగా.

"యు ఆర్ లయింగ్!"

"నో! ప్రామిస్ పాపా...గాడ్ ప్రామిస్..."

"అయితే డాడి యెక్కడ ఉన్నారు?"

కరెంటు షాక్ తిన్నట్లుండిపోయింది. ఏం జవాబు చెబుతుంది.

"మాట్లాడవేం?... నాకు తెలుసు! నాకెవరూ లేరు..." అని మళ్ళీ ఏడ్వసాగింది.

తల్లిపై విపరీతమైన కోపం వచ్చింది. పసిపిల్లతో పరిహాసం ఆడటానికి మనసెలా ఒప్పిందో అర్థం కాలేదు. హంసకోసం ఇద్దరు ప్రాణమిచ్చే స్నేహితులను దూరం

చేసుకుంది. స్నేహితురాలిని వదులుకుంది. ఇప్పుడు హంస దూరమయితే తన బ్రతుక్కి అర్థంలేదు.

తండ్రితో ఘర్షణ పడిన రాత్రి అందరూ భోజనం చేశారు.

"శుక్రవారం పూట, నేను బ్రతికి ఉండగా ఉప వాసం చేస్తావా..." అని తండ్రి అనగానే తల్లికూడా ఎంగిలి పడింది. ఎవరెన్ని విధాలుగా చెప్పినా, "మా మమ్మీ తిననిదే నేను తినను" అంటూ మొండికేసి, మర్నాటి వరకు ఉపవాసం ఉన్న చిన్నారి పాప.

తన చిన్నారి చేతుల్తో తల పట్టిన బంగారు తల్లి. ఏం చెప్పి నమ్మించగలదు. విదేశాల్లో ఉండి అప్రయ త్నంగా భారతదేశంలో ఉన్నాడని అబద్ధం ఆడింది. ఇప్పు డేమని చెబుతుంది! ఒక్కటే మార్గం ఉంది.

"మీ డాడీ చనిపోయారు హంసా..." అని చెప్పాలి. అంతే, అంతకంటే మార్గం లేదు. అదే శాశ్వత పరి ష్కారం.

"హంసా..." మృదువుగా భుజం పట్టి తన వైపు తిప్పుకుంది.

"నేను... నేను మాట్లాడను పో..." పిడికిళ్ళు బిగించి, మాధవిని కొట్టసాగింది.

"ఏమిటి హంసా! గుడ్ గర్ల్స్ మమ్మీని కొడతారా?" అప్పుడే లోపలికి వచ్చిన విష్ణువర్ధన్ అడిగాడు.

"ఆమె మమ్మీ కాదు, నాకు మమ్మీ, డాడీ లేరు..." హిస్టీరియా వచ్చినదానిలా గింగిల లాడిపోయింది. ఆమెను పట్టుకున్నాడు విష్ణు "మైగాడ్! హై ఫీవర్..."

"అదేనండీ, మా అమ్మ చెల్లి కొడుకుతో వచ్చింది. ఏమేమన్నదో ఆ పసిమనసు గాయపడింది. సివియర్ షాక్" తల పట్టుకుంది మాధవి. అతను ఒక్క నిముషము ఆలోచించాడు.

"మొదట డాక్టరుకు చూపించాలి మాధవిగారూ!"

"ఇప్పుడెలా?" అన్నది. ఆ ఊర్లో డాక్టరు తెలియదు.

"ఒక్క నిముషం కూర్చోండి" అని అతను చెప్పి, ఎవరికో ఫోన్ చేశాడు.

"త్వరగా! హోటల్... రూమ్ నెంబరు... థాంక్స్..." ఫోన్ పెట్టేశాడు.

ఇంకా జ్వరం తీవ్రత హెచ్చింది. ఈసారి గాలిలో పిచ్చిగా చూస్తుంది హంస.

"నాకు... నాకు... నమ్మకం ఉంది... నువ్వు అంతా చెబుతావు... అబద్ధం... నో... ఉన్నాడు... నాకు డాడీ కావాలి... నువ్వు అమ్మ కాదు. నేను ఏమిటా చెప్తానా..." ఇలా అరుస్తూ, అరుస్తూ స్పృహ తప్పిపోయింది.

"హంసా..." ఆ పాప చేతులు నిమురుతూ మాధవి కంట తడి పెట్టింది.

"ఛ...ఛ... మీరు ఏడుస్తున్నారా?" అన్నాడేగాని హంస పరిస్థితి చూచి అతను అదిరిపోయాడు.

"దానికేమన్నా అయితే, నాకు మతిపోతుంది. నేను బ్రతుకలేను..." అన్నది మోకాళ్ళ మధ్య తల దాచుకుని.

అప్పుడే తలుపు తీసుకుని డాక్టర్ జగన్మోహన్ వచ్చాడు. ఇంకా హంస అరుస్తూనే ఉంది. అతను పరీక్ష చేస్తూ, ఆమె మాటలు శ్రద్ధగా విన్నాడు.

"సున్నితమైన చోట హార్ట్ అయింది. రేపు తెల్లవారే సరికి కోలుకోకపోతే నర్సింగ్ హోమ్‌లో చేర్పించుదాం."

"డాక్టరుగారూ..." మాధవి కళ్ళు నిండు కుండల్లా ఉన్నాయి.

"నో... నో... హై ఫీవర్ అంతే! ఉదయం వాంతులు, భేదులు అయ్యాయి అంటున్నారు కదా. బల హీనత" అన్నాడు ఓదార్పుగా. ఇంజక్షన్ చేసి, ఓ మాత్ర మింగించాడు. పది నిముషాలలో, నిశ్చలంగా పడుకుంది. నుదుట సన్నగా చెమట పట్టింది.

"బేబీకి ఫాదర్ లేరా?" తుండుకు చేతులు తుడుచు కుంటూ అడిగాడు.

మాధవి లేరన్నట్లు తలాడించింది.

"జ్వరం దిగేసరికి మరిచిపోవాలి. ఒకవేళ మరిచిపోక పోతే ఆ అమ్మాయి కోలుకునే వరకు మనమో తండ్రిని సంపాదించాలి. ఆ అవసరం రాదనుకుంటాను." అతను బ్యాగ్ తీసుకున్నాడు.

"మీ ఫీజు..." మాధవి పర్సు తీసింది.

"రేపుదయం తీసుకుంటాను. మీరేం వర్రీ అవకండి"

"థ్యాంక్స్ జగన్..."

"ఇది నా వృత్తి విష్ణూ..." నవ్వాడు అతను.

అతడిని పంపించి, భోజనం తెమ్మని చెప్పి వచ్చాడు.

"నాకు ఆకలి లేదండీ... నిజంగా..." మాధవి మొహమాట పడింది.

"హంస ప్రాణానికి నా ప్రాణం అన్నాను కదా. మీరు

ఉపవాసం ఉండటం అశుభం" అని అనునయించాడు. అతని బలవంతముపైన భోజనము పూర్తిచేసింది.

"అయిదారు గంటలు హంస నిదురబోతుంది—మీరేం కంగారు పడకండి. నేను మళ్ళీ ఆరు గంటలకు వస్తాను" అతను లేచాడు. ఆమె దిగులుగా చూచింది.

"మాధవీ! నేను ఉండేవాడిని. ఈరోజు మధ్యాహ్నం నుండి అమ్మకు బాగాలేదు. వదిన వాళ్ళు ఊరెళ్ళారు." అన్నాడు.

"అయ్యయ్యో! మీరు వెళ్ళండి. మీ దగ్గరలో ఎవరికయినా ఫోన్ ఉందా?" అన్నది.

"మా ప్రక్కనే ఉన్న లాయర్ గారింట్లో ఉన్నది కాని నంబరు నాకు గుర్తులేదు. ఇప్పుడు వెళ్ళి మీకు ఫోన్ చేసి, నంబరు చెబుతాను" అన్నాడు.

"మీకు శ్రమ ఇస్తున్నాను..."

"ఏం ఫరవాలేదు. మీరు కెన్నాళ్ళ నెప్పాలనే నాకో జాబ్ చూపెండి. మీ రుణం తీరిపోతుంది" అన్నాడు.

ఆమె వచ్చి హంస ప్రక్కన కూర్చుంది. ఈ అనుబంధాల కర్థం ఏమిటో అర్థం కాలేదు.

తల్లి అర్థరు వెతికి ఇచ్చేస్తే...

తను హంస లేకుండా బ్రతకగలదా! తన ఒంటరి జీవితంలో వెలిగిన వెలుగు. అందరూ తన సంతానాన్ని ఆదరించి గౌరవించేవారు. తను తినకపోతే గిల, గిల లాడుతుందా పసి హృదయం. తన కోసం ఏ త్యాగమయినా చెయ్యటానికి సిద్ధంగా ఉంటుంది.

ఆమె ఆలోచనలకు ఆనకట్ట అన్నట్టు ఫోన్ వచ్చింది.

"హల్లో...నేను విష్ణును...ఫోన్ నంబరు నోట్ చేసుకోండి...అమ్మకు అలాగే ఉంది. రేపొస్తాను"

ఎందుకో మొదటిసారి ఒక మగ గొంతుక వింటూ మైమరిచి పోయింది. ఎంత చక్కని గొంతు!

"మీరు కంట తడి పెడుతున్నారా...నో పాపకేం కాదు. పోనీ మీ అమ్మగార్ని పంపించనా!"

"వద్దు...వద్దు..." అన్నది కంగారుగా. అతను ఫోన్ పెట్టాడు.

ఆ రాత్రంతా కలత నిదురతో గడిపింది. మర్నాడు అతను అన్నట్టుగానే తెల్లవారేసరికి వచ్చాడు, ఫ్లాస్కుతో.

"హోటల్‌కు కాఫీ ఏమిటండీ?" అన్నది మాధవి.

"నేను కాఫీ చేస్తే అమృతం అంటుంది మా వదిన, నేను వివాహము చేసుకున్నా కాఫీ దగ్గర కలతలు వచ్చి విడిపోతామట." అన్నాడు ఉత్సాహంగా.

"అమ్మగారి కెలా ఉంది?"

"ఈ పూట కులాసాగానే ఉంది." అన్నాడు.

హంస మేలుకుంది. ఇద్దరిని అయోమయంగా చూచింది. మాధవి ముఖం కడిగించి, కాఫీ త్రాగించింది.

"మీరు ముఖం కడుక్కోండి. హంస దగ్గర నేను కూర్చుంటాను." అన్నాడు. మాధవి టవలు తీసుకుని బాత్ రూమ్‌లోకి వెళ్ళింది. ముఖం కడుక్కుని, వేడినీళ్ళు ముట్టుకోగానే స్నానం చెయ్యాలనిపించింది. అలసట, ఆయాసం తాత్కాలికంగా తీర్చేది ఒక్క స్నానం మాత్రమే.

బయటికి వెళ్తే మళ్ళీ డాక్టరు వస్తాడని స్నానము కూడా చేసి వచ్చేసరికి హంస విష్ణువర్ధన్ ఒడిలో కూర్చుని కబుర్లు చెబుతుంది.

ఇద్దరూ యెందుకో నవ్వుతున్నారు. అక్కడున్న పాంట్రీ షన్ దగ్గర బట్టలు మార్చేసుకుని వచ్చేసింది.

"గుడ్ మార్నింగ్ హంసా?"

"గుడ్ మార్నింగ్ మమ్మీ..." చటుక్కున లేచి, ఫ్లాస్కులోని కాఫీ ఒంపి ఇచ్చేసింది.

"థాంక్స్..." మాధవి కళ్ళు చమర్చాయి. కాఫీ త్రాగి, హంసకు బట్టలు మారుస్తుండగా డాక్టర్ జగన్ మోహన్ వచ్చాడు. అతను హంసను చూచి తృప్తిగా తల పంకించి, కొన్ని మందులు వ్రాసి ఇచ్చాడు.

"విష్ణూ! ఎల్లుండి నేను స్టేట్స్‌కు వెళ్తున్నాను. నాకు పెద్దగా ఇష్టం లేదు. మా తోడల్లుడు వెళ్ళాడు. స్నేహాకు, ఆమె తల్లి తండ్రులకు అదో స్వర్గం అన్న భావన ఉంది. మా వాళ్ళు అదే ఉద్దేశ్యంలో ఉన్నారు...." అన్నాడు నిట్టూరుస్తూ.

"ఇక్కడ మీకు సంపాదన లేక కష్టపడుతున్నారా?"

"లేదు. అయామ్ వెల్ ఆఫ్! మా వాళ్ళంతా పిసినీ, పిసినీ పండును చేసినట్టు నన్ను మెదలు వంచి, అంగీకరింప జేశారు. నేను నా ప్రాక్టీస్ వైండప్ చేయుటము లేదు." అన్నాడు.

"గుడ్, మీరక్కడ సంపాదించి ఏదయినా ఆస్పత్రి

యంత్ర సామాగ్రి తెచ్చి ఇక్కడ క్రొత్త క్రొత్త పద్ధతులూ ప్రవేశ పెట్టాలని కోరుకుంటాను" అన్నాడు.

అతనికి ఫీజు ఇచ్చి సాగనంపి వచ్చాడు.

"అమ్మా! నువ్వు దొంగవు..." అంటూ హంస మాధవి జుట్టంతా లేపింది.

మాధవికి అర్థం కాలేదు. ఆమె విష్ణువర్ధన్ వంక చూచింది.

"తరువాత చెప్తాను" అన్నట్టు కళ్ళతోనే వారించాడు. హంస హుషారుగా బ్రెడ్ తీసుకున్నది. మాధవి తెప్పించిన ఇడ్లీకూడా ఇద్దరు ఉపహారం చేశారు.

"మరి నేను వస్తాను మాధవీ. హంసా! మమ్మీని విసిగించవద్దు బి. ఎ గుడ్ గర్ల్."

"థాంక్స్...డా..." నోటికి చెయ్యి అడ్డం పెట్టుకుంది. ముసి, ముసిగా నవ్వుతూ "నీ సంగతి తెలుసులే" అన్నట్టు చూచింది మాధవి వంక.

మాధవి అర్థం గానట్టు చూచింది.

"సాయంత్రం వస్తాను" అని విష్ణువర్ధన్ వెళ్ళిపోయాడు. మాధవి హంసతో పాటు తను రెస్ట్ తీసుకుంది.

# 15

విష్ణువర్ధన్ మాధవికి షాపింగ్ చేయించి, మాటల్లో నింపి వచ్చేసరికి రంగనాయకమ్మ ముసుగుతన్ని పడుకుంది.

"అమ్మా...ఏమమ్మా! మళ్ళీ ఆయాసం వచ్చిందా?" ముసుగు తొలగించి చూచాడు.

ఆమె లేచి కూర్చుంది. ఆమె కన్నులు, బుగ్గ అదురుతున్నాయి.

అతను డాక్టరు దగ్గరకు వెళ్దామని లేచాడు.

"ఇదిగో..." ఆమె పిలిచింది. ఓ నీలం రంగు కవరు ఇచ్చింది. అతను దాన్ని తీసుకుని చదువుకున్నాడు.

"విష్ణూ!

మనము ప్రేమించుకుని వివాహం చేసుకుని ఒకటి కాలేకపోయాము. నేను విదేశాలకు వెళ్తున్నా. ఈ సందర్భములో ఒక్కటి కోరుతున్నాను మన పాప అనాథ కావద్దు. వాళ్ళు చెప్పే కట్టుకథలు నమ్మొద్దు. పాపను తీసుకోండి. స్నేహితురాలిగా మరొక్క కోరిక, మన్ను జీవితంలో స్థిరపడాలి. నా బెస్ట్ విషెస్ నీ కెప్పుడూ ఉంటాయి.

నీది కాలేని,

—నీ...స్నేహ..."

ఆ స్నేహ. అన్న చోట చెరిగిపోయింది. గ్రాస్తూ పడ్డిందేమో విష్ణు తల్లి దగ్గరగా వెళ్ళాడు.

"అమ్మా!..."

"నన్నేం పిలువవద్దు. నీ జీవితం నీదిరా. నేనెవర్ని? మీ కందరికి నేనో వైరిదాన్ని. నీ మందులకు, పళ్ళకు ముఖం వాచినదాన్ని" అన్నదామె.

"అసలేం జరిగిందమ్మా..."

"నోరుమూయ్ రా, నేను చెప్పాలట్రా! ఓ బిడ్డ ఉండి సిగ్గులేదు!"

"అమ్మా..." ఆర్తిగా తల్లి చెయ్యి పట్టుకున్నాడు.

"అమ్మ యెందుకురా! నీ అవసరాలు తీర్చలేదు. ఇంత వండి పెట్టటానికే కదా! ఓ కుర్రాడిని పెట్టుకున్నా చేస్తాడురా!" ఆమె ముఖం ఆవేశంతో ఎఱ్ఱబడిపోయింది.

ఆమె భావావేశానికి లోనయింది. ఒడి కినిపో సాగింది.

"అమ్మా!...ఇలా ఆవేశపడతావనే చెప్పలేదు. అన్నయ్యకంతా తెలుసు." అన్నాడు ఆమెను పట్టుకుని.

"అన్నన్నా! అన్నయ్య ఆత్మీయుడు. అమ్మ ఏం చేసింది! ఒక్తి మొద్దు, నీ కిళ్ళకు చాదస్తం మనిషి, అంతే కదురా..." ఆమె హిస్టీరియా వచ్చిన దానిలా ఊగి పోయింది.

"అమ్మా?...ప్లీజ్ నా మాట విను...ఆ అమ్మాయి నేను ఒక్క కులంవాళ్ళం కాదు. వాళ్ళ పెద్దలను, నీకు అభ్యంతరం ఉంటుంది మెల్లగా నచ్చ చెబుదాం అనుకున్నాను. ఒకరోజు ఆ అమ్మాయి నా గదికి వచ్చింది. ఆమెకు వేరే సంబంధం నిశ్చయం చేశారట..."

"నీవు చేసుకోవద్దా! అమ్మ నీ కోడలంటే కాదన్నానా అమ్మంటే యెంత గౌరవంరా...యెంత అభిమానము!" ఆమె అరుస్తూ కొడుకును దూరం నెట్టింది.

"అమ్మా! సువ్వంటే. గౌరవాభిమానాలు లేక

కాదమ్మా! చెప్పే అవకాశం రాందే. అప్పటికప్పుడే అమ్మాయిని తీసుకుని ఇంటికి వస్తే మీరు కాదంటారేమోనని భయం వేసింది. చదువు లేదు, ఉద్యోగం లేదు. 'విష్ణూ మనము వివాహం చేసుకుంటే, మా వాళ్ళు తప్పక ఆమోదిస్తారు.' అన్నది. ఆమె మాటలు నిజమే ననిపించాయి. దండలు మార్చుకుని ఓ స్నేహితుని గదిలో ఉన్నాము. వాళ్ళొచ్చి బ్రతిమాలారు. సాంప్రదాయ సిద్ధంగా వివాహం జరుగాలని నాకు డబ్బుకూడా ఇచ్చారు. అని ఆమెను వదిలి వేయటానికిచ్చే లంచం అని తెలియలేదు. ఆమె వెళ్ళాక తను తల్లిని కాబోతున్నానని ఒక ఉత్తరం వ్రాసింది..."

ఆమె వింటూ వింటూ విరుచుకు పడిపోయింది.

"అమ్మా!..." విష్ణువర్ధన్ మాటలాపి, ఆమెను ఎత్తి మంచంలో వేయబోయాడు. ఒక ప్రక్క సాంతం కొట్టుకోవటం మొదలు పెట్టింది. అతను కేకలు వేసి, చంద్రశేఖరాన్ని పిలిచాడు.

"హాస్పత్రిలో చేర్పించాలిరా" అన్నాడు.

"మొదట నేను డాక్టర్ను తీసుకు వస్తాను. అతను చేర్పించమంటే చేర్పిస్తాను" అని మోటార్ బైక్ తీశాడు.

అరగంట తరువాత డాక్టర్ వచ్చి రంగనాయకమ్మను పరీక్ష చేశాడు. అతని ముఖం గంభీరంగా మారిపోయింది.

"అబ్బ! చాలా సీరియస్ స్ట్రోక్! ఒకటి రెండు

రోజులు చూచి హాస్పత్రిలో చేర్పించుదాము." అన్నాడు డాక్టర్.

"డాక్టర్ గారూ!" వణికిపోయాడు విష్ణువర్ధన్.

"మిస్టర్ విష్ణు! అప్‌సెట్ కావద్దు, మన చేతనయిన సహాయం మనం చేద్దాము" అన్నాడు.

విష్ణు వణికిపోయాడు. హాస్పత్రికి వద్దంటే, తల్లి బ్రతకదని అర్థము. అతనికి ఒక్కసారి తన బాల్యం, తల్లీ తండ్రీ అపురూపంగా చూడటం గుర్తుకు వచ్చింది. రెండు చేతుల్లో ముఖం దాచుకున్నాడు.

"విష్ణు!" డాక్టర్‌ను పంపించి వచ్చిన చంద్రం అతని తలమీద చెయ్యివేశాడు, అతనికి కళ్ళలో నీరూరింది.

"అన్నయ్యా..." అనగలిగేడు.

"రిలాక్స్! వదిన దగ్గరకు మనిషిని పంపుతాను." అన్నాడు.

నోరు విప్పితే ఏడ్చేస్తానేమోనన్న భయం కల్గింది. అందుకే స్తబ్దంగా కూర్చుండిపోయాడు విష్ణు.

ఇద్దరికీ అరగంటలో ఆపరేషన్ అవసరం తెలిసి వచ్చింది. రంగనాయకమ్మ చీర మార్చవలసి వచ్చింది. తల్లే అయినా ఇద్దరూ ఇబ్బందిగా ఫీలయ్యారు.

చంద్రశేఖరం వెళ్ళి కాంతం దగ్గరకు మనిషిని పంపి వచ్చాడు.

ఆ రాత్రంతా ఇద్దరూ మేలుకునే కూర్చున్నారు. తెల్లవారేక, చంద్రమే కాఫీ కలిపి ఇచ్చాడు.

"విష్ణు బాబుగారికి ఫోనట" లాయరుగారి పని మనిషి వచ్చింది. విష్ణుకి తల్లి దగ్గరనుండి లేవాలని లేదు. తను లేస్తే ప్రాణం పోతుందేమోనని భయం పట్టుకుంది.

"అన్నయ్యా! మాధవిగారే అయి ఉంటారు. అమ్మ పరిస్థితి చెప్పు ఈరోజు తనను షాపింగ్‌కు తీసుకు వెళతానన్నాను" అన్నాడు.

"సరే..." చంద్రశేఖరం వెళ్ళిపోయాక తల్లి గుండెలపై తలవాల్చి పసి పిల్లాడిలా రోదించాడు విష్ణు.

"అమ్మా...నా కింత పెద్దశిక్ష వేయకమ్మా..." అన్నాడు గట్టిగా.

"ఊరుకోండి బాబూ! మా అత్త నాలుగేళ్ళు ఇలాగే బతికింది." ఇల్లు చిమ్ముతూ పనిమనిషి ఓదార్చింది.

అతను మాట్లాడలేదు. ఆమె అప్పుడప్పుడు కళ్ళు తెరిచినా చూపు నిలవటం లేదు.

చంద్రం వచ్చాడు.

"మాధవేరా! తను వస్తానంది. కాస్త నేను బయటకి వెళ్ళినా తోడు ఉంటుందని సరేనన్నాను." అన్నాడు.

విష్ణు ఏమీ మాట్లాడలేదు. అతను ఇప్పుడు ఏమీ ఆలోచించే స్థితిలో లేడు - అతని దృష్టంతా తల్లిమీదే ఉన్నది. తను ఆమె మరణానికి కారణం కాదు కదా!

'"ఏమో..." జవాబు వచ్చినట్లయి, ఉలిక్కి-పడ్డాడు

"నేను డాక్టరును తీసుకువస్తాను..." చంద్రం వెళ్ళిపోయాడు. పూజలూ పునస్కారాలూ అని తల్లిని, కాంతాన్ని వెక్కిరించే విష్ణు అప్రయత్నంగా చేతులు జోడించాడు.

"భగవంతుడా! నువ్వంటూ ఉంటే, నా నుండి ఏమయినా తీసుకో కాని, మా అమ్మని దూరం చెయ్యకు."

అతనలాగే కూర్చుని, మౌనంగా రోదిస్తుండగా, మాధవి హంసను తీసుకుని వచ్చింది.

"గ్రానీ కెలా ఉంది..." అంటూ పరుగున వచ్చి హంస విష్ణును కౌగలించుకున్నది.

విష్ణు జవాబు చెప్పలేకపోయాడు.

"ఒక్క రాత్రికే అంత దిగులుపడిపోయారా! భలే వారే." అన్నదికాని, ఆవిడను చూస్తుంటే మాధవి గుండెలో చెయ్యి పెట్టినట్టు అయింది.

మరోసారి బట్టలు మార్చి, పక్క దుప్పటి మార్చి పడుకోబెట్టారు.

ఇరుగు పొరుగులు, తెలిసినవారు వచ్చి వెళ్తున్నారు.

"అమ్మకు పక్షవాతమటగా!"

"ఆ పుణ్యాత్మురాలికి రావలసిన రోగమా!"

"రోగాలు బలహీనత వల్ల వస్తాయిగాని, పాప పుణ్యాలతో వస్తాయా!" ఇలా రకరకాలుగా అంటున్నారు.

మాధవి వింటుంది. ఆమెకు వంటింట్లోకెళ్ళి వంట చేయాలన్నా, చేయటం రాదు. తల్లి పని చెయ్యనిచ్చేది కాదు.

కొన్ని పనులు హంస చెయ్యగలదు.

"మాధవిగారూ! నా బాధలో ఉండి మిమ్మల్ని కాఫీ తాగమని కూడా అడగలేదు." అన్నాడు లేచి.

"కాఫీ, టిఫిన్ అయింది. ఏ మంత్రం వేశారోగాని, ఉత్సాహంగా ఉంది. ఆకలి ఒకటే గొడవ. మీరే ఏం తిన్నారో..."

"ఇప్పుడు ఆకలి లేదు మాధవీ?" అన్నాడు.

కాసేపటికి రంగనాయకమ్మ కళ్ళు తెరిచి, నిశ్శబ్దంగా చూసింది. తన ఎదుటి మనుష్యుల్ని గుర్తించే ప్రయత్నం చేసింది. విష్ణు ఉత్సాహంగా పైకి వంగాడు.

"అమ్మా... నేనమ్మా... విష్ణుని..."

జవాబుగా అతని మీద లేచిన కుడిచేయి వేసి నిమిరింది. ఆమె కళ్ళనుండి నీటుకారి, దిండులోకి ఇంకిపోయింది.

"నేను పాలు వెచ్చబెట్టుకు వస్తాను." మాధవి వంటింట్లోకి వెళ్ళింది. ఆమె మాట్లాడాలని వ్యర్థప్రయత్నం చేసింది. నోరు పడిపోయింది.

హంస స్పూన్‌తో నీళ్ళు పోసింది. విష్ణు చెవిలో ఏదో చెప్పి, అతను చెప్పింది విన్నది.

"నానమ్మా... నీళ్ళు మింగు..."

ఆమె గాజు కళ్ళలోకి ప్రాణం వచ్చింది. లేవబోయింది. విష్ణు వారించాడు.

ఉన్న ఒక్క చేత్తో హంసని దగ్గరకు తీసుకుంది.

"మళ్ళీ 'నాయనమ్మా' అని పిలువు హంసా!"

"నాయనమ్మా! నేనొచ్చేశాను. నీకేం భయంలేదు." అన్నది చిలుకలా.

మాధవి పాలు తెచ్చింది. స్పూన్‌తో త్రాగించింది. ఆమె కళ్ళలోని వెలుగు ఏమిటో మాధవికి అర్థం కాలేదు. మాటి, మాటికి ముగ్గురిని చూచుకున్నది.

'కొడుక్కు! ఇలా భార్యా బిడ్డలుంటే బావుండునని అనుకుంటుందా!' మాధవి ఆలోచనలో పడ్డది.

డాక్టర్ వచ్చి, మళ్ళీ ఇంజక్షన్ ఇచ్చి, వెళ్ళిపోయాడు.

"ఎనీ ఇంప్రూవ్‌మెంట్?" కంగారుగా డాక్టర్ వెంట వెళ్ళాడు విష్ణు. అతను విష్ణు భుజం తట్టి, చిన్నగా నవ్వాడు.

"ఈ పేషెంట్ల గురించి ఏమీ చెప్పలేము. బీ బోల్డ్..." అన్నాడు. విష్ణుకు భోరున ఏడ్వాలనిపించింది.

"డాక్టర్లు దేవుళ్ళు, నువ్వు స్నానం చేసిరా." అన్నాడు చంద్రం.

"వదిన ఇంకా రాలేదు..."

"ఆ ఊరినుండి బస్సులు రావు. లాకీలలో స్థలం దొరకాలి, రావాలి. ఇందాక డాక్టర్‌గారితో మాట్లాడాను. దినానికి ఇర్వై రూపాయలు తీసుకుని నర్సులు వస్తారట." అన్నాడు.

"అంత ఖర్చుతో నర్స్ యెందుకండీ. సాయంత్రం వరకు కాంతంగారు వచ్చేస్తారు. నేనున్నాను కదా." అన్నది మాధవి.

"నీకెందుకమ్మా శ్రమ!"

"శ్రమా? నా తల్లికి వస్తే చేసుకోనా!" అన్నది.

"మా మమ్మీకి వంటరాదు. మీకేం కావాలో నేను చేస్తాను." అన్నది హంస.

"అబ్బా! చాలా పెద్దదానివి అయ్యావమ్మా." చంద్రం హంస నెత్తుకుని ముద్దు పెట్టుకున్నాడు.

హంస అన్నమాట ఉత్తదికాదు. ఆమె కుర్చీలు తరిగిచ్చి, వంటింట్లో అస్తవ్యస్తంగా పడిన సామాన్లు సర్దిన తీరు చూస్తే అతను ఆశ్చర్యపోయాడు.

రంగనాయకమ్మ ముఖం ప్రశాంతంగా, తృప్తిగా కనిపించింది. మాధవిని, హంసను చెరో ప్రక్క కూర్చోమని సైగ చేసింది. వాళ్ళ చేతులు గుండెలమీద పెట్టుకున్నా రావిడ.

హంసపోసే నీళ్ళు అమృతంలా తాగారు. మాధవి, హంస భోజనం చేశాక, ఇద్దరన్నదమ్ములు భోజనానికి కూర్చున్నారు.

"రాత్రి పడిన ఆరాటం తగ్గిందిరా అమ్మ ముఖంలో." అన్నాడు చంద్రం.

విష్ణు తినటం ఆపాడు. అతని కళ్ళనిండుగా నీళ్ళు నిండాయి.

"ఆమె తృప్తికి కారణం వేరేఉంది. ఆమె నా గురించి అంతగా ఆలోచిస్తుందని తెలిస్తే, నేను వివాహము యెప్పుడో చేసుకునేవాడిని అన్నయ్యా...అమ్మను నేనే హత్య చేస్తున్నాను...నేనే..." ఒక్కసారి బరస్ట్ అయ్యాడు.

"నువ్వు మర్డర్ చెయ్యటం ఏమిట్రా." అతను తినటం ఆపి చూచాడు.

"అమ్మకాత్మహత్య ప్రయత్నం యెందుకో తెలుసా? హంస నా కూతురనుకుంటుంది. మాధవిని నేను ప్రేమించిన అమ్మాయి అనుకుంటుంది."

స్నేహ వ్రాసిన ఉత్తరం ఆమె చదవటం వివరంగా చెప్పాడు.

"ఓ...అదా సంగతి..." అతను ఆలోచనలో పడ్డాడు.

"అన్నయ్యా! అమ్మకు నయం కాగానే, మీరు యెవరో, ఒకర్ని చూడండి. నేను వివాహము చేసుకుంటాను." అన్నాడు.

చంద్రం మాట్లాడక, కంచంలో గీతలు గీస్తూ కూర్చున్నాడు.

"అసలు అమ్మకు హంస నీ కూతురన్న అనుమానం యెలా వచ్చింది?"

"ఆ అమ్మాయి 'మా డాడీ' అంటూ చెప్పింది." అని రెండు రోజుల క్రితం హంస ఎంత అప్‌సెట్ అయిందో చెప్పాడు.

"అప్పుడు ఆ అమ్మాయి మానసికంగా కోలుకోవాలని, నేనే తండ్రినని చెప్పాను." అన్నాడు.

"ఒక అబద్ధం యెంత అనర్థం తెస్తుందో ఊహించావా!"

"ఆ అబద్ధమే ఒక ప్రాణం రక్షిస్తుంది."

"నిజమేరా రేపు అమ్మాయి, నువ్వు చెప్పింది అబద్ధం అని గ్రహిస్తే..."

"ఆ క్షణంలో అంత దూరం ఆలోచించలేదు." అన్నాడు.

"మీరు త్వరగా రావాలి. నాయనమ్మ పిలుస్తుంది." హంస వచ్చి పిలిచింది.

చంద్రశేఖరం మైమరిచినట్టు చూచాడు. అతనికి ఆడపిల్లలంటే విపరీతమైన అభిమానం. ఆ సంగతి అందరికి తెలుసు, భోజనం ముగించి లేచారు.

## 16

రెండు రోజులుగా యెవరు పిలిచినా, లేవలేదు. విష్ణువర్ధన్. అతనికి తల్లి మరణం నమ్మశక్యంగా లేదు. అమృతమూర్తి అమ్మను తన చేతులతో నిప్పు పెట్టాడు. ఆఖరుసారిగా ఆమె చూచిన చూపు అతను మరిచిపోలేదు.

కాంతం కర్మకాండల గురించి చర్చిస్తుంది. మాధవి మెల్లగా గది గుమ్మం వరకు వచ్చింది. పెరిగిన గడ్డంతో, తరిగిన జీవకళతో, సర్వం పోగొట్టుకున్నట్టు కూర్చున్నాడు విష్ణు.

అతనిని హృదయానికి హత్తుకుని, నేను ఉన్నాను నీకు అని చెప్పబోయింది. అడుగు ముందుకు పడలేదు.

తనకు ఎందరో పురుషులతో స్నేహమున్నది. కాని తన ఈడు వాడయిన ఈ యువకుడు వచ్చినంత సన్నిహితంగా ఎవరూ రాలేదేమో అనిపిస్తుంది. అతను ఆమెను గమనించలేదు. పడక కుర్చీలో కూర్చుని, కళ్ళమీద చేయి వేసుకున్నాడు.

"విష్ణు!" ఆమె పిలుపు పెదవులు దాటి రాలేదు.

చేతిలో ఉప్మాప్లేటు, మరో చేత్తో మంచినీళ్ళ గ్లాసుతో వచ్చింది హంస.

"లేవండీ..." అవి అక్కడ కిటికీలో పెట్టి అతడిని లేపింది.

"నాకు ఆకలి లేదమ్మా."

"గుడ్ బాయిస్ పెద్దవాళ్ళు చెప్పినట్టు వినాలి. నేనే మీ అమ్మను" అన్నది ఆరిందానిలా.

"హంసా!" ఆ అమ్మాయిని హృదయానికి హత్తుకున్నాడు.

"అవును డాడీ ! నువ్వు తినకపోతే నేను తినను. అసలు ఎవరూ తినరు" అన్నది.

మాధవి ఉలిక్కిపడింది. 'ఇదేమిటి, ఈ పిల్ల డాడీ అంటుంది' అనుకుంది.

హంస పెట్టే ఉప్మా అతను ఆప్యాయంగా తిన్నాడు. ఆమె ఏదో అడగబోయింది. బయట గల్లంతు వినిపించింది.

"పాపన్నా! పాపన్న అంటూ ప్రాణం పెట్టేది బాబూ." అంటున్న తండ్రి గొంతు విని మాధవి స్థాణువు అయిపోయింది. ఆమెకు ఎటు పోవాలో తెలియలేదు.

"ఛీ... దిక్కు దివాణం లేనివారంతా కొంప లారుస్తారు."

"మవ్వా దిక్కు దివాణం లేనివాడివి తాతయ్యా! అదిగో చూస్తావా! మా అమ్మా, నాన్నా ఉన్నారు"

"ఉంటారు... ఉంటార్లే" అని పళ్ళు కొరుకుతూ వెళ్ళిపోయాడు.

"మాధవి ఆశ్చర్యపోయింది. హంస అంత ధీమాగా తండ్రి ఉన్నాడని చెబుతుంది. యెలా?

ఆమె విష్ణుని 'డాడీ' అని పిలవటం గుర్తుకువచ్చింది.

మొన్న జ్వరం వచ్చినప్పుడు హంసను కాపాడాలని తనే డాడీనని చెప్పలేదు కదా!

ఏమో... ఆమె అయోమయంగా చూచింది. మూడు నాలుగ్రోజులుగా వాళ్ళింట్లో వాళ్ళతోనే ఉన్నది. అన్న, తమ్ముల ప్రవర్తనలోగాని, నరే మాటల్లోగాని అశ్లీలము, అపశబ్దాలు ఇతరులను కించపరిచే మాటలు దొర్లవు. కేవలం హంస ప్రాణం రక్షించటానికే చెప్పి ఉంటారు. అతనికి ఏమన్నా డైవర్షన్ కావాలనిపించింది.

"విష్ణుగారూ!"

"రండి మీ నాన్నగారు వెళ్ళిపోయారా?" అతను లేచి మంచముమీద కూర్చుని, కుర్చీ చూపించాడు.

ఆమె వెళ్ళి కూర్చుంది.

"మనము విద్యావంతులం. చావుపుట్టుకలకు అర్థం తెలుసు. అలాంటప్పుడు ఇంత విచారించటం ఉచితం కాదేమో!"

"నిజమే... పుట్టిన ప్రతి మనిషి గిట్టక తప్పదని

తెలుసు. మా అమ్మ నన్ను పెంచి పెద్దచేసింది గాని నా సుందేం పొందలేదు. అదే నా బాధ..." అన్నాడు.

"ఆమె ఆయుష్షు మూడింది. అదృష్టవంతురాలు, పక్షవాతం వచ్చిన వారు, తీసుకుని, తీసుకుని ఇతరులను ఏడ్పించి వారు ఏడ్చి పోతారు" అన్నది.

"అలా అయినా నాకు నిసుకు కలిగేదేమో మాధవి గారూ!" అన్నాడు బాధగా.

"మీరలా బాధపడటం భావ్యం కాదు. ఆమె ఆత్మ శాంతించాలంటే మీరు ఉత్సాహంగా ఉండాలి."

"ఉండకేం జేస్తాను! నిన్నటి బాధ ఈనాడు లేదు. ఈనాటి ఆవేదన రేపుండదు." అన్నాడు నిట్టూరుస్తూ.

"మరుపే మనిషిని అన్ని వ్యథలు మరిపింపజేస్తుంది. మరి నేను హోటల్‌కు వెళ్ళిపోతాను." అన్నదామె.

"ఎలాగు మీకు సెలవుంది. అమ్మదినం అయ్యేవరకుంటే ఆమె సంతోషిస్తుంది. ఆఖరి నిముషంలో, మిమ్మల్ని, హంసను చూచి చాలా తృప్తిపడింది. ఆమె నన్ను ప్రేమించి, వదిలివేసిన యువతి మీరేనని అనుకుంది. నిజం చెప్పి, ఆమె మనసు కష్టపెట్టలేక పోయాను. నన్ను క్షమించండి..." అని తలెత్తి ఆమెకేసి సూటిగా చూచాడు.

ఆమె ముఖం ఎఱ్ఱగా కందిపోయింది. అవనత వదన అయి కూర్చుంది.

"క్షమార్పణ యెందుకు! మీ సహృదయతతో హంస బ్రతికింది." అన్నదామె.

"సారీ! ఆ విషయము మీకు చెబుదామంటే అవకా

శమే రాలేదు. ఆ పసిహృదయం గాయపడకుండా చెప్పక తప్పలేదు." అన్నాడు

"హంసకు వివరణ, ఆరాలు అక్కర్లేదు. మిమ్మల్ని కొన్నాళ్ళ రమ్మని ఆహ్వానించలేదా?" అన్నది నవ్వుతూ.

"ఆహ్వానించింది. మీ మమ్మీకి కోపంగా ఉంది. కోపం పోయి పిలిచినప్పుడు వస్తాను అని చెప్పాను. మరో రెండేళ్ళు పోతే నిజం గ్రహిస్తుంది." అన్నాడు.

"ఏమో! ఒక్కొక్కసారి విరక్తి కల్గుతుంది."

"మంచి చేసే వారికి నిందలు, నిష్ఠూరాలు తప్పవు. స్వార్థపరులే ఎప్పుడూ సుఖపడతారు. హంస ఇంట్లో ఉంటే ఎంతో నిండుగా ఉంది కాని, నల్గురు నాల్గురకాలు అనుకోవటం బాగుండదు. మీరు హోటల్‌కు వెళ్ళిపోండి." అన్నాడు. అతను కాస్త తేరుకున్నట్టు అనిపించాడు.

"మీకు బోరుగా ఉంటే వచ్చేయండి." అని తను లేచింది.

"చిత్రం ఏమిటంటే మా అన్నయ్య ఎవరితోను మాట్లాడడు. అలాంటిది హంసతో స్నేహం కలిపారు." అన్నాడు.

"దానికి కొత్త పాత లేదు."

"అలాంటి పిల్లలే దైవస్వరూపాలు." అని బయటికి వచ్చి, రమేష్‌ను వెంబటిచ్చి, మాధవిని హంసను పంపి వేశాడు.

నిజంగా చంద్రం చాలా బాధపడ్డాడు. కాని మాధవి క్షేమంగా ఉండాలంటే, ఆమె వెళ్ళిపోవటమే మంచి దనిపించింది.

మాధవి బస్సొస్తోందని వరకు వచ్చి, తిరిగి చూచింది. పెరిగిన గడ్డంతో తన ఆరవ ప్రాణం ఎవరో లాగేస్తున్నట్టు, బాధపడుతున్నట్టు అనిపించింది.

ఆమె మనసు గిలగిలలాడింది. నిట్టూర్చి, బస్ రాగానే ఎక్కింది. తను వెంట వచ్చిన రమేష్‌కు థాంక్స్ అని కూడా చెప్పలేదు. ఆ ఫార్మాలిటి హంస పూర్తి చేసింది.

"థాంక్యూ రమేష్..." చెయ్యూపింది.

ఇద్దరు హాస్టల్‌కు వచ్చారు. మాధవికి, మనసు విష్ణు వైపే లాగింది. మాటి మాటికి అతని చూపనే కళ్ళలో తిరుగ సాగింది. ఆమె అలా కూర్చుండిపోయింది.

హంస నౌకర్ని కేక వేసి, గది శుభ్రం చేయించింది.

"మమ్మీ! టీ త్రాగుతావా?"

"ఊఁ..." అన్నది అన్యమనస్కంగా. ఆమె మనస్సు అక్కడ దిగబడి పోయిందేమో ననిపించింది.

తన చుట్టూ ఆరాధిస్తూ తిరిగారు మధుకర్, వసంత్. వాళ్ళు దూరం అయితే ఇలా ఆరాట పడలేదు. కన్యగా టీనేజ్‌లో ఎందరో వెంటపడ్డారు. ఒక్కనాడూ చలించలేదు మనసు. ఈసారి మాత్రం ఎందుకో అతని సాన్నిధ్యం కోరుకుంటుంది.

టీ వచ్చింది. ఆమె టీ కప్పు తీసుకుంటే వెంటనే విష్ణు గుర్తుకు వచ్చాడు. అతను ఆగి, ఆగి ఒక్కొక్క సిప్ తీసుకుంటుంటే ఎంతో ఇష్టంగా త్రాగుతున్నాడనిపిస్తుంది.

"అబ్బబ్బ! సాసర్‌లో పోసుకుని, ఏమిటండీ, ఆ త్రాగటం! విషం మింగినట్టు" అంటాడు.

అతనికీ సమయాన దగ్గర ఉండాలి కాని సాంఘిక నియమాలను ఉల్లంఘించలేదు. సాయంత్రం అయిన దగ్గరనుంచీ, చీమ చిటుక్కుమన్నా, ఏ సరిపాటుగా విష్ణు వచ్చాడేమో అని చూడసాగింది. బావా శబ్దం అయినా కిటికీలో నుండి క్రిందికి చూచేది. ఆమెకే అర్థం కానటువంటి అయోమయ స్థితిలో పడిపోయింది, మాధవి. ఆమె మనసును అదుపులో పెట్టాలని చాలా ప్రయత్నించింది.

ఛీ! ఇంత బలహీనురాలవుతుందేమిటి? తన బాస్ తను మాట్లాడితే తరించి పోయినట్లు మాట్లాడతాడు. అతను ఆంగ్లేయుడు. మంచి రంగు, ఒడ్డూ, పొడుగూ, హోదా గల మనిషి. అయినా అతని సమక్షంలో రాయిలా ఉండిపోయింది. ఈ మామూలు యువకుడి పట్ల తానింతగా చలించి పోతుందేం! అతనితో మాట్లాడాలని, అతడిని చూడాలని అంతగా తహ, తహలాడి పోతుందేం?

ప్రతి క్షణం, ప్రతి నిముషం అతని రాకకోసం, ఎదురు చూచింది. ఈ పరిణామము ఎక్కడికి దారి తీస్తుంది? అతనికి తన పట్ల వసుమంత కూడా అభిమానం లేదని తెలుసు. అతన్ని ఆరాధించటం అర్థం లేని విషయమనీ తెలుసు.

డోర్ బెల్ కొట్టాడు.

ఉద్వేగంగా, ఉత్సాహంగా వెళ్ళి తలుపు తీసింది మాధవి.

"మరిచిపోయాను అమ్మగారూ! సాయంత్రం ఒక అమ్మగారొచ్చి ఈ క్యారియర్ ఇచ్చి వెళ్ళారు." అని ప్లేటు క్యారియర్ తీసి ఇచ్చాడు.

ఆ శౌభంగం పొందినట్టు, క్యారియర్ తీసుకుని లోపలకు వచ్చింది.

"హంసా! అమ్మమ్మ ఏదో పంపింది చూడు" అన్నది, బల్లమీద క్యారియర్ పెడుతూ.

"నాకేం వద్దు మమ్మీ! ఆమె నన్ను ఎందుకు తిట్టాలి?" అన్నది అభిమానంగా.

"హంసా! నాకు కోపం వచ్చి నిన్ను తిడతాను నేను చేసింది తినవా?" అన్నది నవ్వుతూ.

"తింటాను నువ్వు...నువ్వు...మా మమ్మీవి"

"మా మమ్మీ కూడా విసుగ్గా ఉండి నిన్ను తిట్టింది ఫర్‌గివ్."

"ఓ...కే..." అన్నది.

క్యారియర్ విప్పింది. అరిసెలు, పులిహోర ఉన్నాయి.

"అరిసెలు పాతకాలపు వంటకం అంటారుగాని, నాకు చాల ఇష్టం." అన్న విష్ణు కామెంటు గుర్తుకువచ్చింది. అరిసెలు తీసి పెట్టింది. హంస తింటుంటే వచ్చి కూర్చుంది. తల్లి చనిపోయి జైలులో ఉన్నవాడిని రాలేదనుకోవటం మూర్ఖత్వం అని నవ్వుకుంది. ఆమె పేపర్ తిరగ వేస్తుంటే ఫ్లాట్స్ అమ్మకానికి అడ్వర్‌టైజ్‌మెంటు కనిపించింది.

తండ్రి తల్లి కష్టపడుతుండగా వాళ్ళకో ఇల్లు కొనాలని తనకు వచ్చిన అరవై రెండువేల గ్రాట్యుటీ అలాగే ఉంచింది. కొన్ని ప్రావిడెన్స్ చెక్స్ కూడా ఉన్నాయి. కొనుక్కుంటే! అప్పుడు మంచిదే. డబ్బు విలువ పెరగటం లేదు గాని, వస్తువుల విలువ పెరుగుతుంది.

అయినా ఒక్కసారి విష్ణువర్ధన్‌ను అడగాలి అనుకుంది. ఆమె ఆ రాత్రి నిదురపోలేక పోయింది. మర్నాడు లేస్తూ, స్లాట్స్‌వారికి ఫోన్ చేసి అప్లికేషన్ పంపమని చెప్పింది. బ్రేక్‌ఫాస్ట్ చేసి పడుకుని కళ్ళు మూసుకుంది. హంస, ఆరిందానిలా పెట్టెలు సర్దుతుంది.

"మమ్మీ... ఓ మమ్మీ..."

"ఏమిటే నీ గొడవ..." అన్నది కళ్ళు విప్పకుండానే.

"ఇదిగో... ఎవరొచ్చారో చూడు..."

"ఎవరు...?" కళ్ళు విప్పిన మాధవి కళ్ళు కాంతివంతం అయ్యాయి. హంస నెత్తుకున్న విష్ణువర్ధన్ నిల్చున్నాడు.

"హల్లో! మైల అనికూడా ఆలోచించకుండా వచ్చేశాడు అనుకుంటున్నారా! సారీ హంస ఏదో మంత్రం వేసింది. ఆ అమ్మాయిని చూడలేకపోతే బ్రతుకలేమో అనిపించింది." అని రెండు బుగ్గలు ముద్దు పెట్టుకున్నాడు.

"మిమ్మల్ని చూడలేకపోతే బ్రతుకలేనేమో, అని అనిపిస్తుందని" చెప్పబోయి మానేసింది.

"ఏమిటలా చూస్తున్నారు. ఉదయం ఏ చిన్న శబ్దం అయినా మీరు హంసతో వస్తున్నారేమోనని చూశాను." అన్నాడు నిజాయితీగా. ఇద్దరికీ ఒకేలాంటి అనుభూతి కలుగటం ఆశ్చర్యం అనిపించింది.

"రండి. కూర్చోండి. నేను రావాలనుకున్నాను గాని, మీ విచారంలో, నా పోరు తోడవుతుందని రాలేదు."

"విచారమా! అప్పుడే మరచిపోయాను లెండి, పదిన

వెళ్ళి కొన్ని సరుకులు తెమ్మన్నది. న్యాయంగా అయితే వచ్చేవాడిని కాదు. ఈ హంస లాగిందనుకోండి" అన్నాడు.

'మీకోసం అంటే ఆ హాయి ఎంత మధురంగా ఉండేది.' అనుకుంది.

"నేను ఈ అపార్ట్‌మెంట్స్ తీసుకుందామనుకున్నాను. మీ అభిప్రాయం చెప్పండి." అన్నది వార్తా పత్రికలో ప్రకటన చూపిస్తూ.

"ఐడియా బావుంది. వెంటనే తీసుకోండి" అన్నాడు.

అతనికి, తనకు భోజనం తెప్పించింది. అతనికి అరి సెలు పెట్టింది. అతను కుర్చీలో వాలి మాధవి వంక చూచాడు.

"నేనొక మాట చెప్పేదా?"

"ఏమిటి?"

"హంసను వదిలేసి వెళ్ళకూడదమ్మా! నా కెందుకో ఆ అమ్మాయి వెళ్ళిపోతుందంటే దిగులుగా ఉంది." అన్నాడు.

"మరి నేను మాత్రం ఉండగలనా! నా కేదయినా ఉద్యోగం చూడండి, ఇక్కడే ఉండిపోతాను." అన్నది.

"మీరు పరిహాసానికి అన్నా, అంత జీతం ఇక్కడ ఇస్తారా! పదో వంతుకూడా రాదు." అన్నాడు నవ్వుతూ.

"నాకు జీతం రావాలి, అధికారిణి కావాలని వెళ్ళలేదు..."

"ఐనో...మీ కుటుంబాన్ని ఆదుకోవాలని వెళ్ళారు. మరి నేను వస్తాను. రేపు మీరు రాకూడదా!" అన్నాడు.

"అలాగే..." అతను మరి కానేపుంటే బావుండేది

అనిపించింది. హంసి ఏవో కబుర్లు చెబుతూ అతడిని క్రింది వరకు సాగనంపి వచ్చింది.

అతను పైకిచూచి, చేయూపాడు. ఆమె గుండె లయ తప్పింది.

# 17

"విష్ణు నెందుకీ నిర్ణయానికి వచ్చారో అర్థం కావడంలేదు" అన్నాడు విష్ణుచరణ్ సీరియస్‌గా.

మాధవి జవాబు చెప్పలేదు. ఆమె స్పష్టంగా, 'నిజమైన కారణము చెప్పాలంటే మిమ్మల్ని చూడనిదే ఉండలేను' అని చెప్పాలి.

"చూడండి విష్ణూ! నాకు డబ్బు సంపాదించాలన్న కోరిక లేదు. అలాంటప్పుడు వెళ్ళి అక్కడేం చేస్తాను!" అన్నది.

"మరోసారి ఆలోచించండి."

"ఆలోచించాల్సిందేం లేదు. మీరు ఊఁ అంటే ఆచరణలో పెట్టటమే. మాటల్లో చాలా అవుతుంది. ఎక్కడయినా ఓ చిన్న పోర్షన్ చూస్తే మారిపోతాను. నా ఫ్లాట్ దొరికితే, అప్పుడే షిఫ్ట్ చేస్తాను." అన్నదామె.

"సరే, హంసకు జూన్ వరకు సెలవులే ఇంకో విషయం మాధవీ!" అన్నాడు దిగులుగా.

"ఏమిటి?"

"అన్నయ్య వాటాకు వచ్చిన పొలం కంపెనీ వాళ్ళు తీసుకున్నారు. రెండు లక్షల రూపాయలు వచ్చాయి." అన్నాడు.

"మరింకేం? సంతోషించక విచారిస్తారేం?"

"అన్నయ్య నిజామాబాద్ డిస్ట్రిక్ట్‌లో పొలం కొంటు న్నారు, వెళ్ళిపోతారట." అన్నాడు దిగుల్గా.

"వెళ్ళితే వెళ్ళనీ, రోజూ నేను వస్తానుగా" అన్నది హంస.

విష్ణు పాపను హృదయానికి హత్తుకున్నాడు.

మాధవికి ఏం చెప్పాలో తోచలేదు. ఇబ్బందిగా కదిలింది.

"నా పొలం చేసుకోండన్నయ్యా! వచ్చిన డబ్బు బ్యాంకులో వేస్తే వడ్డీ వస్తుందని యెంత చెప్పినా వినటం లేదు." అన్నాడు.

"అతని ఇందువిద్యుయాలిటి దెబ్బ తింటుందని కాబోలు." అన్నది.

"నాకు మాత్రం చాలా దిగులుగా ఉంది" అన్నాడు.

"జూన్ వరకు వెళ్ళరేమోలెండి" అన్నది మాధవి.

"నాకు...నాకు ఎడారిలో నిలబడినట్టుంది మాధవీ..." అన్నాడు దిగులుగా.

ఆమె హృదయం ఆర్ద్రమయింది. అప్రయత్నంగా ఆమె చేయి అతని తలపై పడింది. అతనామె చెయ్యిపై తన చెయివేసి, నిమురుతూ కళ్ళు మూసుకున్నాడు.

"మాధవీ! ప్రతిస్త్రీలోను మాతృత్వం, మమకారం పొంగి పొర్లుతుందేమో! అమ్మచేయిలాగే యెంత చల్లగా ఉంది." అన్నాడు.

మాధవికి కోపంరాలేదు. పురుషుడిలో ఒక పైత్యం దాగిఉంటుంది. పదేళ్ళ పిల్ల దగ్గరనుండి, అరవైఏళ్ళ మనిషి

వరకు, అతని శృంగార వస్తువుగా కనిపిస్తుంది. వయసులో ఉన్న స్త్రీలో మాతృత్వం దర్శించిన పురుషుడు మహనీయుడే అనుకుంది.

మర్నాడు చంద్రశేఖరంతో ఈ విషయము ప్రస్తావించారు.

"ఉద్దేశం బావుందమ్మా! నేను వీలయినంత తొందరగా వెళ్ళిపోదామనుకుంటున్నాను. నీకు అభ్యంతరం లేకపోతే ఇక్కడ ఉండవచ్చు." అన్నాడు చంద్రం.

"అభ్యంతరం యెందుకండీ! అదృష్టంగా భావిస్తాను"

"అది కాదమ్మా ఆధునిక సౌకర్యాలు లేవు" అన్నాడాయన.

"నేను నా ఫ్లాట్ దొరకగానే వెళ్ళిపోతాను." అన్నదామె.

"నీ కభ్యంతరం లేకపోతే అలాగే ఉండు. మా ముగ్గురు కోతులకు ఓ పనిమనిషిని కుదురుస్తాను, వంటకు." అన్నాడు.

"అయ్యో! మనిషి యేందుకండీ, నేను వంట చేస్తాను." అన్నది హంస. అందరూ నవ్వారు.

"మీ నాన్నగారు కట్టించిన ఇల్లు నీదే కదమ్మా! బాగా ఆలోచించి, వేరే ఇల్లు తీసుకో. ఇవన్నీ త్రెంచుకుంటే తెగే బంధాలు కావు." అన్నాడు.

"వాళ్ళు త్రెంచుకు పోతుంటే నేను ముడివేయనా!" అన్నది కాస్త హర్ట్ అయి..

"ఛ...ఛ... ఆ ఉద్దేశంతో అనలేదమ్మా, మనము

నల్గురు నాల్గురకాలు మాట్లాడే అవకాశం యెందుకివ్వాలని, అంతే!" అన్నాడు.

మర్నాడే మాధవి వెళ్ళి విష్ణు పనిచేసే వ్యవసాయాభివృద్ధి కేంద్రం మేనేజర్ని కలుసుకుంది.

అతను ఆమె క్వాలిఫికేషన్స్, పనిచేసే పద్ధతి చాలా మెచ్చుకున్నాడు.

"మీరు అప్లికేషన్ ఇవ్వండి, అవకాశము ఉన్నప్పుడు నేను చెబుతాను." అన్నాడు అతను. అప్లికేషన్ ఇచ్చి, వచ్చేసింది. ఆమె వచ్చేసరికి ఒక గది, హాలు ఖాళీ చేయించింది కాంతం.

"మాధవీ, వంట సామాన్లు కొనుక్కు, మా ఇంట్లోవి వాడుకో." అన్నది కాంతం.

మాధవి దగ్గరలో ఓ ప్రయివేటు కంపెనీలో మూడు వందల రూపాయలకు చేరింది. ఆమెకు డబ్బుల గురించి కాదు సమస్య. కాలక్షేపం కావాలి. యెవరో కొత్తగా పెట్టిన బడిలో హంసను చేర్పించింది.

"అయ్యో! అయ్యో! ఇదేం పొయ్యేకాలమే తల్లీ, ఫారిన్ కంట్రీలో ఉద్యోగం దొరుకుతుందా?" పాపారావు భార్యతో వచ్చి తలబాదుకున్నాడు.

మాధవి నీరసంగా నవ్వింది.

"చూడవే నీ కూతురి నవ్వు! బాబూ విష్ణూ, మందలించి మంచి మార్గములో పెడతావనుకుంటే ఇదేం పని బాబూ! మూడు, నాలు వేల జీతం వదిలిపెట్టి, మూడు వందలకు పనిచేయటమా!" అన్నాడు.

"ఆవిడేం చిన్న పాపాయి కాదండీ. ఆవిడ ఇల్లు

కావాలంటే అన్నయ్యే తను ఉండరు వెళుతున్నారు కాబట్టి, ఇచ్చారు." అన్నాడు. ఎప్పటి ఉత్సాహం, ఉద్రిక్తత కనిపించలేదా కంఠములో, గంభీరంగా చెప్పాడు.

"మీరు ఇల్లు ఇచ్చారని కాదు బాబూ! తనకు ఎవరు లేరన్న బాధయెందుకు! తమ్ముడిని దత్తత చేసుకొంటున్నాను." అన్నాడు.

విష్ణు తీక్షణంగా చూచాడు అతనివంక. తన కొడుకును దత్తత చేసుకొంటున్నాడే తప్ప వివాహము చేసుకొమ్మని, తనకంటూ ఓ జీవితం ఏర్పరచుకొమ్మని చెప్పడు. ఎంత చిత్రమైన తండ్రి!

"మధూ!, నీ మనసులో మాట చెప్పు తల్లీ! ఇలా మోడులా బ్రతకటం నాకు నరకమే." తల్లి ఏడ్చింది.

"నువ్వు...నువ్వు చేసిన గారాభమే నే."

"మధు, నేనేం చేశాను!"

"మీరిద్దరూ పోట్లాడుకోవద్దు. ఎవరేం చెయ్య నక్కరలేదు. నేను మీ కేం హాని చెయ్యలేదు. నా బ్రతుకు నేను బ్రతుకుతున్నాను. దయచేసి నన్నిలా ఉండనివ్వండి." అన్నది మాధవి.

"ఒంటరిగ్గా ఇలా ఉంటావా తల్లీ!"

"అంత నాసుభూతి ఉంటే, తమ్ముడికి వివాహ మయింది, భార్య ఉంది. మీరు వచ్చి ఉండండి." అన్నది.

"తప్పుతుందా మరి..." అన్నారు పాపారావు. ఈ విషయం ఇంత త్వరగా అంగీకరిస్తారని అనుకోని మాధవి, విష్ణు, ఇద్దరూ తెల్లబోయారు.

"ఏవో, కావల్సిన సామాన్లు తెచ్చుకుంటాము." అని లేచాడు పాపారావు.

వాళ్ళను పంపించి, ఆలోచనలో పడిపోయారు ఇద్దరూ.

"మీవాళ్ళు ఇంత త్వరగా అంగీకరిస్తారనుకోలేదు మాధవీ?"

"అదే నాకు ఆశ్చర్యంగా ఉంది విష్ణు!" అన్నది.

మరో వారం రోజులలో చంద్రం వెళ్ళిపోయాడు భార్యతో. విష్ణు, ఇద్దరి పిల్లలతో ఉండిపోయాడు.

మాధవికి గమ్మత్తుగా ఉంది. ఒక్క నిముషం ఆలస్యం కాకుండా స్వంత కార్లో వెళ్ళి వచ్చేసేది. ఇప్పుడు బస్సుకోసం యెదురుచూస్తూ, వెళ్ళి రావటం, అలసటగా పడి దొర్లటం అవుతుంది. తల్లి సమయానికి వంటచేసి పెడుతూ, మిగిలిన పనులు చూసుకుంటుంది కాబట్టి సరిపోయింది.

సాయంత్రం వచ్చి, తల్లి ఇచ్చిన కాఫీ త్రాగింది.

"హంస ఏది?"

"హంస, కోకిలంటూ నువ్వో ఆరాటపడతావు, ఆ పిల్లది ఇరవైనాల్గు గంటలు ప్రక్కింట్లో ఉండాలను కుంటుంది." అన్నది తల్లి.

"అలా అని వాళ్ళమీద వదిలివేస్తామా! హంసా... హంసా..." గట్టిగా కేకలు వేసింది.

"ఏమిటి మమ్మీ?" హంస బిక్కున చూస్తూ వచ్చింది.

"మన ఇల్లులేదా! అక్కడేం చేస్తున్నావ్?"

"చదువుకుంటున్నాను మమ్మీ!" అన్నది.

"వచ్చి ఇంట్లో చదువుకో..." అన్నది కోపంగా.

హంసవచ్చి, వరండాలో కూర్చుంది.

"అవునే అమ్మాయ్! నీవు ఇక్కడే ఉండపోతే నీ కారు, సామాను ఏమవుతుంది?" అన్నది తల్లి.

"ఒక స్నేహితునికి వ్రాశాను, అమ్మి పంపించమని."

"ఏమాత్రం వస్తుందో..."

"పాతిక వేలు రావచ్చు. కారుకు మాత్రం కచ్చితంగా పద్దెనిమిది, ఇరవై వేలు వస్తాయి." అన్నది.

"చూడు మధూ! చిన్నది, ఏదో చదువుకున్నా తని ఆ స్తి పాస్తులు చూడలేదు. ఓ ఫ్లాటు కొనుక్కుంటా నందే..." అన్నది దీనంగా.

"నీ ముఖం! ఒక ఇంటికిచ్చిన పిల్లను అనన్నా క్తే మనము నెత్తిన గుడ్డేసుకు పోతాము. అబ్బాయి మేడమీద గదులు వేస్తానంటున్నాడు. అది కడితే, రేపు నీకయినా వాడేకదా." అన్నాడు, తండ్రి. మాధవికి అక్కడ ఉండా లంటే అసహ్యము వేసింది. ఇదేం తల్లి, తండ్రులు! లేచి విష్ణు ఇంట్లోకి వచ్చింది. అతను పేపర్ తిరగవేస్తున్నాడు.

"రండి మాధవీ...రండి. మీరు వచ్చారు కానేపు హస్కు కొడదామనుకున్నాను. మీ నాన్నగారు ప్రతీ నిమిషం కులం గుర్తుచేస్తారు." అన్నాడు.

"మా నాన్నగారి మాటలకు హర్ట్ అయితే రావటం మానేస్తారు, నేనేం చేయాలి?" అప్రయత్నంగా ఆమె కళ్ళల్లో నీళ్ళూరాయి. అక్కడున్న కుర్చీలో కూర్చుని, మోచేతితో ముఖం దాచుకుంది.

"మాధవీ!"

ఇంత గంభీరంగా ఆడలక్షణాల కతీతంగా ఉన్న మాధవికూడా ఏడుస్తుంటే విచిత్రమనిపించింది.

అతను పేపర్ బల్లమీద పడవేసి లేచి వచ్చాడు. ఆమె తల ఎత్తుతూ ఓదార్చాడు.

"ఏం జరిగింది?...మాధవీ, ఇటు చూడండి."

"సారీ!" మృదువుగా అతని చేతులు తొలగించి, కళ్ళు ఒత్తుకుంది.

"మీలో మీరు బాధపడితే యెలా?"

"నేనెందుకు బ్రతకాలో అర్థం కావటంలేదు. ప్రతి నిముషం, ప్రతిక్షణం నాదంటూ ఏం లేదు ఇతరులకోసం బ్రతకాలని గుర్తుచేస్తారు తల్లి తండ్రులు." అన్నది ఆవేదనగా.

"మాధవీ! వారు మీ దగ్గర వచ్చి ఉంటామని అన్న నాడే, ఈ సమస్యలు వస్తాయని ఊహించాను. కొత్తగా వచ్చిందేం లేదుకదా." అన్నాడు.

"నిజమే? కాని యెంత నిరాశ కలుగుతుందో చెప్ప లేను. యెవరికోసం బ్రతకాలో అర్థంకాదు."

"ప్రతి నిముషం మీ కోసం అలమటించే ఓ పసి హృదయం ఉందని. మరిచిపోకండి..." అని ఆమెతో మాట్లాడుతూనే కాఫీ కలిపి తెచ్చాడు.

ఆమె సిగ్గుగా కాఫీ తీసుకుంది. తనకు ఇలాంటి పనులు అంతగా రావు.

"నేనో సలహా చెబుతాను వింటారా."

"చెప్పండి." అన్నది కాఫీ సిప్ చేస్తూ.

"మీరు ఈ వాతావరణంలో ఉండలేరు. హాయిగా కారులో తిరిగిన మీరు బస్సులో వెళ్తుంటే, నాకే బాధగా ఉంది. ఓ నెలరోజులుపోతే మీరే విసుక్కొని వెళ్తారను కున్నాను. మీరు కెన్యా వెళ్ళిపొండి." అన్నాడు.

"వెళ్ళలేను..." అన్నది తల వంచుకొని. ఆమె అతను తనను చేతులమీదుగా మోసుకు వచ్చిన సంగతి మరిచి పోలేక పోతుంది. అది సుమధురమైన మనోహర ఘట్టంలా ఊహించుకుంటుంది.

"మీరు హంస గురించి నేనన్న మాటలు సీరియస్‌గా తీసుకున్నట్లున్నారు. మీకు ప్రయాణం ఏర్పాట్లు చేస్తాను."

"విష్ణుగారూ! ఏ బాధలోనయినా కాస్త శాంతి దొరికేదిక్కడే." అన్నది గొణుక్కున్నట్లు.

"మీ ఇష్టం." అన్నాడు.

"మీరు నన్ను సిల్లీ అనుకుంటున్నారేమో, బయటి వారిలా ప్రవర్తిస్తే బాధకలుగదు. కాని పూజనీయమైన వ్యక్తి ఇలా ప్రవర్తించటం చాలా బాధగా ఉంది." అన్నది.

"ఈ విషయంలో మా అమ్మ నిజంగా అమ్మకు నిర్వ చనం చెప్పింది మాధవిగారూ..." అన్నాడు విచారంగా. అతని కళ్ళు తడి అయ్యాయి.

అతను రెట్టించి మీకిక్కడ మనఃశ్శాంతెలా దొరుకు తుందని అడిగితే "మీ సమక్షంలో" అని చెబుదాం అనుకుంది.

అతను రెట్టించలేదు, ఆమె జవాబు చెప్పలేదు.

"ఆంటీ, మీరు హంసను మా ఇంట్లో వదిలివేయ

కూడదు. మీ అమ్మగారూ..." ఏదో సాగదీయబోయాడు, సురేష్.

"సూరీ..." తీక్షణంగా చూచాడు విష్ణు. అతను మాట్లాడక వెళ్ళిపోయాడు.

"అమ్మా మధూ, చిన్న చెల్లెలు వచ్చిందే..." సంబరంగా చెప్పింది తల్లి.

"వస్తాను విష్ణుగారూ!" మాధవి వచ్చేసింది బయటికి. చెల్లెలు యెంతో ప్రేమగా తన కొడుకును మాధవి వడిలో వేసింది.

"మా ఇంట్లో అందరూ వీడినిచూచి అసూయపడతారే అక్కయ్యా! పెద్దమ్మకు ముద్దులకొడుకు, అంటూ." అన్నది తనే నవ్వుతూ. తనకా పిల్లాడి దగ్గర అసలు చనువే లేదు. పసివాడు భయపడి తల్లిమీదికి ప్రాకాడు.

"అక్కయ్యా! నాన్నకు మగపిల్లడంటే యెంత ప్రీతో ప్రత్యే నెత్తిన పెడతారని ఆశ, కాబోలు. నీవు పంపిన డబ్బంతా కొడుక్కి ఇల్లుకట్టాడే..." ఉపోద్ఘాతం లేకుండా ఉపన్యాసం మొదలుపెట్టింది చెల్లెలు.

"మనమంటే అమ్మకు ప్రేమ - సరిపోయిందిగా..." అన్నది చెల్లెలిమాట కొట్టిపారేస్తూ.

"అమ్మప్రేమ అప్పడాలు, వడియాల వరకేనే." అన్నది తనూ నవ్వుతూ, పుష్పలత.

మాధవికి దూరంగా కూర్చుని, ఒంటరిగా చూస్తున్న హంస కనిపించింది. ఆ పిల్ల ముఖంలో దైన్యం కొట్టవచ్చినట్టు కనిపించింది.

"హంసా!"

"మమ్మీ!" ఆ పిలుపుకోసమే యెదురుచూస్తున్నటు వచ్చి మాధవి వడిలో దూరిపోయింది.

అది చూడగానే ఇంట్లోవారి అందరి హృదయాలు భగ్గుమన్నాయి. మాధవికూడా ఓ నిర్ణయానికి వచ్చింది.

"చిన్నీ!" చెల్లెల్ని పిలిచింది. ఆమె ఏమిటోనని దగ్గరగా వచ్చింది.

"హంసా! వెళ్ళి సురేష్ వాళ్ళతో ఆడుకో." అని హంసను పంపింది.

"ఏమిటో అక్కా! ఈ లంపటం నెత్తిన యెత్తుకున్నావు. మీ అత్తగారిట్లో అంతా ఈ పిల్ల నీ కూతురే అన్నారనుకో. కాని నేను నమ్మలేదు. మీనురిది అంతే..."

మాధవికి మండిపోయింది. తన తరువాత పుట్టినది, తనను బ్లాక్ మేల్ చేస్తుంది, యెంత జాణతనం. తనెందుకు లొంగిపోవాలి.

"చూడు చిన్నీ! నువ్వు నమ్మినా నాకేం నష్టంలేదు. ఒక్క విషయము స్పష్టంగా చెప్పాలి. ఇకమీదట కుటుంబ సభ్యులకు నా డబ్బు ఇవ్వను." అన్నది.

"ఆ దిక్కుమాలిన ముండకిస్తావా?" గయ్యమంది చెల్లెలు.

"మాటలు చాలా సభ్యతగా మాట్లాడుతున్నావే! నాకువద్దా? నా డబ్బుతో ఓ చిన్న ఫ్లాట్ కొనుక్కుంటున్నాను. ఇక్కడ వచ్చే జీతంతో అద్దెలు కట్టలేను"

"అంత కష్టపడుతూ ఇక్కడుండమని యెవడు ఏడ్చాడు."

"అది నా స్వవిషయం..."

మాధవికి నవ్వు వచ్చింది.

కాసేపు గుసుప్రులు, గుసగుసలు వినిపించాయి. ఆ తరువాత పాపారావు మెల్లగా గదిలోకి వచ్చాడు.

"మధూ! రిజిస్ట్రేషన్ ఎప్పుడు?" అన్నాడు చురుకుగా.

"తెలియదు."

"యెవరిపేర చేయించాలనుకుంటున్నావ్ ?"

"నా పేర" అన్నది త్రుంచేస్తున్నట్లు.

"రేపు మళ్ళీ నువ్వు ఫారిన్ వెళ్తే, గిత్తే ఓనర్‌షిప్ గొడవలు రావూ" అన్నాడు.

"నేనెక్కడికి వెళ్ళను" అన్నది తల యెత్తకుండానే. అతనేం చెబుతాడో కూడా తెలుసు. అందుకే తనే జవాబు చెప్పింది.

"నాన్నా! మిమ్మల్ని యెవరు చూచినా, చూడక పోయినా, మీరు కన్న పిల్లలున్నారు. నాకు డబ్బు, ఆస్తి గాని ఉండాలి కదా!" అన్నది వెటకారంగా.

అతను ఏదో పెద్ద జోకయినట్టు నవ్వాడు.

"నీ తమ్ముడు నీవాడు కాడా! పిచ్చితల్లి అలాంటి ఆలోచనలు పెట్టుకోకు."

"నాన్నా!-ఇప్పుడది చర్చించాల్సిన విషయం కాదు. దయచేసి నన్ను ఒంటరిగా వదలి వేయండి" అన్నది బ్రతిమాలుతూ.

"సరేనమ్మా! మేము, మా మాటలు ఇప్పుడు కాక పోయినా ఇంకా కొన్నాళ్ళకు అర్థం అవుతాయి" అని నిట్టూర్చాడు.

పెద్ద చెల్లెలు వచ్చి తన గోడు వెళ్ళబోసుకుంది.

రూపాయలు వరకు జీతం వస్తుంది. కంపెనీ ప్రెమిసెస్‌లో చిన్న క్వార్టర్‌లో అలాట్ చేశారు. అది ఖాళీ కావటానికి రెండు నెలలు పడుతుందట. అయినా ఫరవాలేదు అన్నది. మొదటి వారమంతా బస్సు ప్రయాణం చేసి, రెండు రోజులు లేటుగా వెళ్ళింది. ఆ రూట్‌లో కంపెనీ వెహికల్ వెళ్ళదట.

"ఈసారి ఇద్దరం ఉన్నాముగా - రమ్మంటాను." అన్నాడు విష్ణువర్ధన్.

అతను అప్లికేషన్ ఇవ్వగానే అంగీకరించారు. ఇప్పుడు మాధవికి హాయిగా ఉంది. తల్లి, తండ్రికి మంచి జాబ్ దొరికిందని చెప్పింది గాని ఎక్కడని చెప్పలేదు. జీతం ఎంతని చెప్పలేదు. ఆమెను రోజుకు, రోజు హంస చిక్కి, నల్లబడటం, మూడీగా మారిపోవటం గమనించింది.

"అమ్మా! హంస తిండి తింటుందా?" అని అడిగింది.

"తినకేమిచే తల్లీ, నా కంటే ఎక్కువే తింటుంది. ఆ తిండి ఎక్కడికి పోతుందో." అన్నది తల్లి.

"ఒకసారి డాక్టర్‌కు చూపించమ్మా."

"తప్పుతుందా సరి..." అన్నది.

ఆ నెల ప్రోగ్రసు చూచి, మాధవి లసకోపం నిగ్రహించుకోలేకపోయింది. ఏనాడు చేయి చేసుకోనిది ఒడా, పెడా వాయించేసింది.

అందరి పిల్లలలా ఏడ్చి గగ్గోలు పెడితే ఉలిక్కి పడేదేమో కాని, గంభీరంగా ఉండిపోయిన హంసను చూచి మకి రెచ్చిపోయింది.

పాపారావు, భార్య చూచారు కాని ఒక్కమాట అనలేదు. వరండాలో కూర్చున్న విష్ణు హృదయం గిల, గిల

లాడింది. ఆ అమ్మాయి ఒంటిపై పడిన ప్రతి దెబ్బ తనకే తాకినంతగా బాధపడ్డాడు.

"మాధవీ...మాధవినిగారూ ?" అంటూ, వెళ్ళి ఆమె రెక్క పట్టి ఆపాడు.

"మీకే పసిపిల్లవు అవుతున్నావు" అన్నాడు. అతని కళ్ళల్లో ఎఱ్ఱ జీరలు చూచి కదలిపోయింది.

"దాని...దాని మార్కులు చూడండి." అన్నది, ఆవేశంగా.

"మీరు ఆవేశపడితే మార్కులు వస్తాయా?" అన్నాడు చురుకుగా.

మాధవిని వదలి, రాయిలా నిలబడిన హంసను దగ్గరగా తీసుకుని, గట్టిగా హృదయానికి హత్తుకున్నాడు.

"డాడీ..." ఒక్కసారి, ఆనకట్ట తెగిన వరదలా వచ్చింది హంసకు దుఃఖము.

"హంసా! ఊరుకోమ్మా, ఊరుకో..." అని ఊరడించాడు.

మాధవి సిగ్గుగా తల వంచుకున్నది.

"నన్ను...నన్ను క్షమించండి..." అని మంచంపై పడి చాలాసేపు అలాగే పడుకుంది.

"పాడుసంత... పాడుతద్దినం..." అంటూ తిడుతుంది తల్లి.

చాలాసేపటికి వచ్చి పిలిచింది తల్లి.

"అన్నం తిందువుగాని లేమ్మా" అన్నది. తొమ్మిది వందలకు పైన జీతం అనేసరికి తల్లిదండ్రులకు చాలా శ్రద్ధ పెరిగింది.

"హంస తిన్నదా?"

"ఏమో! ఆయనగారు ఎప్పుడూ నాళ్ళూరుగా, పిల్లలు లేని... ఒంటరితే" అన్నది రోషంగా.

మాధవి లేచి ప్రక్క వాటాలోకి వచ్చింది. నల్గురు భోజనానికి కూర్చున్నారు.

"హంసా! తినమ్మా"

"మా మమ్మీ తిన్నదో లేదో, అమ్మమ్మగారు తిననీయరు." అంటుంది.

"నాన్నా! భోజనం చేయండి, తరువాత వెళ్దాం."

"ఊహూఁ! మమ్మీతోనే తింటాను..." అని లేచింది హంస. మాధవి అక్కడున్న బీరువా ఆసరా చేసుకుని నిలబడింది. మౌనంగా ఇద్దరూ ఇంట్లోకి వచ్చి భోజనం చేశారు. మాధవి హృదయం అల్లకల్లోలం అయింది. తను కమలకంటే ఏ విధంగా గొప్పది?

మధ్యాహ్నం ఆఫీసులో కూడా సరిగ్గా పని చేయలేకపోయింది. మధ్యాహ్నమే పర్మిషన్ తీసుకుని వచ్చింది. హాల్లోని దృశ్యం చూసి ఆగిపోయింది. హంస పాపారావు కాళ్ళు పడుతుంది.

"ఒసేఁ హంసా! తాతయ్యగారి కాళ్ళు పట్టడం కాగానే అంట్లు తోమెయ్యి" అని ఆజ్ఞాపిస్తూ అటు తిరిగింది పెద్దావిడ.

"అమ్మమ్మా! పరీక్ష ఉంది పూట"

"ఇప్పుడు పరీక్ష పాసయి ఉద్ధరించేదేం లేదు కాని కాస్త గట్టిగా నొక్కవే. దున్నపోతులా తింటుంది. రెక్కల్లో సత్తువ లేదు." అంటున్నాడు పాపారావు.

"ఇంకా కాదు తాతయ్యా! పరీక్ష కాగానే వస్తాను."

"ఒళ్ళు బలిసిందా!" అంతే మూటలా వచ్చి ఇవతల పడింది హంస. పాపారావు నిర్దాక్షిణ్యంగా తన్నాడు.

"ఈ పీడా ఎప్పుడు విరగడ అవుతుందో ఏమో! పాడు సంత... హాయిగా అందరం ఒకచోట పడిఉండేవారం..." అంటుంది తల్లి.

"ఇలాగే తన్ని కసుర్లు పొడిస్తే ఎక్కువ రోజులు బ్రతుకదు లేమ్మా..." అని హంసను లేపింది. హంస ఏడ్వటం లేదు - మొద్దులా లేచి నిలబడింది. అది మరింత కలచి వేసింది మాధవిని.

"అది కాదు మధూ!"

"వద్దమ్మా... ఇంకేం చెప్పొద్దు ప్లీజ్... హంసకు బట్టలు మార్చి ఓ గ్లాసు పాలు ఇచ్చింది.

"హంసా! వెళ్ళి పరీక్ష వ్రాయి" అని పంపింది.

"మమ్మీ! కిస్ మి..." అన్నప్పుడు తల బాదుకోవాలనిపించింది. హంసను పంపించి వచ్చేసింది. గబ, గబ సూట్ కేస్ తీసి, హంస బట్టలు సర్దింది.

"ఏమిటే ఆ కోపం! ఏమైందని?"

"మీ ఎవరిపైన కోపం లేదమ్మా! కన్నతల్లి ఉన్నా తల్లిని కాదని, ఏదో ఉద్ధరించాలని తెచ్చి, అనవసరంగా దాన్ని చంపటం దేనికి? వాళ్ళమ్మకు అప్పగిస్తాను."

"ఆఁ... తల్లి ఉందా! ఇంకా నీకు పుట్టిన పిల్లేనన్న అనుమానం వస్తుంది సుమా..." అన్నాడు పాపారావు.

"నాన్నా! మీ రింకేం మాట్లాడకండి. నా పిల్లను నా నీవు కాళ్ళు పట్టించుకుంటావు. నా కంటికి ఏం వద్దు. నా

చివరి ఊపిరివరకు మీ కోసమే బ్రతుకుతాను. చాలా"
అన్నది కోపంగా.

"పరాయి పిల్లకోసం మమ్మల్ని ఇన్ని మాట లంటావా ?"

"పరాయిదయినా ఆ పసిపిల్లకున్న అభిమానము ఎవరికి ఉన్నది. 'మమ్మీ తినండేలినను' అంటుంది. మమ్మికి కాఫీ కావాలంటుంది. స్వంత తమ్ముడే, ఇన్నాళ్ళయింది నేను వచ్చి 'అక్కా చచ్చావా, బ్రతికావా' అని అడిగాడా! లేదు. ఇద్దరు చెల్లెళ్ళు వస్తే వారి అవసరాల కోసము వచ్చారు. చాలమ్మా, చాలు సన్యసించటానికి ఇంతకంటే కారణాలు అనవసరము" అన్నది కోపంగా.

"చిన్న పిల్లతో ఏమిటి పంతం ?" పాపారావుకు మంటగా ఉంది. మొదటిలా మొత్తం డబ్బు ఇవ్వటంలేదు - నాల్గు వందలు ఇచ్చి ఇల్లు గడపమంటుంది.

"నేను పుట్టాక వాళ్ళు పుట్టారు. చచ్చేవరకు వారు చిన్నవారే, నేను పెద్దదాన్నే..." అన్నది. ఆమెకు చాలా బాధగా ఉంది. జీవితంలో ఒక్క సత్యం తెలిసింది. దురభిమానం పెంచుకున్న మనుషులకు, తల కోసి పీటవేసినా తన అభిమానం సంపాదించలేము.

నాల్గు గంటలకు హంస రాగానే ప్రయాణం అయింది.

"యెక్కడికి మమ్మీ ?"

"నా ఫ్రెండ్ దగ్గర కొన్నాళ్ళుండు హంసా! ఆ తరువాత హాస్టల్‌లో ఉందువుగాని..." అన్నది.

"మమ్మీ! మళ్ళీ మనం మన ఊరు వెళ్ళిపోదాం, రెడ్ రోజ్ ఫ్లాట్స్‌లో ఉందాము." అన్నది.

"చూద్దాం..." అన్నది. వాళ్ళిద్దరూ బయలుదేరుతుండగా విష్ణువర్ధన్ ఎదురుగా వచ్చాడు.

అతను ఇద్దరినీ మార్చి, మార్చి చూశాడు. అడగటం సభ్యత కాదని ఊరుకున్నాడు.

"మేము మమ్మీ ఫ్రెండ్ ఇంటికి వెళ్తున్నాము." అని, హంస అతని చేయి అందుకుని ముద్దు పెట్టుకుంది.

"అవును విష్ణుగారూ! నేను సరిగ్గా చూసుకోలేనప్పుడు కొట్టటానికి, తిట్టటానికి ఇక్కడ ఉంచటం దేనికి? వాళ్ళ వాళ్ళకు అప్పగించేస్తాను" అన్నది అతి మెల్లగా, అతని దగ్గరగా జరిగి, అతనికే వినిపించేలా.

అతను ఒక్క నిముషం తెల్లబోయాడు.

"మీరలాంటి నిర్ణయానికి ఎందుకు వచ్చారు." అన్నాడు.

"నన్ను క్షమించండి. ఇంతకంటే మార్గం కనిపించటం లేదు? ఆ పాపను చంపేసే ఉసురు నేను పెట్టుకోలేను" అన్నది బాధాంతరంగా కన్నీరు అదిమిపెట్టి.

"సారీ..." అతను లోపలికి వెళ్ళిపోయాడు. ఆమె హంసను తీసుకుని బస్ స్టాండుకు వచ్చింది. బస్ రద్దీగా ఉంది.

ఇద్దరూ ప్రియ ఉండే ఇంటికి వెళ్ళారు. ప్రియ అత్తగారే ఎదురు వచ్చారు.

"సుప్రియా... సుప్రియా... నువ్వేనా!"

"అవునండీ - నమస్కారం." చేతులు జోడించింది.

"రామ్మా! అంతా కులాసా!"

"అంతా కులాసేనండీ, ప్రేమ ఉత్తరాలు వస్తున్నాయా?"

"వాళ్ళిప్పుడు గుర్తున్నప్పుడు వ్రాస్తారమ్మా! పాప నీ కూతురా!"

"ఊఁ..." అన్నది. అప్పటి విషయాలు అత్తగారికి తెలియవు.

"స్నేహలత అడ్రసు కావాలండీ."

"స్నేహలత సంక్రాంతికి రాస్తుందమ్మా! స్విట్జర్లాండులోనో ఎక్కడో ఉంటున్నారు." అన్నది.

"స్నేహలత ఈ ఊళ్ళో లేదా?" విస్మయంగా అడిగింది మాధవి.

"లేదమ్మా! నెలయిందో, రెండు నెలలు అయిందో అమెరికాకు వెళ్ళారు. ఆ అబ్బాయి కిష్టంలేదు. వీళ్ళంతా పోరి, పోరి పంపించారు." అన్నది.

మాధవికి ఎందుకో తలపైనుండి పెద్ద భారం దించినట్టు అనిపించింది. తేలికగా నిట్టూర్చింది.

"ఏం పెళ్ళిళ్ళో, ఏదో మా ఏయపురాలు పోయింది. తండ్రి ఇక్కడ ఉంటేనని, తీసుకు వెళ్ళారు. మా అబ్బాయి నువ్వెళ్ళి రమ్మన్నాడు. కాని ఈ దేశంలో ఉన్న వింతలే చూడలేదు- ఇక అమెరికానా" అన్నది. మాధవి చటుక్కున లేచింది.

"వస్తానండీ" నమస్కరించింది.

"ఉంటావమ్మా! కాఫీ తాగి పోదువుగాని, నొప్పు మా అనుకుంటాము. మా ప్రేమ స్నేహితురాలంటే మంచిపిల్ల,

వెహికల్‌కు స్టాండువేసి వచ్చిన విష్ణువర్ధన్ చప్పున ఆమె చేతిలోని హాంసనెత్తి భుజాన వేసుకున్నాడు.

"మీరు..." ఆశ్చర్యంగా చూచింది.

"మీరు హాంసను వదిలివచ్చేస్తే, అప్‌సెట్ మూడ్‌లో ఉంటారని..." అన్నాడు సూట్‌కేసుకూడా అందుకుని

"విష్ణు!" అస్పష్టంగా గొణిగింది. ఆ క్షణంలో వెళ్ళి అతడిని పెనవేసుకుపోవాలనిపించింది.

'ఐ లవ్ యూ!...లైక్ యూ!' అనాలనిపించింది. అతను సూట్‌కేసును వెనకసీటుకు ఆన్చి, తాడుతో కట్టాడు.

"రండి..." అన్నాడు. ఆమెకు హాంసను ఇచ్చి, మోటార్ వెహికల్ స్టార్ట్ చేశాక, ఆమె ఎక్కి కూర్చుంది.

"ఏమయింది?"

"వాళ్ళు లేరు" అన్నది ముక్తసరిగా. తనే చొరవచేసి తనహృదయం అతని ముందుంచాలి. ఎలా...! ఎలా!

"దిగండి." అన్నాడు.

అప్పుడే ఇల్లువచ్చిందా? లేదు వెళ్ళలేదు. ఆ శూన్యంలో ఉండలేను. ఒకరి కోసం ఒకరు చేసే త్యాగంలో ఇంత హాయి ఉంటుందా! ఆ ప్రయాణం అలా సాగితే.

"ఏమిటి మీరు అక్కడే కూర్చుంటారా?" అన్నాడు వెనక్కి తిరిగి సన్నగా నవ్వుతూ.

ఆమె దిగింది. ఆమెకు అప్పుడే, అక్కడే తేల్చు

కోవాలి. ఒకవేళ అతను కాకున్నా, బాధపడరాదు అనుకుంది. తను అడిగిన అందరికీ చెప్పి సుసంస్కారి కాదు.

"విష్ణూ! ఒక్కమాట..."

"మీరు ఏంచెప్పినా వింటాను. హంసను తిరిగి తెచ్చారు, అదే పదివేలు. భవిష్యత్తులో ఎప్పుడయినా నా హంసను వదులుకోవాలనే ఊహ వస్తే నా దగ్గర వదిలి వేయండి" అన్నాడు.

ఆమె కళ్ళు పెద్దవి చేసి చూసింది.

"అవును మాధవీ! క్రొత్తవారికి నా అనుభూతులు చెబితే అపార్థం చేసుకుంటారు." అన్నాడు.

"నిజమే విష్ణూ! నిర్వచించలేనివి, ఊహించని అనుభూతులు కొన్ని ఉన్నాయి..."

ఆమె మాట పూర్తికాకముందే సురేష్ వచ్చాడు.

"బాబాయ్! అమ్మా, నాన్న వచ్చారు - నీకోసం చూస్తున్నారు." అన్నాడు రహస్యంగా.

"అలాగా!" అతను సైకిల్ను స్టాండు వేసి, లోపలికి నడిచాడు. అతని వెనుకే హంసను తీసుకుని మాధవి నడిచింది. హంసను మంచంపై పడుకోబెట్టింది.

"బాగున్నావా మాధవీ! కంగ్రాచ్యులేషన్స్. నీకు మంచి జాబ్ వచ్చిందటగా" అన్నాడు చంద్రం.

"థాంక్స్! మీ తమ్ముడిగారి చలవే" అన్నది నవ్వుతూ.

"హంసను వదిలి వస్తానని అన్నారు పాపారావు గారు..." అన్నాడు.

"నిజమా మాధవీ! ఎక్కడో వదిలేసామల్లు నా శివయ్యమ్మా, తోచక చస్తున్నాను." అన్నది కాంతం.

"అది కాదండీ" జరిగింది స్పష్టంగా చెప్పింది మాధవి.

"అప్పుడటమ్మా! ఎన్నోసార్లు అన్నం రమేష్ తెట్టాడట" అన్నది కాంతం.

"పోనీలేమ్మా! నీ మంచికే వాళ్ళు లేరేమో! కాంతం వడ్డించు" అన్నాడు.

"నేను వెళ్తానండి." లేచింది మాధవి.

"ఆ ఊరినుండి కొబ్బెరతో బొబ్బట్లు, పులిహోర తెచ్చింది మా శ్రీమతిగారు. నువ్వు తినకపోతే రాత్రంతా శివరాత్రే." అన్నాడు.

అందరూ నవ్వారు.

అందరూ కూర్చున్నారు. కాంతం వడ్డించింది.

"నువ్వూ కూర్చోరాదు! మళ్ళీ ఒంటరిగా ఎందుకు?" అన్నాడు చంద్రం. రమేష్ ఆశ్చర్యంగా చూచాడు.

"బాబాయ్! నాన్నారు మొన్నారా కదూ?" గుస గుసగా అడిగాడు రమేష్ విష్ణుని.

"విష్ణూ! నిజామాబాదులో మన దూరపు బంధువు ఒకాయన కలిశాడు. అతని కూతురు. బియస్సీ. చదివి అట. అమ్మాయి బాగానే ఉంటుంది. నిన్ను అడిగి ఉత్తరం రాస్తా నన్నాను." అన్నాడు.

విష్ణు ముఖం గంభీరంగా మారింది.

"ఏమయ్యా సురేష్! పెళ్ళి చేస్తానన్నావు - ఉరి తీస్తానన లేదు." కాంతం అన్నది.

మాధవి ఉత్కంఠతో వింటుంది. ఆమె అణువణువు అతని జవాబుకై వేచి ఉంది.

"మీ ఇష్టం..." అన్నాడు.

మాధవి చెయ్యి కడిగేసుకుంది.

"హంసను రామ్మూర్తిని తీసుకువెళ్ళ ఓపిక లేదు, లేచినప్పుడు పంపండి" అని వెళ్ళిపోయింది.

అప్పుడప్పుడూ హంస అలా పడుకోవటం అలవాటే, అందుకే ఎవరూ పట్టించుకోలేదు.

## 19

**మా**ధవికి కొన్న ఫ్లాట్, కంపెనీ వారిచ్చిన క్వార్టర్సు రెండూ ఒకేసారి దొరికాయి. ఆమె క్వార్టర్సులో ఉంటే హంసకు దూరం అవుతుంది. స్వంత ఫ్లాట్ లో ఉంటే, తను రోజూ ముప్పయి ఆరు కిలోమీటర్లు ప్రయాణం చెయ్యాలి. ఎటూ తేల్చుకోలేకపోతుంది.

విష్ణువర్ధన్ వివాహం నిశ్చయం అయిన దగ్గరనుండీ, అతన్ని దూరం నుండి చూస్తుంది. మునుపటి అంత చనువుగా మసలటం లేదు. దానికి తోడు అతనికి టూర్స్ పడుతున్నాయి. ఆలస్యంగా వస్తున్నాడు.

"మాధవీ! కంగ్రాచ్యులేషన్స్, కొలీగ్స్ చెప్పారట కదా!" విష్ణువే పలకరించాడు. నల్లని ప్యాంటు పైన తెల్లని స్లెట్టర్‌తో అతను ఎంతో హుందాగా ఉన్నాడు.

"ఏమిటి థాంక్స్ అయినా చెప్పవే? భలేవారు." అన్నాడు నవ్వుతూ.

అతని ఉత్సాహము చూస్తుంటే ఆమెకు సన్నగా మంట ప్రారంభమయింది. ఇకంతా పెళ్ళి అవుతుందన్న సంతోషం కాబోలు. వెంటనే విశేషణ మేలుకుంది. తను ప్రేమించినట్టు, అభిమానించినట్టు అతనికేం తెలుసు.

"ఒకసారే థాంక్స్ చెబుతాను - మీ సలహా కావాలి"

"సలహాలు ఉచితంగా చెప్పబడవు."

"ఏమిటండోయ్! ఈ హుషారు! పెళ్ళికొడుకు కళ వచ్చేసిందే." అన్నది. అతను నవ్వాడు.

"ఓహో...అదా, నేను అన్నయ్య వెళ్ళిన మరు క్షణమే ఆ విషయం మరిచిపోయాను. అది కాదండీ, మిస్టర్ కీత్ పిలిచి ఏమన్నాడో తెలుసా. 'మిస్టర్ విష్ణూ! నువ్వు ఒక వెలలేని మాణిక్యాన్ని మన కంపెనీకి పరిచయం చేశావు' ఆ వెలలేని మాణిక్యం ఎవరని అడగరేం?" అన్నాడు.

"ఎవరు?"

"మీరు. అతను అరగంట పొగిడేశాడు. అసూయతో అసిజగా ఫీలయ్యాను. అవన్నీ చెప్పను..." అతనిమాట పూర్తికాక ముందే ఆమె పక, పక నవ్వింది.

"అంటే...అంటే ఈ డబ్బు ఇవ్వనంటావా?"

"అవును. అదికట్టి, ఇన్‌స్టాల్‌మెంటుపై కారు కొనుక్కుంటాను." అన్నది. అతను చర్రున లేచాడు.

"పదవే...ఓ ఇంటిదానా! ఇక్కడ మనకు ఏముంది? ఈ చాకిరీ చేస్తే ఇంతకూడు ఎవరన్నా వేస్తారు. కారు కొనుక్కుని ఊరేగుతుందేమో...ఊరేగనీ..." అని రక, రకాల శాపనార్థాలు పెట్టి, భార్యను తీసుకుని వెళ్ళిపోయాడు పాపారావు. అతనికి తెలుసు, మాధవి రాజీకి వస్తుందని, ఆమెకు ఇంటిపని - వంటపని రాదు. భార్య కూడా వెళ్ళింది.

మాధవి తేలికగా నిట్టూర్చింది. ఆరోజే ఆమె వంట ప్రారంభించింది. తనకు వచ్చిందేదో చేసింది. సూట్‌కేస్, తీసి హంస అన్నీ సర్దింది. అందులోనుంచి రెండు ఫోటో ఆల్బమ్స్ తీసింది. అవి చూస్తూ కూర్చుంది హంస.

మాధవి వచ్చి స్నానం చేసింది. సెలవు కాబట్టి ఫరవాలేదు. మర్నాడు వంట మనిష్ని అప్పుడింటే. ఓ ఫ్రిజ్ కొనుక్కోవాలనుకుంది. తల చిక్కు తీసుకుంటూండగా విష్ణువర్ధన్ వచ్చాడు.

"మీ నాన్న వచ్చారు మాధవీ! మిమ్మల్ని చాలా పొగిడి వెళ్ళాడు." అన్నాడు.

నవ్వింది మాధవి.

"అది నేను భారతదేశంలో అడుగు పెట్టినప్పటినుండి చేస్తున్నారు. కానీ ప్రాగుబాటులా?"

"మీరు కలుపుతారా!"

"అంత భయం అక్కరలేదులెండి. నెస్ తెస్తాను మీరే కలుపుదురుగాని..." అని లోపలికి వెళ్ళింది.

"డాడీ! మీరు ఆల్బమ్ చూస్తుండండి. ఒక్కనిముషం అదిగో, ఆ ఎదురు క్వార్టర్‌లో అమ్మాయితో పరిచయం చేసుకుంటాను." అని హంస పరుగెత్తింది.

పాలు, పంచదార కాఫీటిన్ను తెచ్చింది మాధవి.

"మాధవీ! నీతో పాటు వీళ్ళు ముగ్గురు ఎవరు?" ఖంలో రంగులు మారుతుంటే అడిగాడు.

"ఏది..." వంగి చూచింది. నల్గురు అమ్మాయిలు అంతా రెండుజడలు వేసుకున్నవారు, ముందుకు జడలు వేసుకుని, రెండు చేతులు ఒకచోట ముడిచిపెట్టి నిల్చున్నారు.

"ఇంటర్ చదివేటప్పుడు తీయించిన ఫోటో. మొదటి అమ్మాయి ప్రేమలత, రెండు నేను, మూడు విద్యుల్లత, నాల్గు స్నేహలత. భలేగా ఉండేది. అందరం లత పేరున్న వారం కలిసి తిరిగేవారం." అన్నది, ఆ రోజులు తలుచుకుంటూ.

"పెళ్ళిద్దరూ అక్కచెల్లెండ్లు కదూ!" ప్రేమను స్నేహను చూపాడు.

"అవును. నిజానికి స్నేహలత మా క్లాసుమేటుకాదు. అక్కతో వచ్చి మా జట్టులో చేరింది. మాధవక్కా! నువ్వే నా అక్కవు కాలేదు! అని బాధపడేది. అంతకంటే పెద్ద

బంధం ముడి పెట్టింది." అన్నది, ప్రక్క కుర్చీలో కూర్చుని కాఫీ కలుపుతూ.

"నా కర్థం కాలేదు మాధవీ..."

"మేము రామచంద్రాపురం వచ్చాము. ఆ అమ్మాయి ప్రేమాయణం సాగించింది. ఫలితమే హంస..."

ఒక్క సారి అదిరి విష్ణువర్ధన్ లేచాడు.

"మాధవీ... ఏమన్నావ్ ?" ఆమె రెండు భుజాలు గుచ్చి పట్టి అడిగాడు.

"నిజమే విష్ణూ! ప్రేమ నా క్లాసుమేటు ఫ్రెండు. ఒకటి రెండుసార్లు స్నేహలత వచ్చింది. మా విద్యుల్లత బంధువే కమల, మా ఊరమ్మాయి. ప్రేమవచ్చి, స్నేహకు వచ్చిన కష్టం గురించి చెబితే, ఆ పాపను నేనే పెంపు ఇప్పించాను."

"ఏం కష్టమని చెప్పింది?"

"ఎవరో ప్రేమించి, పెళ్ళిచేసుకుంటామని, మోసం చేశారట."

"డర్టీబిచ్! ప్రేమా! నీకెవరు పెట్టారో ఆ పేరు..." పళ్ళు కొరికాడు.

"స్నేహకు తెలివివచ్చాక పాప పోయిందని చెప్పారు. హంసను కలుసుకుని, వివరాలు తెలిశాక, నేను గిల్టీగా ఫీలయ్యాను..."

"ఓ మాధవీ... ఇంత మంచివార్త స్పష్టంగా చెప్ప లేదు." అమాంతం ఎత్తి గిర, గిర తిప్పాడు.

"విష్ణూ!...అబ్బ దించండి..." మాధవి అతని భుజాలపై కొట్టింది. అతను దించినట్టే దించి, మళ్ళీ దగ్గరకు లాక్కొని ఆమె నుదురు, బుగ్గలు చుంబించాడు.

"అబ్బా! మాధవీ, అమృతం ఉండే అడ్రసు తెలియదు, తెలిస్తే నీ నోట్లో పోసేవాడిని. నా పాప...నా బిడ్డ... హంస..." అన్నాడు మాటలు పెగల్చుకుంటూ.

అతని మాటలు విన్నారో, లేదోగాని అప్పుడే హంసను వెంటబెట్టుకుని లోపలికి వచ్చిన చంద్రశేఖర్ వాళ్ళిద్దరిని చూచాడు. విష్ణు అదేం గమనించలేదు. లోపలికి వస్తున్న హంసనెత్తుకుని, మాటలు రానట్టు, ఆ అమ్మాయిని వదిలివేస్తే యెవరన్నా యెత్తుక పోతారేమో అన్నంత ఇదిగా నిలబడిపోయాడు.

"డాడీ!... అంకుల్ వచ్చారు."

"రా అన్నయ్యా!"

చంద్రం గంభీరంగా లోపలికి వచ్చాడు. మాధవిని, విష్ణుని మార్చి, మార్చి చూచాడు. మాధవి విష్ణు చొరవకి, అది చంద్రం కళ్ళల్లో పడ్డందుకు చాలా బాధపడింది.

"హంస...హంస నా కూతురన్నయ్యా..." వివరాలు చెప్పటానికేదో అడ్డుపడినట్టు అనుభూతి చెందాడు.

"అబ్బ! వదులు డాడీ..." హంస వదిలించుకుని బయటికి వెళ్ళింది.

"ఇప్పుడు చెప్పు. నువ్వు ప్రేమించిన..." మాధవి వైపు అనుమానంగా చూచి ఆగిపోయాడు.

"అన్నయ్యా! స్నేహాకు పుట్టిన బిడ్డ చనిపోయిందని అబద్ధం ఆడారు."

"అవును యెప్పుడో అన్నాను."

"అప్పుడు నాకు తెలియదు. ఇప్పుడు మాధవి చెప్పింది." ఆమె చెప్పిన వివరాలు చెప్పాడు.

"అలాగా! నేను నీకోసం వస్తే, పిల్లలు ఇక్కడుంటారని చెప్పారు, ఇన్విటేషన్ కార్డ్స్ సెలెక్ట్ చెయ్యాలికదా." అన్నాడు.

"అన్నయ్యా! ఒక్కసారి హంస విషయం వాళ్ళతో చెప్పు - అంగీకరిస్తే పేచీయే లేదు." అన్నాడు.

"బావుందిరా! హంసకోసం యెన్నో మాటలు భరించి, తనకంటూ ఏం లేకుండా వదులుకున్నది మాధవి - నీ కిస్తుందా ?"

విష్ణుకు ఒక్కసారి నీరసం ఆవహించింది. నిజమే తన జన్మకారకుడు, అంతకంటే ఏం చేశాడు! ఏమీ చెయ్యలేకపోయాడు. అతను అసహాయంగా మాధవివైపు చూచాడు.

"మీరు యెలా రాజీ పడతారో మీ ఇష్టం. శుక్రవారంనాడు గుడిలో క్లుప్తంగా వివాహం జరిపించాలి." అన్నాడాయన.

"అన్నయ్యా! కొంత సమయం ఇవ్వకూడదూ." అన్నాడు.

"ఏరా! పిల్లలాట అనుకుంటున్నావా! అవతల పరువు గల కుటుంబం" అన్నాడు కోపంగా.

వాళ్ళిద్దరూ అలా ఉండగానే అతను వెళ్ళిపోయాడు.

విష్ణువర్ధన్ ఒక్కసారి స్పృహ వచ్చిన వాడిలా మాధవి దగ్గరకు వెళ్ళాడు. ఆమె రెండు చేతులు బల వంతంగా లాగి, కళ్ళకు అద్దుకున్నాడు.

"మాధవీ...నేను...నేను నీకు కృతజ్ఞతలు చెప్ప లేను..." అన్నాడు.

"కృతజ్ఞతలు దేనికి? హంస ఎవరో తెలిసి పెంచ లేదు కదా. అందులో నేను అభిమానించే వ్యక్తి కూతురంటే ఇంకా దగ్గరయినట్టు అనిపిస్తుంది." అన్నది తల వంచుకుని.

"మాధవీ...మాధవీ..." అతను ఆమె భుజాలు పట్టి కుదిపాడు. ఆమె తల ఎత్తలేక పోయింది.

"మాధవీ...నువ్వు...నువ్వనేది నిజమా!"

నిజమే అన్నట్టు తలాడించింది.

అతను చప్పున ఆ తలను తనగుండెలకు ఆన్చుకున్నాడు.

"మధూ...నేను...నేను అభిమానిస్తూ కూడా, మీ నాన్నగారి కులంపిచ్చి గమనించి, దూరం ఉన్నాను. ఒక్కసారి విఫలమైన ప్రేమ పేరు మళ్ళీ ఎత్తాలనుకోలేదు" అన్నాడు - ఆమె వెంట్రుకలతో ఆడుకుంటూ.

ఆమె జవాబు చెప్పలేదు. అతని గుండెల దగ్గర షర్ట్ మొత్తం తడిసిపోయింది.

"మాధవీ...నీ కంట తడి..." నో అతను ఆమె తల యెత్తి కళ్ళు ఒత్తాడు.

అతను నిలబడలేనట్టు, ఆమెను పట్టుకుని అలాగే కూర్చుండిపోయాడు. మాధవి అతనికి దూరం జరిగే ప్రయత్నము చెయ్యలేదు.

"నో...నో మాధవీ! ఇప్పుడే అన్నయ్యతో వెళ్ళి చెబుతాను. హంస మన దగ్గరే ఉండాలి..." అన్నాడు.

మాధవి మెల్లగా లేచింది. కళ్ళు ఒత్తుకుంది.

"నా తల్లి తండ్రి శపించినట్టు, నాకు వివాహ యోగం లేదు. నేనే బంధువులందరికీ దూరం అయ్యాను. నువ్వూ కావటానికి వీలులేదు." అన్నది.

"నా మాట విను మాధవీ! మా అన్నయ్య మరీ అంత రాక్షసుడు కాడు" అన్నాడు.

"కాకపోయినా ఆత్మాభిమానం గల వ్యక్తి విష్ణూ! ఈ అవమానం సహించలేడు. ఆలస్యం అమృతం విషం అని యెందుకన్నారో ఇప్పుడు అర్థం అవుతుంది. ఆ రాత్రే... హంసను తిరిగి తెచ్చిననాటి రాత్రే చెప్పాలనుకున్నాను..." అన్నది ఆపి, ఆపి మాట్లాడుతూ.

"చెప్పలేదేం?...మాధవీ, నువ్వు చాలా అన్యాయం చేశావు...చాలా అన్యాయం చేశావు" అన్నాడు ఆవేశంగా.

"నేను కాదు విష్ణూ! మీ అన్నయ్యే... మీ అన్నయ్యే చేశాడు. ఆరోజు నేను వస్తానని చెప్పగానే, నా నోరు మూతపడింది." అన్నది నవ్వుతూ.

"తరువాతయినా చెప్పవలసింది, మాధవీ!"

"యెలా చెప్పను! ఆ రాత్రి మీ అన్నయ్య మీ వివాహ ప్రసక్తి తెస్తే మీరు వెంటనే అంగీకరించారు. యెంత చదివినా, యెంత ముందంజ వేసినా, ఒక స్త్రీని..."

"ఓహ్!..." అతను తోచనట్టు జుట్టులోకి చేతులు పోనిచ్చాడు. మాధవికి అతని వడిలోనుండి లేవాలని లేదు - అలాగే కూర్చుంది.

"లే మాధవీ..." అతని గొంతులో యెంతో గాంభీర్యం ధ్వనించింది.

"వద్దు విష్ణూ! నువ్వు పరాయివాడివయినా, హంస తండ్రిగా, నాకు ఆత్మీయుడివిగా, స్నేహితుడుగా మిగిలిన వ్యక్తివి. యెటూ రెండు, మూడు రోజులలో పరాయి వాడివి కాబోతున్నావ్!" అంటుంటే ఆమె కళ్ళనుండి నీరూరింది.

"మాధవీ..." అతను ఆమెను దగ్గరగా లాక్కున్నాడు.

"ఈ...అనుభూతి వల్ల వచ్చే...పాప పుణ్యాలు ఏవయినా ఉంటే...అవి నావే...అవి నావే..." అన్నది భారంగా.

"మమ్మీ!...డాడీ...మీ పోట్లాట పోయిందన్న మాట" హంస చప్పట్లు కొడుతూ వచ్చేసింది.

"ఓ...!" ఉలిక్కిపడి ఇద్దరూ దూరం జరిగారు. ఇద్దరి మధ్య దూరిపోయింది. ఇద్దరి భుజాలపై చేతులు వేసింది.

"మమ్మీ...ఆకలి..." అన్నది. మాధవి లేచింది. ...ల గోళ్ళతో కట్టి ముడి వేసుకుంది.

"రండి విష్ణు! నేను చేసిన వంట నచ్చకపోతే వెళ్ళి హోటల్లో తిందాము" అన్నది.

ఆమె వడ్డించబోతే, బీరకాయ కూర నీరుగారింది. విష్ణు ఫ్రయింగ్ పాన్‌లో వేసి పొడిగా చేశాడు.

"బీరకాయ కుక్కర్‌లో పెట్టకూడదేమో మధూ..."

'జీవితాంతం ఈ మనిషి నాకు సహాయం చేస్తే...' అన్న ఊహ ఆమెను ఏదో లోకంలోకి తీసుకువెళ్ళింది.

"నువ్వుకూడా రా మాధవీ..." అన్నాడు. ఆమె వచ్చింది. మాట్లాడుతూ భోజనం చేశారు.

"డాడీ! మీరిక్కడే ఉండండి. అంకుల్ మమ్మీ, డాడీలుంటారు." అన్నది బుంగమూతి పెట్టి.

"మీ మమ్మీకిష్టం లేదు." అన్నాడు నవ్వుతూ.

"ఊహు! మమ్మీకి నేను చెబుతాను." అన్నది.

"మరి నువ్వు రికమండ్ చేస్తే ఉంటాను." అన్నాడు.

హంస సంతోషంగా, బల్ల సర్దుతుంది.

"దానికి ఆశపెట్టవద్దు. ఒక్క చిన్నకోరిక విష్ణు!"

"చెప్పు మధూ! నువ్వు నా ప్రాణం అడిగినా ఇస్తాను." అన్నాడు.

"ప్రాణం వద్దులే. ఆదివారం...అపీనెలలో ఒకనాడు... కాదు ఒక్కపూట మాతో గడపగలరా..." అన్నది.

"లాభంలేదు మధూ! వివాహము చేసుకున్నాక ఆ బంధానికి కట్టుబడాలి కదా" అన్నాడు.

అడిగి వెలితిపడ్డానే అనుకుంది. ఆమెకు అవమానం అనిపించింది. అలాగే నిలబడిపోయింది. అతను హంసను ముద్దు పెట్టుకుని వెళ్ళిపోయాడు. మాధవి శూన్యంలోకి చూస్తూ కూర్చుండిపోయింది.

# 20

కావాలనే హంసను స్కూలు పిల్లలతో పాటు పిక్నిక్కు పంపింది. వాళ్ళంతా దగ్గరున్న తోటలకు వెళ్తున్నారు. తప్పక ఆరాలు తీస్తుందాపిల్ల. తండ్రి పెళ్ళంటే కుతూహలం కనబరుస్తుంది. ఆఫీసుకు సెలవు చీటీ పంపింది.

విష్ణువర్ధన్ కోసం వాచీ ఒకటి కొన్నది. ఒక రోజు అతను వాచీ నచ్చిందని జేరంఆడి అద్దం పగులు చూపిందని వదిలేశాడు. అలాంటిదే కొత్తస్టాకు వచ్చింది.

తెల్ల కంచి పట్టుచీర కట్టుకుంది. వివాహం జరిగే స్థలానికి వెళ్ళింది. తెల్లని గ్లాస్కో పంచె, ఆఫ్‌వైట్ పట్టు లాల్చీలో అందంగా వున్నాడు విష్ణువర్ధన్.

అతని కుటుంబ సభ్యులు, స్నేహితులు తప్ప ఎవ రేరు.

"హల్లో!" చిరునవ్వుతో పలుకరించాడు.

'ఇంత సంతోషంగా, నిబ్బరంగా యెలా ఉన్నాడు?' అతని వెనుకే నడిచింది. అందరూ ఫలహారాలు చేస్తున్నారు.

"వదినా, మాధవి వచ్చింది." అన్నాడు.

కాంతం యెదురు వచ్చి ముసి, ముసిగా నవ్వుతూ తీసుకు వెళ్ళింది, అక్కడవున్న గదిలోకి.

"ఫలహారం చేస్తావా?"

యెవరో పిలవగానే కాంతం వెళ్ళిపోయింది.

విష్ణు వచ్చాడు. అతన్ని చూచి చిన్నగా నవ్వుతూ, వాచీ ఇచ్చింది.

"అందరిలో ఇవ్వాలంటే మొహమాటం." అన్నది, నవ్వలేక నవ్వుతూ.

అతను చేయి ముందుకు చాపాడు, కట్టమన్నట్టు.

"ఊహు, యెవరన్నా చూస్తే..."

"చూడు సుధా! పెళ్ళికూతురు మారింది... కాదు, కాదు వాళ్ళకు నిజంచెప్పి, మార్పించాను." అన్నాడు.

ఒక్కసారి ఆమె ముఖంలో రక్తం పొంగుకు వచ్చింది.

తలయెత్తి విష్ణువంక చూడలేకపోయింది. నిబ్బరంగా అతని చేతికి వాచీ కట్టింది.

'అతని సంతోషాన్ని, ఉత్సాహాన్ని యెంత అపార్థం చేసుకుంది.'

"వదినా! మీచెల్లాయి ప్రాణిగ్రహణం చేసేసింది." అన్నాడు నవ్వుతూ.

"నీవు ఎంత నిలకడలేని మనిషివో నాకంటే మాధవికి బాగా తెలుసు. అందుకే ఆ జోడీ వేస్తుంది." అన్నది నవ్వి కాంతం.

"ఇదిగో ఇలాంటి విషయాలు నేర్పించకుమరి..."

"మీ ఆయన జాణతనం చూడమ్మా! అన్నగారు వివాహం అనగానే అపర లక్ష్మణుడిలా యెందుకు తలా డించాడు. అప్పుడు నువ్వు యెదురుగానే ఉన్నావుకదా! అత్తయ్య చనిపోతూ, నిన్న-హంసను కోడలు మనుమరాలిగా ఊహించుకొని తృప్తిగా కన్ను మూసిందని, చెప్పనే చెప్పాడు." అన్నది నిష్ఠూరంగా.

"వదినా! ఈ తోటి కోడరికం భరించలేక మధు పారి పోతుంది." అన్నాడు.

"అవునవును. మీ అన్నతమ్ముల మధ్య నలిగిపోయింది నేనంటే నమ్మవేం?" అన్నది కాంతం.

"నేను నమ్ముతానండీ" అన్నది మాధవి.

"హాతోస్మి, ఇద్దరు ఆడవారు కలిస్తే నా పని అయి నట్టే..." అని వెళ్ళిపోయాడు విష్ణు.

"నాకు చాలా సంతోషంగా ఉందమ్మా. నిన్ను చూచి యెన్నోసార్లు అనుకున్నాను - కులాలు వేరని ఊరుకు న్నాను. అత్తయ్య ఉంటే యెంత సంతోషించేదో..." అన్నది నిట్టూర్చి.

"మరి ...మరి... చంద్రశంగారూ... బావగారు ఏమన లేదా?"

"ఒక్కనాడు నేను నాల్గు మాటలు పడితే - పడతాను. జీవితాంతం వాడు సుఖపడతాడు అన్నారు" అన్నదామె.

"మాధవి వచ్చింది ఇంకా ఏమిటి ఆలస్యం?" అంటూ వచ్చాడు చంద్రం.

మాధవి చటుక్కున వంగి పాదాభివందనం చేసింది.

"లేమ్మా! మా అమ్మగారేరి?" అన్నాడు.

"పిక్ నిక్ కు వెళ్ళింది." అన్నది, అతని భావం అర్థం చేసుకుని.

"మంచిపని చేశావు. ఆ అమ్మాయి అడిగే ప్రశ్నలకు జవాబు చెప్పలేము." అన్నాడు.

మరో అరగంటలో క్లుప్తంగా వివాహం ముగిసింది. వచ్చినవారు భోజనాలుచేసి వెళ్ళిపోయారు.

"మాధవీ! వాడికెలాగు తల్లి తండ్రులు లేరు. మీకున్నారు, వెళ్ళిరండి." నిన్న నేనే పిలుద్దాం అనుకున్నాను. కాని ఈ కొద్దిపాటి పరిచయంలో మీ నాన్నను బాగా అర్థం చేసుకున్నాను. రాద్ధాంతం చేస్తారు. అసలే వాడిది, నష్ట జాతకం" అన్నాడు.

"తప్పకుండా వెళ్తాయండి" అన్నది.

కంపెనీ కారులో బయలుదేరారు. ఈ రోజు గమ్మత్తుగా ఉంది ప్రయాణం.

"మధూ! ఏదయినా మాట్లాడు."

"ఏం మాట్లాడాలి, బాధతో నేను రావటం మానే సే

నీకు సస్పెన్స్ కాస్త అభ్యాసు పాలవ్వొచ్చేది." అన్నది నవ్వుతూ.

"నువ్వు వస్తావని నాకు నమ్మకం"

"యెందుకో అంత నమ్మకం!"

"అది నా రహస్యం..."

"మీకు చాలా రహస్యాలున్నట్టున్నాయి." అన్నది కవ్వింపుగా.

జవాబుగా ఆమెచేయి అతని చేతిలో నలిగిపోయింది.

వాళ్ళు తమ్ముడి ఇంటిముందు దిగేసరికి, షామియానా వేసి ఉంది. మాధవి తమ్ముడికి కొడుకు పుట్టాడట - నామకరణోత్సవం జరుగుతుంది. చెల్లెండ్లు, మరదలు, బంధువులు అంతరు ఉన్నారు.

ఒక్క నిముషం మాధవి హృదయములో మొండి బాకు దిగినట్టయింది. అందరిని ఆహ్వానించి, తనకు చెప్పలేదు. ఆమె ఆరాటం గ్రహించినట్టే, ఆమె భుజాల చుట్టూ చేయి వేశాడు.

"మధూ! నువ్వు ఆశీస్సులు ఆశించి మాత్రమే వచ్చావు." అన్నాడు.

ఆమె ధైర్యంగా లోపలికి వెళ్ళి తండ్రిని పిలిచింది.

"నాన్నా! వీరు తెలుసు కదా, విష్ణువర్ధన్ గారు. మేమిద్దరం పెళ్ళి చేసుకున్నాము" అని వంగి నమస్కరించారు.

"వర్ణసంకరం జరగనే జరిగింది - ఇంకా నా ఆశీస్సు లెందుకు?" అన్నాడు తీవ్రంగా.

"చూడండి పాపారావుగారు! మీరు పెద్దలు, మాధవి తండ్రిగా ఆశీర్వదిస్తారని వచ్చాం. ఇంకా వర్ణసంకర మేమిటి ?" అన్నాడు.

"ఓహో ! పిళ్ళకు చాలా పరిచయం ఉంది నానా ఆ రోజు ఎక్స్‌పోర్ట్‌లో పరిచయం అని నాటకం ఆడారు అన్నాడు కొడుకు.

"చూడు బాబూ! నాటకాలు ఆడవలసిన అవసరమూ, అగత్యము మాకేం లేదు, పద మాధవీ..."

"ఒక్క నిముషం..." వెళ్ళి తల్లికి నమస్కరించింది. చెల్లెండ్లను పలుకరించింది. మరదలును విష్ణును పరిచయం చేసింది.

"మీరు అంతగా ఆశ్చర్యపోతున్నారెం చెయ్యకూడని పనేమి చెయ్యలేదు." అన్నది నవ్వుతూ.

తమ్ముడి భార్య, పరాయి ఇంటి అమ్మాయి అయినా తన సంస్కారం నిరూపించుకున్నది.

"ఉండండి వదినా! మీ అల్లుడిని చూడరూ ?" అని కుర్చీలు వేసింది. మాధవి కూర్చుని సాభిప్రాయంగా విష్ణు వంక చూచింది. అతను కూర్చున్నాడు. పసివాడ్ని తెచ్చి ఇచ్చింది. ప్లేటులో లడ్డూ, బూంది తీసుకొనివచ్చింది.

విష్ణు బాబు చేతిలో వందరూపాయలు పెట్టి, లడ్డు తిని లేచాడు. మాధవి అందరికీ చెప్పి, వచ్చి కారెక్కింది.

"మధూ! విచారంగా ఉందా?"

"లేదు వాళ్ళతో... నేను... పోనివ్వండి - పోగొట్టుకున్న దానికంటే ఈరోజు... నేను పొందింది చాలా విలువైనది... అపురూపమైనది..." అన్నది అతని భుజానికి ఆన్చి.

అతనేం మాట్లాడలేదు. ఒక్కమాట యెక్కువ మాట్లాడినా తన హద్దులు దాటవలసి వస్తుంది. యెదుట డ్రయివరున్నాడు.

ఇద్దరూ ఇంటిముందు దిగేసరికి హంస వచ్చింది.

"డాడీ..." పరుగెత్తుకు వచ్చింది.

"హంసా..." అతను కూతుర్ని యెత్తుకున్నాడు.

"హంసా! మీ డాడీతో పోట్లాడి, మనతో ఉండటానికి పిలుచుకుని వచ్చాను." అన్నది మాధవి.

"నిజంగా!... థాంక్యూ మమ్మీ... మై స్వీట్ మమ్మీ..." అతని చేతులలోనుండి, ఆమె దగ్గరకు వెళ్ళి తన రెండు చేతులలో ఆమె మెడను పెనవేసుకుంది.

"డ్రయివర్! నువ్వు వెళ్ళిపో..." అతనికి బహుమతి ఇచ్చి పంపాడు. హంస కబుర్లు వింటూ మురుస్తున్నారు.

మాధవి బట్టలు మార్చుకుని, టీ చేసింది.

ఎంత ఘాటు ప్రేమయో!

"డాడీ! రోజూ ఈ
లుకింగ్ స్టార్" అన్నది హంస.

"యూ నాటీ...?" ఆ
హంస స్నేహితుల దగ్గరకు
అతను అలసటగా ఉందని స

"వంట ఇప్పుడెందుకు మధ
అని లేచాడు. అప్పుడే క్యారియ
వచ్చాడు.

"బాబాయ్! నేనే క్యారియర్ తెచ
సోపాలు పడుతూ క్యారియర్ ఈడ్చుకు వచ్చాడు.

"యెందుకు సురేష్..." అని మొహమాటపడింది.

"నాకు చాలా పని ఉంది ... నాన్నగారేమో హంసను తీసుకొని రమ్మన్నారు" అన్నాడు సురేష్.

విష్ణువర్ధన్ మాధవి వంక చూచాడు. ఆమె ఎర్రబడిన ముఖం దించుకొని వద్దన్నట్టు తలాడించింది.

"రేపు తీసుకుని వస్తానని చెప్పరా. అలాగే భోజనం పంపినందుకు బండెడు థ్యాంక్స్ అని అమ్మకు చెప్పు"

"బండి తీసుకురాలేను, బస్సులో మోసుకుపోలేను. రేపు చెప్పు" అని తుర్రుమన్నాడు.

హంస తెలివయినదో, లేక కమల మాటల వల్ల ఆరి తేరినదో తెలియదుగాని, ఆ పిల్ల తన బొమ్మల గదిలోకి వెళ్ళింది.

ండుకో డియర్..." మ

వ్వ ఒక్కదానవని పడుకున్నా
కు నిద్ర ముంచుకు వస్తుంది." అ
ట్ లైటు వేసి, కిటికీ తెరలు దిం
కుని వచ్చింది.

స్ట్ పట్టుకుని వచ్చింది.

దిండ్లకు ఆనుకుని కూర్చున్నా

"ఒక్క నిముషం విష్ణూ! ప్లీస్..." అవలీల
గిరాటు వేశాడు. ఆమె అసహాయంగా అతని చేతులలో
చిక్కుకుపోయింది.

"ఓ..." ఆమెను మాట్లాడనీయలేదు.

"పాలు... అన్న కేకకు విష్ణు మేలుకున్నాడు. తన
మోచేతిలో తలవాల్చి నిదురపోతున్న మాధవి తలను
నెమ్మదిగా దిండుమీదకి చేర్చి లేచి వచ్చి తలుపు తీశాడు.
పాలప్యాకెట్టు లోపలపెట్టి, గదిలో వచ్చి మంచంపై వాల
బోతూంటే రాత్రి తను పారేసిన ఉత్తరాలు కనిపించాయి.
నెమ్మదిగా ఎత్తి బల్లమీద పెట్టబోయి, చిరపరిచితమైన
దస్తూరి చూచి ఒక్కసారి ఉలిక్కిపడ్డాడు.

అది మాధవిదని కూడా మరచిపోయాడు. ఆత్రుతగా
విప్పాడు.



## మనసు ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | TPLA131B132 |
| పుస్తకం పేరు | ఎంత ఘాటు ప్రేమయో |
| తారీఖు | 30/10/24 |
| ముందు అట్ట | NO |
| వెనుక అట్ట | NO |
| మొత్తం పేజీలు | 225 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | NO |
| లేని పేజీలు | 1,2 |
| తయారు చేసినది | Apsar |
| పేజీలు విడదీసినది | Thasin |
| స్కాన్ చేసినది | Ch-Ramya |
| పరీక్ష చేసినది | THASIN |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| పరిస్థితి | good |